# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఇరవై నాలుగవ మహాసభ



# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ నివేదిక

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి

**యల్. ఐ. బ్రెజ్నెవ్**

సమర్పించినది

సంపుటి 5 **సోవియట్ సమీక్ష** ఏప్రిల్ 20

**17-18** **1971**

# సోవియట్ కమ్యూనిస్టు పార్టీ
# 24 వ మహాసభకు
# పార్టీ కేంద్రకమిటీ
# నివేదిక

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి

లియొనిద్ బ్రెజ్నెవ్

సమర్పించినది

1971 మార్చి 30

సంపుటి5, సం.17-18

సోవియట్ సమీక్ష
ఏప్రిల్ 20, 1971

A

**SOVIET SAMEEKSHA** (Telugu)

Vol. 5, Nos. 17-18
Apr. 20, 1971

# REPORT OF THE CPSU CENTRAL COMMITTEE TO THE 24TH CONGRESS OF THE COMMUNIST PARTY OF THE SOVIET UNION

*Delivered by*
**LEONID BREZHNEV,**
*General Secretary*
*of the*
*CPSU Central Committee,*
*March 30, 1971*

CONTENTS



సంపాదకుడు: వి. ఆర్. కుల్లంద
మేనేజింగ్ సంపాదకుడు : వై. యల్. ఖ్రొలోవ్
కళాకారుడు : ఇ. తలనోవ్

9 భారతీయ భాషల్లో
వెలువడే పత్రిక





మద్రాసులోని సోవియట్ దేశ కాన్సలేట్ జనరల్ కార్యాలయ సమాచారశాఖ
(44, త్యాగరాయ రోడ్, మద్రాసు-17) తరఫున ఎ. ఎ. ఫిలిపెంకోచే
శ్రీ వేంకటేశ్వరా ప్రింటర్స్, మద్రాసు-21లో ముద్రింపబడి ప్రచురింపబడినది.

3

విషయసూచిక



C



యల్. ఐ. బ్రెజ్నెవ్

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ప్రధాన కార్యదర్శి

కామ్రేడ్ ప్రతినిధులారా, ప్రియమైన అతిథులారా,

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 23 వ మహాసభ జరిగి ఐదేళ్ళు గడచిపోయాయి.

మన ప్రజల కృషి ముమ్మరంగా సాగిన సంవత్సరాలవి. పార్టీ రూపొందించిన ప్రణాళికలను అమలు జరపడంలో సోవియట్ ప్రజలు, కమ్యూనిస్టు నిర్మాణంలోని ప్రధాన రంగాలన్నిటిలోనూ గొప్ప విజయాలను సాధించారు.

మన సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ మరొక పెద్ద ముందంజ వేసిన సంవత్సరాలవి. పారిశ్రామికోత్పత్తి పరిమాణం గణనీయంగా పెరిగింది. వ్యవసాయరంగం స్థిరంగా అభివృద్ధి చెందుతూ వచ్చింది. విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక రంగాల అభివృద్ధిలో కొత్త అవధులను చేరుకోవడం జరిగింది. ఆ రంగాలలో సాధించిన సరికొత్త ఫలితాలను, నానాటికి మరింత విస్తృతస్థాయిలో ఉపయోగంలో పెడుతున్నారు. యావన్మంది సోవియట్ ప్రజల సంక్షేమాన్నీ, సంస్కృతినీ మరింత అభివృద్ధి పరచడంలో, దీని నంతటినీ ఆధారం చేసుకొని ఇంకా ముందుకు సాగడంలో మనం సఫలీకృతులమయాము. మన పార్టీ కార్యకలాపాల మూలార్థాన్ని, చివరకు వ్యక్తీకరిస్తున్నది ఈ లక్ష్యమే.

ఇవి సోషలిస్టు సామాజిక సంబంధాలూ, సోవియట్ ప్రజాస్వామ్యమూ జయప్రదంగా అభివృద్ధి చెందిన సంవత్సరాలు; సోవియట్ దేశంలోని జాతుల మధ్య సోదర మైత్రి మరింత వర్ధిల్లిన సంవత్సరాలు; మన మహారాజ్యమైన సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య రాజకీయ, రక్షణ శక్తిస్తోమతులు పెద్దగా పటిష్ఠమైన సంవత్సరాలు.

అంతర్జాతీయ పరిణామాల రంగంలో కూడా ఇవి, గొప్ప గొప్ప సామాజిక-రాజకీయ మార్పులు వచ్చిన సంవత్సరాలు; ఒక వంక శాంతి, స్వాతంత్ర్య, అభ్యుదయ శక్తులూ, మరొక వంక, పీడక, అభివృద్ధి నిరోధక, దురాక్రమణ శక్తులూ పరస్పరాభి

ముఖంగా మరింత తీవ్రంగా మోహరించి ఉన్న సంవత్సరాలివి. ఈ ప్రపంచ దిఙ్మండలం పై చాలసార్లు యుద్ధ ప్రమాదం కారుమేఘంలా అలముకుంది. కాని, ప్రతిసారీ కూడా, సామ్రాజ్యవాద అతిక్రమణలకు గట్టి ఎదురుదెబ్బ తగిలింది.

శాంతికోసం, దేశదేశాల భద్రతకోసం సాగే పోరాటానికి సోవియట్ దేశమూ, సోదర సోషలిస్టు దేశాలూ క్రియాపూర్వకమైన గొప్ప దోహదాన్ని చేకూర్చాయి. మన దేశం యొక్క అంతర్జాతీయ స్థానాలు మరింత పటిష్ఠమయాయి. ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నిర్వహిస్తూన్న పాత్ర ఇనుమడించింది. నేటి మూడు ప్రధాన విప్లవ శక్తులైన సోషలిజం, అంతర్జాతీయ కార్మికోద్యమం, దేశదేశాల ప్రజల జాతీయ విముక్తి ఉద్యమాల మధ్యగల మహత్తర బాంధవ్యం దినదిన ప్రవర్ధమానమూ, ప్రగాఢమూ అవుతూనే ఉంది.

గడచిన ఐదేళ్లు మన మహత్తర లెనినిస్టు పార్టీ మరింత పెరిగి పటిష్ఠమైన కాలం. ప్రజలతో దాని సంబంధాలు మరింత పటిష్ఠమై, యావత్తు సోవియట్ సమాజ జీవితంలోనూ దాని నాయకత్వ పాత్రా ఇనుమడించిన కాలమది. ఈ ఐదేళ్ళలోనూ పార్టీ, అనేక బృహత్ కర్తవ్యాలను నిర్వర్తించవలసి వచ్చింది. కమ్యూనిస్టు నిర్మాణంలో సేకరించిన అనుభవాన్ని క్రోడీకరించి పార్టీ, సూత్రబద్ధమైన, వాస్తవికతా దృష్టితో కూడిన విధానాన్ని రూపొందించింది. యావన్మంది సోవియట్ ప్రజలూ దీనిని ఆమోదించి, ఏకగ్రీవంగా బలపరుస్తున్నారు.

అక్టోబరు విప్లవ 50 వ వార్షికోత్సవం, వి. ఐ. లెనిన్ శతజయంతి ఉత్సవం— ఈ రెండు గొప్ప వార్షికోత్సవాల సందర్భంగా, సోవియట్ ప్రజల్లో బ్రహ్మాండమైన రాజకీయ వెల్లువా, శ్రామికోత్సాహమూ పెల్లుబుకిన సంవత్సరాలివి. పార్టీ రూపొందించిన ప్రణాళికలను ఆచరణ పూర్వకంగా అమలు జరపడంలో విశాల ప్రజాబాహుళ్యం నానాటికి మరింత చురుకుగా పాల్గొన్న సంవత్సరా లివి. యావన్మంది సోవియట్ ప్రజలూ, కమ్యూనిస్టు పార్టీ 24 వ మహాసభను, తమ జీవితాల్లో ఒక ప్రముఖమైన సంఘటనగా పరిగణిస్తున్నారు; దీని గౌరవార్థం నిర్దిష్టమైన ఘనకార్యాలనూ, నూతన ఘనవిజయాలనూ సాధించారు.

తన 24 వ మహాసభ నాడు మన లెనినిస్టు పార్టీ జీవశక్తులతో తొణికిసలాడుతూంది; నూతన అనుభవంతో పరిపుష్ఠిని పొంది ఉంది; ఏకశిలా సదృశంగా సమైక్యమై ఉంది; ఇదివరకు సాధించిన వాటి స్థాయీ, ప్రాధాన్యతలను పూర్తిగా గ్రహించి ఉంది: తన శక్తిని గురించిన ఆత్మవిశ్వాసమూ, మన భావిపురోగమనానికి రూపొందించిన పథకాలు సరియయిన వన్న ఆత్మవిశ్వాసమూ కలిగి ఉంది.

కామ్రేడ్స్, ఇప్పుడు సింహావలోకనం చేస్తూన్న కాలంలో పార్టీ కేంద్రకమిటీ, యావత్తు పార్టీ సాగించిన కృషి ఫలితాలను గురించీ, రాబోయే కొద్ది సంవత్సరాల్లో పార్టీ విధానం, దేశాభివృద్ధి క్రమాలకు సంబంధించిన కేంద్రకమిటీ అభిప్రాయాలు కొన్నిటిని గురించీ, ప్రస్తావించేందుకు నన్ననుమతించండి.

# I

# అంతర్జాతీయ రంగంలో సోవియట్ యూనియన్ స్థానం. విదేశాంగ రంగంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలు

కామ్రేడ్స్, ప్రపంచ రంగంలోని పరిస్థితి, మన ఆంతరంగిక పరిణామాన్ని బలంగా ప్రాభావితం చేస్తూంది. దీని దృష్ట్యా, పార్టీ కేంద్రకమిటీ, అంతర్జాతీయ సమస్యలపట్ల ఎంతో శ్రద్ధ చూపింది. సోవియట్ దేశ విదేశాంగ విధానానికీ, కమ్యూనిస్టు ఉద్యమంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలకూ సంబంధించిన అతిముఖ్య, అత్యవసర సమస్యలను గురించి, కేంద్రకమిటీ విస్తృత సమావేశాలు పదే పదే చర్చించాయి.

సోవియట్ యూనియన్ శాంతికాముక దేశం. అసలు మన సోషలిస్టు వ్యవస్థ స్వభావమే ఇందుకు కారణం. తక్కిన సోషలిస్టు దేశాలతో కలిసి, సోషలిజాన్నీ, కమ్యూనిజాన్నీ నిర్మించేందుకు, అనుకూలమైన అంతర్జాతీయ పరిస్థితులను నెలకొల్పడం; సోషలిస్టు దేశాల ఐక్యతా సంఘీభావాలనూ, పరస్పర మైత్రీ సౌభ్రాతృత్వాలనూ పటిష్ఠం చేయడం; జాతీయ విముక్తి ఉద్యమాలను బలపరచడం, తరుణ, వర్ధమాన దేశాలతో సర్వతోముఖ సహకారం నెరపడం; విభిన్న సామాజిక వ్యవస్థలుగల దేశాల మధ్య శాంతియుత సహజీవన సూత్రాన్ని ఏకరీతిగా బలపరచడం; సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తులను గట్టిగా తిప్పికొట్టి, మరొక ప్రపంచ యుద్ధం బారినుండి మానవ జాతిని కాపాడడం—సోవియట్ విదేశాంగ రంగంలో, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 23 వ మహాసభ నిర్దేశించిన లక్ష్యాలివి.

విదేశాంగ రంగంలో పార్టీ కేంద్రకమిటీ ఆచరణ పూర్వక కార్యకలాపాలన్నీ కూడా, ఈ లక్ష్యాలను సాధించాలన్న దృష్టితోనే కొనసాగాయి.

## 1. సోషలిస్టు దేశాల పరస్పర మైత్రీ, సహకారాలను మరింత అభివృద్ధి పరచేందుకు

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థయొక్క అధికతర సంఘీభావానికీ, అభివృద్ధికీ, సోదర సోషలిస్టు దేశాలతోనూ, వాటి కమ్యూనిస్టు పార్టీలతోనూ సంబంధాలకూ చెందిన సమస్యలపై కేంద్రకమిటీ తన దృష్టిని నిరంతరం లగ్నం చేస్తూంది.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థకు పాతికేళ్ళు నిండాయి. విప్లవ సిద్ధాంత, ఆచరణల అభివృద్ధి దృష్ట్యా, ఇవి అసాధారణంగా ఫలప్రదమైన సంవత్సరాలు. బ్రహ్మాండమూ, నిజంగా చరిత్రాత్మకమూ అయిన ప్రాధాన్యంగల అనుభవ సంపదను, సోషలిస్టు దేశాలు,

కమ్యూనిస్టు ఉద్యమానికీ, కార్మికోద్యమానికీ సమకూర్చాయి. ఈ అనుభవం నిరూపిస్తున్న దేమంటే:

—ఈనాడు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థలో భాగంగా ఉన్న దేశాల్లో దృఢంగా పాదుకొన్న సోషలిస్టు సామాజిక వ్యవస్థ, పెట్టుబడిదారీ విధానంతో సాగే చారిత్రక పోటీలో తన గొప్ప జీవశక్తిని నిరూపించుకుంది.

—అక్టోబరు మహా విప్లవంతో ప్రారంభమైన చారిత్రక ప్రగతిని, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఏర్పడి, పటిష్ఠం కావడం, మహా శక్తివంతంగా త్వరిత మొనర్చింది. ప్రపంచ పరివ్యాప్తంగా సోషలిజం విజయవంత మయ్యేందుకు కొత్త అవకాశాలు ఏర్పడ్డాయి. "సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ నిర్ణయాత్మకమైన శక్తి'' అని, 1969 లో జరిగిన కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల అంతర్జాతీయ మహాసభ చేసిన నిర్ధారణను జీవితం ధ్రువీకరించింది.

—అన్ని దేశాల ప్రజలకూ అత్యంత ప్రాముఖ్యంగల కర్తవ్యమైన, ప్రపంచ యుద్ధ నివారణ కర్తవ్యాన్ని సాధించేందుకు ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ గొప్పగా దోహదం కూర్చుతూంది.

—సామాజికాభివృద్ధి క్రమంలో సార్వత్రికమైన వాటినీ, జాతీయంగా ప్రత్యేకమైన వాటినీ సరిగా జోడించడం పైనే, సోషలిస్టు నిర్మాణంలో విజయాలు చాలవరకు ఆధారపడి ఉన్నాయి. సార్వత్రిక క్రమాలు (ఇవి, అన్ని సోషలిస్టు దేశాల అభివృద్ధి క్రమంలోనూ స్వతస్సిద్ధంగానే ఉన్నాయి) సోషలిజానికి మార్గాన్నీ, ఆ మార్గంయొక్క ప్రధాన లక్షణాలనూ నిర్ణయిస్తున్నాయని మనకు సైద్ధాంతికంగా తెలిసి ఉండడమే కాకుండా, ఆ విషయం ఆచరణలో ధ్రువపడింది కూడా. సార్వత్రిక క్రమాల ప్రభావం, నిర్దిష్ట చారిత్రక పరిస్థితులకూ, జాతీయ ప్రత్యేకతలకూ అనుగుణంగా, భిన్నరూపాల్లో ప్రదర్శితమవుతూ ఉంటుందన్న విషయం కూడా మనకు తెలుసు. సార్వత్రిక క్రమాలను ప్రాతిపదికగా చేసుకొనకపోతే, లేదా ఆయా దేశాల నిర్దిష్ట చారిత్రక ప్రత్యేకతలను దృష్టిలోకి తీసుకొనకపోతే, సోషలిజాన్ని నిర్మించడం అసాధ్యం. సోషలిస్టు దేశాల మధ్య సంబంధాలను అభివృద్ధి పరచడం కోసం ఈ రెండు అంశాలనూ సరిగా పరిగణలోకి తీసుకొనకపోయినా ఇది సాధ్యం కాదు.

నవ సమాజ నిర్మాణం సందర్భంలోనూ, దేశాల మధ్య నూతన, సోషలిస్టు తరహా సంబంధాలను నెలకొల్పే సందర్భంలోనూ ఉత్పన్నమయ్యే భౌతిక, ఆత్మాశ్రయ చిక్కులను అధిగమించే మార్గాలను వివేచన చేయడంలోనూ, ఆ మార్గాలను నిర్ణయించడలోనూ, మరింత ప్రగాఢమైన, మరింత వాస్తవిక దృష్టితో కూడిన వైఖరిని అవలంబించడం, ఈ పాతికేళ్ళల్లో సేకరించిన అనుభవం వల్ల సాధ్యమవుతూంది. ఉమ్మడి సోషలిస్టు విధా

నమూ, సోషలిస్టు దేశాల ప్రజల మౌలిక ఆశయాల, లక్ష్యాల ఏకతా ఉండడం వల్ల, మార్క్సిస్టు-లెనినిస్టు పార్టీలు గనుక సరియయిన విధానాన్ని అనుసరించినట్లయితే, ఈ చిక్కులను జయప్రదంగా అధిగమించడమూ, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థను అభివృద్ధి పరచి, బలపరచడమనే ఆశయాన్ని స్థిరంగా ముందుకు తీసుకుపోవడమూ సాధ్యమవుతుంది.

సోదర దేశాల, పార్టీల అనుభవ సంపదకూ, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థను అభివృద్ధి పరచి, పటిష్ఠ మొనర్చాలనే ఆశయానికీ గత ఐదేళ్ళ కాలంలోనూ గణనీయమైన దోహదం చేకూరింది. గత ఐదేళ్ళలోనూ సోషలిస్టు దేశాల ఆర్థిక శక్తిస్తోమతులు పెద్దగా పెరిగాయి, సోషలిజం యొక్క రాజకీయ పునాదులు బలపడ్డాయి, ప్రజల జీవన ప్రమాణాలు పెరిగాయి, సంస్కృతీ, విజ్ఞానశాస్త్రమూ మరింత వికసించాయి.

అదే సమయంలో, సోషలిస్టు ప్రపంచంలో కొన్ని ఇబ్బందులూ, చిక్కులూ ఎదురవుతూనే వచ్చాయన్న విషయం అందరికీ తెలిసినదే. ఆయా దేశాలకూ, సోవియట్ దేశానికీ మధ్యగల సంబంధాల పరిణామంపైని దీని ప్రభావం కూడా పడింది. అయినప్పటికీ, సోషలిస్టు దేశాల పరస్పర మైత్రీ, సంఘీభావాలను పటిష్ఠ మొనర్చాలనే ప్రబలమైన ధోరణిని ఇదేమీ మార్చలేదు. సోదర దేశాలతో మన సహకారం, మొత్తంమీద అన్ని రంగాల్లోనూ జయప్రదంగా అభివృద్ధి చెందుతూ, బలపడుతూనే ఉంది.

సోదర దేశాల కమ్యూనిస్టు పార్టీలతో సహకారాన్ని అభివృద్ధి పరచడానికి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ప్రత్యేక ప్రాధాన్యాన్ని ఇస్తూంది. ఈ సహకారం, ఒకరి అనుభవాన్ని ఒకరికి అందజేసి మనకు పరిపుష్టిని చేకూర్చుతూంది. సోషలిస్టు, కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన మౌలిక సమస్యలను పరిష్కరించేందుకూ, అత్యంత హేతుబద్ధమైన ఆర్థిక సంబంధాల రూపాలను కనిపెట్టేందుకూ, విదేశాంగ వ్యవహారాల్లో ఒక ఉమ్మడి పంథాను సమిష్టిగా రూపొందించేందుకూ, సిద్ధాంత, సాంస్కృతిక రంగంలో కృషికి సంబంధించిన సమస్యలపై ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలుసుకునేందుకూ ఈ సహకారం మనకు అవకాశం కలిగించింది.

సమీక్షిస్తూన్న కాలంలో, సోదర పార్టీల, దేశాల విదేశాంగ రంగ కార్యకలాపాల సమన్వయీకరణ విషయంలో ముఖ్యమైన విజయాలను సాధించడం జరిగింది. ఈ కాలంలోని అతి ముఖ్యమైన అంతర్జాతీయ సమస్యలూ, ఘటనలను గురించి, సోషలిస్టు దేశాల ప్రతినిధులు, వివిధ స్థాయిల్లో సమిష్టిగా ఆలోచించారు.

విదేశాంగ రంగంలో సోదర దేశాల కార్యకలాపాలను సమన్వయీకరించే ముఖ్య కేంద్రంగా వార్సాసంధి సంస్థ ఇంతవరకూ, ఇప్పుడూ కూడా ఉంది.

యూరప్‌లో శాంతిని బలపరిచేందుకు వార్సాసంధి దేశాలు, చొరవ తీసుకుని

సమగ్రమైన కార్యక్రమాన్నొకటి ప్రతిపాదించాయి. ఇప్పుడున్న సరిహద్దులను మార్చకుండా చూడాలి అన్న కోర్కె ఈ కార్యక్రమానికి మూలాధారం. ఈ కార్యక్రమాన్ని రూపొందించేందుకూ, నిర్దిష్టం చేసేందుకూ, రాజకీయ సమాలోచనా కమిటీ అనేక సమావేశాలు జరిపింది.

జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్కులోని సైనికవాదులకు అణ్వాయుధాలను అందుబాటులోకి తేవాలని, ఉత్తర అట్లాంటిక్ కూటమిలో ఉన్న పథకాలు నెరవేరలేదు. ఇది కూడా, వార్సాసంధి రాజ్యాలు సాధించిన రాజకీయ విజయాల్లో ఒకటి అన్నది నిస్సందేహం.

జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్ యొక్క అంతర్జాతీయ స్థానాలను బలపరచడం యూరప్‌లోని పరిస్థితిని సుస్థిరం చేయడానికి ఎంతో ముఖ్యమైనది. సోషలిస్టు దేశాల సమిష్టి కృషివల్ల, ఈ సమస్యను పరిష్కరించడంలో కూడా గణనీయమైన ప్రగతి సాధ్యమయింది. హాల్‌స్టీన్ సిద్ధాంతం అని చెప్పుకుంటున్నది భగ్నమయింది. జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్‌ను ఇప్పటికప్పుడే 27 దేశాలు గుర్తించాయి. ఈ పరిణామం ఇంకా కొనసాగక తప్పదు.

సామ్రాజ్యవాదుల జోక్యాన్ని ప్రతిఘటించి వియత్నాం ప్రజలూ, ఇండోచైనాలోని తక్కిన దేశాల ప్రజలూ సాగిస్తూన్న పోరాటానికి సోవియట్ దేశమూ, ఇతర సోషలిస్టు దేశాలూ ఆచరణ పూర్వకంగా, ఏకరీతిగా అందజేస్తూన్న సహాయం అతిముఖ్యం. మధ్య ప్రాచ్యంలో సోషలిస్టు దేశాలు తీసుకున్న చర్యలు, అరబ్బు దేశాల్లోని ప్రగతిశీల ప్రభుత్వాలను కూలగొట్టేందుకు సామ్రాజ్యవాదులు పన్నిన పన్నాగాలను భగ్నం చేయడంలో ఒక నిర్ణయాత్మక అంశంగా పరిణమించాయి.

ఐక్యరాజ్య సమితిలోనూ, తదితర అంతర్జాతీయ సంస్థల్లోనూ, సోషలిస్టు దేశాలు కలిసికట్టుగా వ్యవహరిస్తూ, కీలక అంతర్జాతీయ ప్రాధాన్యంగల అనేక ప్రతిపాదనలు చేశాయి. ఈ ప్రతిపాదనలపై ప్రపంచ దృష్టి లగ్నమై ఉంది.

సమిష్టి నిర్ణయాల ఫలితంగానూ, అనేక చర్యలను అమలు జరిపినందువల్లనూ, ఇటీవలి సంవత్సరాల్లో వార్సాసంధి రాజ్యాల సైనిక వ్యవస్థ మరింత మెరుగయింది. బంధు రాజ్యాల సాయుధబలాలు ఉన్నత స్థాయిలో సర్వ సంసిద్ధంగా ఉన్నాయి; సోదర దేశాల ప్రజల శాంతియుత కృషికి హామీ ఇవ్వగల స్థితిలో ఉన్నాయి.

కామ్రేడ్స్, ఒక్కమాటలో చెప్పాలంటే, సోషలిస్టు దేశాల బహుపక్ష రాజకీయ సహకారం, నానాటికి మరింత సన్నిహితమూ, శక్తివంతమూ అవుతూంది. ఖచ్చితమైన లక్ష్యాలను నిర్ణయించుకున్నాము; వాటిని సాధించేందుకు సమిష్టిగా కృషి చేస్తున్నాము. సహజంగానే ఇది ఎంతో ప్రాముఖ్యంగల విషయం. అందునా ముఖ్యంగా, రెండు ప్రపంచ వ్యవస్థల మధ్య పోటీ సాగుతూన్న ప్రస్తుత పరిస్థితుల్లో దీని ప్రాధాన్యం అపారం.

ఆర్థికరంగంలో సహకారమూ, సోషలిస్టు దేశాల మధ్య జాతీయ-ఆర్థిక బంధాలను మరింత విస్తృతపరచి ప్రగాఢం చేయడమూ కూడా ఇంత ప్రాధాన్యం గల విషయమే. ఇప్పుడు సమీక్షిస్తూన్న కాలం ఈ రంగంలో కూడా సత్ఫలితాలను చేకూర్చింది.

కొన్ని విషయాలను పరిశీలించుదాము.

సోవియట్ యూనియనూ, సోదర దేశాలూ, తమ తమ జాతీయ ఆర్థిక వ్యవస్థలను అభివృద్ధి పరచుకోడానికి, పరస్పరం సకల విధాలా సహాయం చేసుకో జూస్తున్నాయి. గత ఐదేళ్ళలోనూ, సోషలిస్టు దేశాల్లో మన సహాయంతో 300 లకు పైగా పారిశ్రామిక, వ్యావసాయిక ప్రాజెక్టులను నిర్మించడమో, పునర్నిర్మించడమో జరిగింది. పరస్పరం లాభదాయకమైన షరతులపై, చాలా రకాల పారిశ్రామిక సరకులను మన మిత్రులకు మనం సరఫరా చేశాము. కొన్ని ముడిసరకులు, ఇంధనం విషయంలో పరస్పర ఆర్థిక సహాయ సమితి (సి. యం. ఇ. ఎ.) సభ్యదేశాలయొక్క, క్యూబాయొక్క దిగుమతి అవసరాల్లో 70 శాతాన్నీ, అంతకుపైగానూ సోవియట్ దేశం తీర్చింది; వియత్నాం ప్రజాతంత్ర రిపబ్లిక్, కొరియా జనతంత్ర ప్రజారిపబ్లిక్‌ల అవసరాలను కూడా చాలవరకు తీర్చుతూంది.

గడచిన ఐదేళ్ళ కాలంలోనూ మన జాతీయ ఆర్థిక వ్యవస్థకు సి. యం. ఇ. ఎ. దేశాలనుండి, 54 రసాయనిక ఫ్యాక్టరీలకు కావలసిన యంత్ర సామగ్రి సరఫరా అయింది. ఈ ఐదేళ్ళలోనూ మన వర్తక నౌకాదళానికి అదనంగా చేరిన నౌకల మొత్తం పరిమాణంలో 38 శాతానికి పైగా మన మిత్రదేశాల నౌకా నిర్మాణ పరిశ్రమలనుండే సరఫరా అయింది. సోవియట్ దేశ ఆర్థిక వ్యవస్థలోని ముడిసరకుల, ఇంధనాల శాఖలను అభివృద్ధి పరచడంలోనూ, లోహకార, రసాయన ఎరువుల, కాగితం గుజ్జు ఫ్యాక్టరీలను పెంచడంలోనూ, సి. యం. ఇ. ఎ. దేశాలు పెట్టుబడులు పెట్టడంద్వారా పాల్గొంటున్నాయి. సోదర దేశాల నుండి అనేక వాడకం సరకులు కూడా మనకు సరఫరా అవుతున్నాయి.

సోవియట్ దేశమూ, తదితర సి. యం. ఇ. ఎ. సభ్యదేశాలూ తమ ఆర్థిక సంబంధాలను, దీర్ఘ కాల ప్రాతిపదికపై ఏర్పరచుకుంటున్నాయి. అందునా ముఖ్యంగా, సోదర దేశాలు తమ తమ 1971-1975 జాతీయార్థిక ప్రణాళికలను సమన్వయ పరచుకున్నాయి. బహుపక్ష ఆర్థిక సహకారం యొక్క వ్యవస్థా నిర్మాణాన్నీ, సాంకేతిక ప్రాతిపదికనూ అభివృద్ధి పరచేందుకు, గత కొద్ది సంవత్సరాల్లోనూ చురుకుగా కృషి కొనసాగింది.

ద్రుజ్బా నూనె గొట్టంలోని రెండవ విభాగాన్ని నిర్మించడం జరుగుతూంది. ఈ నూనె గొట్టం పని చేయ నారంభించిన తొలి సంవత్సరం 1964 లో ఇది 8.3 మిల్లియన్ టన్నుల నూనెను రవాణా చేసింది; 1975 లో సోదర దేశాలకు ఇది దాదాపు 50 మిల్లియన్ టన్నుల నూనె అందజేస్తుంది. సైబీరియా నుండి, దేశంలోని యూరోపియన్ భాగాలకు సహజవాయువును అందజేయడం కోసం, అసాధారణ పరిమాణాలు గల ఒక గ్యాసు సరఫరా గొట్టం నిర్మాణమవుతూంది. చెకొస్లొవాకియా, పోలెండు దేశాలకు గ్యాస్

సరఫరాను పెంచేందుకూ, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, బల్గేరియా, హంగరీ దేశాలకు గ్యాస్ సరఫరాను ప్రారంభించేందుకూ కూడా ఇది తోడ్పడుతుంది. "మిర్" సంఘటిత విద్యుచ్ఛక్తి గ్రిడ్ లు సి. యం. ఇ. ఎ. దేశాలకు పెద్ద పెద్ద ఆర్థిక లాభాలను సమకూర్చుతున్నాయి. అంతర్జాతీయ ఆర్థిక సహకార బ్యాంకు జయప్రదంగా పని చేస్తూంది. సి. యం. ఇ. ఎ. దేశాల ఉమ్మడి పెట్టుబడుల బ్యాంకు ఇటీవలనే పనిచేయ నారంభించింది. ఇతర రూపాల్లో కూడా బహుపక్ష సంబంధాలను పటిష్ఠం చేయడం జరుగుతూంది.

ఇదంతా కూడా సత్ఫలితాన్ని చేకూర్చింది; సామాజికోత్పత్తి రంగాన్ని మరింత సమర్థవంతం చేసేందుకూ, మన దేశాల్లో ప్రతి ఒక్కదాని జాతీయ ఆర్థిక వ్యవస్థా వేగంగా అభివృద్ధి చెందేందుకూ తోడ్పడింది. గత ఐదేళ్ళలోనూ సి. యం. ఇ. ఎ. దేశాల పారిశ్రామికోత్పత్తి 49 శాతం పెరిగింది. ఈ దేశాల మధ్య వర్తకం కూడా పెరుగుతూ ఉంది.

అయినప్పటికీ, సోషలిస్టు శ్రమ విభజనకు గల అవకాశాలను పూర్తిగా ఉపయోగించుకోవడం జరగడం లేదని, తక్కిన సి. యం. సి. ఎ. దేశాల్లా మనమూ భావిస్తున్నాము. ఆచరణనుబట్టి ఈ దిగువ ఉమ్మడి నిర్ధారణకు వచ్చాము: కొన్ని రంగాలపై ఆయా దేశాలు ప్రత్యేకంగా కేంద్రీకరించడాన్నీ, ఉత్పత్తిలో సహకారాన్నీ మరింత ప్రగాఢం చేయడమూ, మన జాతీయ ఆర్థిక ప్రణాళికలను మరింత సన్నిహితంగా పెనవేయడమూ—అంటే, సోషలిస్టు దేశాల ఆర్థిక విలీనీకరణ మార్గాన పురోగమించడం అవసరం. కామ్రేడ్స్, ఇది ముఖ్యమైన, అవసరమైన కృషి.

సోషలిస్టు దేశాల ఆర్థిక విలీనీకరణ జటిలమైన ఒక కొత్త క్రమం. అనేక ఆర్థిక సమస్యలపట్ల ఒక కొత్త విశాలదృష్టి, ఆయా దేశం యొక్క ప్రయోజనాలకు మాత్రమే కాకుండా, సహకారంలో భాగస్వాములైన అన్ని దేశాల ప్రయోజనాలకూ అనుగుణంగా, అత్యంత హేతుబద్ధమైన పరిష్కారాలను కనుగొనగల సామర్థ్యమూ కలిగి ఉండడం ఇందులో గర్భితం. విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లో సాధించిన సరికొత్త ఫలితాలపైనీ, ఉత్పత్తి రంగంలో అత్యంత లాభదాయకమైన, సాంకేతికంగా పురోగమించిన శాఖల పైనీ గట్టిగా ఆధారపడడం ఇందుకు అవసరం.

మన ప్రణాళికా రచనా సంస్థల్లోనూ, ఆర్థిక సంస్థల్లోనూ పని చేస్తూన్న వారిలో ఈ దృక్పథాన్ని పెంచాలన్నదే సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఉద్దేశం. ఈ సందర్భంలో, సోదర దేశాలతో దీర్ఘ కాలిక ఆర్థిక సంబంధాలను పెంపొందించు కొనేందుకు, మన ఆర్థిక రంగంలోని ప్రతి ఒక్క ఫ్యాక్టరీకీ ప్రోత్సాహకాన్ని సమకూర్చే చర్యలను గురించి ఆలోచించాలన్నది స్పష్టం.

సోషలిస్టు దేశాలతో సోవియట్ యూనియన్ ద్విపక్ష సంబంధాలను బల

పరచడం పట్ల, 23 వ, 24 వ మహాసభల మధ్యకాలంలో మన పార్టీ ఎంతో శ్రద్ధ వహించింది.

సన్నిహితమూ, బహుముఖమూ అయిన సహకారం, మైత్రి, సుహృద్భావాలు, తక్కిన వార్సాసంధి దేశాలైన బల్గేరియా, హంగరీ, జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, పోలెండ్, రుమేనియా, చెకొస్లొవాకియాలతో మన సంబంధాల లక్షణాలు.

బల్గేరియా, హంగరీ, చెకొస్లొవాకియా, రుమేనియా దేశాలతో కొత్త స్నేహ, సహకార, పరస్పర సహాయ సంధులు కుదిరాయి. జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, పోలెండ్, మంగోలియా దేశాలతో సంధులు అంతకుముందే అమలులోకి వచ్చాయి; సోదర దేశాలతో ఇతర ద్విపక్ష సంధులు జరిగాయి. వాటితో కలిసి ఈ కొత్త సంధులు, ఒక నూతన, సోషలిస్టు తరహా పరస్పర బంధు బాధ్యతల సమగ్ర వ్యవస్థగా ఉన్నాయి.

పోలెండు ప్రజారిపబ్లిక్కుతో మన మైత్రి దుర్భేద్యమైనది. సోదర పోలెండులో ఏర్పడిన చిక్కులు తొలగిపోయినందుకు మన కెంతో సంతృప్తిగా ఉంది. కార్మికవర్గంతోనూ, సమస్త శ్రామిక ప్రజలతోనూ తన బంధాలను బలపరచుకొనేందుకూ, దేశంలో సోషలిజం స్థానాలను పటిష్ఠ మొనర్చేందుకూ, పోలెండు యునైటెడ్ వర్కర్స్ పార్టీ చర్యలు తీసుకుంటూంది. పోలెండు మిత్రులకు ఘనతర విజయాలు చేకూరాలని సోవియట్ దేశ కమ్యూనిస్టులు నిండు హృదయాలతో ఆకాంక్షిస్తున్నారు.

వియత్నాం వర్కింగ్ పీపుల్స్ పార్టీతోనూ, వియత్నాం ప్రజాతంత్ర రిపబ్లిక్కుతోనూ మన పార్టీకీ, సోవియట్ ప్రజలకూ సోషలిస్టు సంఘీభావ సంబంధాలూ, దృఢమైన సమరశీల మైత్రీ ఉన్నాయి. మహా దేశభక్తుడూ, విప్లవకారుడూ అయిన హో చి మిన్ బోధల ననుసరిస్తూ వియత్నాం ప్రజలు సోషలిజం పతాకను సమున్నతంగా ఎత్తిపట్టారు. సామ్రాజ్యవాద దురాక్రమణదారులను నిర్భయంగా ఎదుర్కొంటున్నారు. తాను సాగించే సాయుధ పోరాటంలోనూ, శాంతియుత కృషిలోనూ సోవియట్ దేశ సోదర సహాయంపై ఇకముందు కూడా ఆధారపడవచ్చునని వియత్నాం ప్రజాతంత్ర రిపబ్లిక్ నమ్మకోవచ్చు.

క్యూబా రిపబ్లిక్కుతోనూ, క్యూబా కమ్యూనిస్టు పార్టీతోనూ పరస్పర సహకారాన్ని పటిష్ఠం చేసుకోవడం పట్ల సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, ఈ సంవత్సరాల్లో నిరంతరం శ్రద్ధ వహించింది. సోవియట్-క్యూబా సంబంధాలను అభివృద్ధి పరచడంలో, ఉమ్మడి కృషి ఫలితంగా గణనీయమైన విజయాలు చేకూరాయి. సోవియట్, క్యూబా దేశాల ప్రజలు ఉమ్మడి పోరాటంలో సహయోధులు; వారి మైత్రి దృఢమైనది.

ఇప్పటికి అర్ధ శతాబ్దానికి పైగా మంగోలియా ప్రజావిప్లవ పార్టీతోనూ, మంగోలియా ప్రజారిపబ్లిక్కుతోనూ సోవియట్ కమ్యూనిస్టు పార్టీకి, సోవియట్ దేశానికీ దృఢమైన సంబంధా లున్నాయి. కాలపరీక్షలో నెగ్గిన సంబంధా లివి. సోవియట్ దేశం, సోష

లిస్టు మంగోలియాకు నిజమైన మిత్ర దేశం, బంధు దేశం. ముఖ్యమైన ఆర్థిక సమస్య లను పరిష్కరించుకొనేందుకూ, అంతర్జాతీయ రంగంలో తమ దేశ స్థానాలను బలపరచు కొనేందుకూ మన మంగోలియా మిత్రులు సాగించే కృషిని సోవియట్ దేశం ఆచరణ పూర్వకంగా బలపరుస్తూంది.

కొరియా జనతంత్ర ప్రజారిపబ్లిక్కుతోనూ, కొరియా శ్రామిక పార్టీతోనూ మన సంబంధాలు గత కొద్ది సంవత్సరాల్లోనూ పెరిగాయి. ఇది ఉభయ దేశాల ప్రయోజనాలకు అనుగుణ మనేందుకు మనకు సందేహం లేదు. దేశాన్ని శాంతియుతంగా, ప్రజాతంత్ర పద్ధతులపై ఏకం చేసేందుకు కొరియా జనతంత్ర ప్రజారిపబ్లిక్ ప్రభుత్వం చేసిన ప్రతిపాద నలనూ, కొరియాలోని దక్షిణ ప్రాంతాలనుండి అమెరికా సేనలను తొలగించాలన్న కొరియా ప్రజల కోర్కెలనూ సోవియట్ దేశం గతంలో బలపరచింది, ఇప్పుడూ బల పరుస్తూంది.

మన మిప్పుడు సమీక్షిస్తూన్న కాలంలో సోవియట్-యుగోస్లావియా సంబంధాలు అభివృద్ధి చెందుతూనే వచ్చాయి. యుగోస్లావియాలో సోషలిజం పటిష్ఠం కావాలి, సోష లిస్టు దేశాల కుటుంబంతో యుగోస్లావియా సంబంధాలు నానాటికి మరింత బలపడుతూ ఉండాలి అన్నదే సోవియట్ ప్రజల కోరిక. సోవియట్-యుగోస్లావియా సహకారాన్నీ, మన రెండు పార్టీల మధ్య నానాటికి అభివృద్ధి చెందే సంబంధాలనూ మనం కోరుకుం టున్నాము.

చైనా ప్రజారిపబ్లిక్కుతో మన సంబంధాల విషయం. చైనా నాయకులు తమ సొంత సైద్ధాంతిక-రాజకీయ కార్యక్రమాన్ని ప్రతిపాదించిన విషయమూ, అంతర్జాతీయ రంగానికీ, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమానికీ చెందిన కీలక సమస్యల విషయంలో లెని నిజానికీ దీనికీ పొంతన లేదన్న విషయమూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 20 వ మహా సభ నిర్దేశించిన పంథానూ, పార్టీ కార్యక్రమాన్నీ మనం విసర్జించాలని వారు కోరిన విష యమూ జ్ఞాపకం ఉండే ఉంటుంది. మన పార్టీకీ, దేశానికీ వ్యతిరేకంగా వారు, శత్రు భావంతో తీవ్రమైన ప్రచారం ప్రారంభించారు; సోవియట్ దేశ భూభాగాలు కొన్ని తమకు చెందినవన్న వాదనలు సాగించారు; 1969 వసంతకాలంలోనూ, వేసవికాలంలోనూ సరి హద్దుపై సాయుధ సంఘర్షణల వరకు పరిస్థితులను నెట్టుకువచ్చారు.

మార్క్సిస్టు-లెనినిస్టు బోధను వక్రీకరించేందుకూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమాన్నీ, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట యోధుల శ్రేణులనూ చీల్చేందుకూ జరిగే ప్రయత్నాలను మన పార్టీ ఖండితంగా వ్యతిరేకించింది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ ప్రభుత్వమూ నిగ్రహం వహించాయి, రెచ్చిపో నిరాకరించాయి, చైనా ప్రజారిపబ్లిక్కుతో సంబంధాలను సహజ స్థితికి తెచ్చేందుకై తమ సర్వశక్తులా కృషి చేశాయి.

మనం తీసుకున్న చొరవ ఫలితంగా గత పద్దెనిమిది మాసాల్లోనూ, సోవియట్ యూనియన్, చైనా ప్రజారిపబ్లిక్కుల మధ్య సంబంధాలు కొంత మామూలు స్థితికి వచ్చే సూచనలు కనిపించాయి. ఉభయదేశాల ప్రభుత్వాధినేతల సమావేశం ఒకటి 1969 సెప్టెంబరులో జరిగింది. ఆ పైని సరిహద్దు సమస్యల పరిష్కారం గురించి పెకింగ్‌లో, రెండు ప్రభుత్వాల ప్రతినిధి వర్గాల మధ్య సంప్రతింపులు జరిగాయి. ఈ సంప్రతింపులు నింపాదిగా జరుగుతున్నాయి. ఇవి ఫలవంతంగా పూర్తి కావాలంటే, ఒక్కపక్షమే నిర్మాణాత్మక వైఖరిని అవలంబిస్తే చాలదన్న విషయం వేరే చెప్పనక్కర లేదు.

గత సంవత్సరాంతంలో సోవియట్ యూనియన్, చైనా ప్రజారిపబ్లిక్కులు పరస్పరం రాయబారులను నియమించుకోవడం జరిగింది. చాలకాలం తరువాత వర్తక ఒప్పందాలపై తిరిగి సంతకాలు జరిగాయి; వర్తకం కొంత పెరిగింది. ఇవి ప్రయోజనకరమైన చర్యలు. ఇదే మార్గాన కృషిని కొనసాగించేందుకు మనం సిద్ధంగా ఉన్నాము.

కాని, కామ్రేడ్స్, అటు చైనా ప్రచారంలోనూ, విధానంలోనూ సోవియట్ వ్యతిరేక పంథాను అనుసరించడం కొనసాగుతూనే ఉందన్న విషయాన్నీ, సోవియట్ దేశం పట్ల శత్రుత్వంతో కూడిన ఈ పంథాను, చైనా కమ్యూనిస్టు పార్టీ 9 వ మహాసభ తన నిర్ణయాల్లో చేర్చిందన్న విషయాన్నీ మనం గమనించకుండా ఉండలేము.

దీనిని గురించి ఏమి చెప్పాలి?

మన పార్టీ యొక్క, మన ప్రభుత్వం యొక్క విధానం గురించి పెకింగ్‌నుండి ప్రచారమవుతూన్న, చైనా ప్రజలకు నూరిపోస్తూన్న నిందాపూర్వక కట్టుకథలను మనం ఖండితంగా తృణీకరిస్తున్నాము. చైనా, సోవియట్ దేశాల మధ్య విభేదాలను నాటడం, దేశదేశాల శాంతికాముక ప్రజలపై సామ్రాజ్యవాదులు తమ దురాక్రమణ చర్యలను తీవ్రం చేస్తూన్న పరిస్థితుల్లో జరుగుతూ ఉండడం దృష్ట్యా, అది మరింత అర్థంలేని పనీ, ప్రమాదకరమైనదిన్నీ. సోవియట్, చైనా దేశాల్లాంటి రెండు దేశాల మధ్య శత్రుత్వాన్ని రెచ్చగొట్టడం కాక, సకల సామ్రాజ్యవాద వ్యతిరేక, విప్లవ శక్తుల మధ్య సంఘీభావమూ, సమిష్టి కార్యాచరణా, మునుపెన్నడూ లేనంతగా నేడు అవసరం.

సోవియట్ దేశం యొక్క జాతీయ ప్రయోజనాలను మనం ఏ నాటికీ వదులుకోము. మార్క్సిస్టు-లెనినిస్టు ప్రాతిపదికపై సోషలిస్టు దేశాల, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సంఘీభావాన్ని సాధించడం కోసం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ నిర్విరామంగా కృషి చేస్తుంది. అదే సమయంలో, సోవియట్ యూనియన్, చైనా ప్రజారిపబ్లిక్కుల మధ్య సంబంధాలు మెరుగు కావడం ఈ ఉభయదేశాల మౌలిక, దీర్ఘకాలిక ప్రయోజనాలకూ, సోషలిజం, దేశదేశాల ప్రజల స్వాతంత్ర్యం, పటిష్ఠమైన శాంతి ప్రయోజనాలకూ అనుగుణమైనదని మన పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ దృఢంగా విశ్వసిస్తున్నాయి. అందుచేతనే, సోవియట్ యూనియన్, చైనా ప్రజారిపబ్లిక్కుల మధ్య సంబంధాలను

మామూలు స్థితికి తేవడంపట్ల మాత్రమే కాకుండా, రెండు దేశాల మధ్య ఇరుగు పొరుగు సత్సంబంధాలనూ, మైత్రినీ పునరుద్ధరించడం పట్ల కూడా మనం ఆసక్తి కలిగి ఉన్నాము; చివరికిది నెరవేరి తీరుతుందనే విశ్వాసాన్ని వ్యక్తం చేస్తున్నాము.

ఇదీ, సూత్రబద్ధమైన మన వైఖరి. దీనిని మనం పదే పదే ప్రకటించాము; దీనికి అచంచలంగా కట్టుబడి ఉన్నాము; ఆచరణలో దీనిని బలపరుస్తున్నాము.

అల్బేనియా విషయం—గతంలో లాగానే ఇప్పుడు కూడా, ఆ దేశంతో మామూలు సంబంధాలను పునరుద్ధరించు కునేందుకు మనం సిద్ధంగా ఉన్నాము. ఇది ఉభయదేశాలకూ, సోషలిస్టు దేశాల ఉమ్మడి ప్రయోజనాలకూ లాభకరం.

కామ్రేడ్స్, చెకొస్లొవాకియాలోని రాజకీయ సంక్షోభం, ఇటీవలి సంవత్సరాల్లోని అంతర్జాతీయ ఘటనల్లో కొంత ప్రముఖస్థానం అలంకరించింది. దానికి సంబంధించిన వాస్తవ విషయాలను ఇక్కడ వివరించవలసిన అవసరం లేదన్నది స్పష్టం. అవి అంద రికీ తెలిసినవే. జరిగిన దానినిబట్టి చేసుకున్న నిర్ధారణల్లో అతి ముఖ్యమైనవని మనం భావిస్తున్న కొన్నిటిని మాత్రం ఇక్కడ పరిశీలించుదాము.

సోషలిస్టు నిర్మాణ మార్గాన్ని చేపట్టిన దేశాల్లో, ఇంకా మిగిలి ఉన్న సోషలిస్టు వ్యతిరేక శక్తులు, కొన్ని పరిస్థితుల్లో పెచ్చరిల్లవచ్చు; బయటినుండి, ఇటువంటి శక్తు లతో కలిసి కూటములను ఏర్పాటు చేయడానికి ఎల్లప్పుడూ కాచుకు కూర్చుని ఉన్న సామ్రాజ్యవాద శక్తులనుండి మద్దతు లభిస్తుందనే ఆశతో అవి ప్రత్యక్షంగా విప్లవ ప్రతీ ఘాతక పోరాటాన్ని కూడా ప్రారంభించవచ్చు. ఈ విషయాన్ని చెకొస్లొవాకియా ఘట నలు మరొకసారి నిరూపించాయి.

మితవాద రివిజనిస్టు ప్రమాదం, ఈ సందర్భంలో పూర్తిగా వెల్లడయింది. మిత వాద రివిజనిజం సోషలిజాన్ని "మెరుగు పరచడం" అనే సాకుతో, మార్క్సిజం-లెనినిజం లోని విప్లవకర అంతస్సారాన్ని ధ్వంసంచేయ జూస్తుంది, బూర్జువా సిద్ధాంతం చొర బడేందుకు మార్గం ఏర్పరుస్తుంది.

సోషలిస్టు సమాజంలో పార్టీయొక్క నాయకపాత్రను నిరంతరం బలపరచడమూ, పార్టీ నాయకత్వ రూపాలనూ, పద్ధతులనూ స్థిరంగా అభివృద్ధి పరచడమూ, సోషలిస్టు అభివృద్ధికి సంబంధించిన అత్యవసర సమస్యల పరిష్కారంపట్ల సృజనశీల మార్క్సిస్టు-లెనినిస్టు వైఖరిని అవలంబించడమూ ఎంత ముఖ్యమో, చెకొస్లొవాకియా ఘటనలు చాల చక్కగా రుజువు చేశాయి.

ఇది, చెకొస్లొవాకియాలోని సోషలిస్టు వ్యవస్థను కూలదోసేందుకు సామ్రాజ్య వాదులూ, వారి తోడుదొంగలూ చేసిన ప్రయత్నం మాత్రమే కాదన్నది మనకు సుస్పష్టమే. ఈ విధంగా, యూరప్‌లో మొత్తం సోషలిజం స్థానాలపైనే దెబ్బ తీసేందుకూ, మరీ బరి

తెగించిన సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తులు, ఉత్తరోత్తరా సోషలిస్టు ప్రపంచంపై దాడి జరిపేందుకు అనుకూల పరిస్థితులను కల్పించేందుకూ జరిపిన ప్రయత్న మిది.

చెకొస్లొవాకియా పార్టీ నాయకులూ, ప్రభుత్వ నాయకులూ, కమ్యూనిస్టులూ, శ్రామిక ప్రజలూ చేసిన విజ్ఞాపనల దృష్ట్యానూ, ఆ దేశంలో సాధించిన సోషలిస్టు విజయాలకు ఏర్పడిన ప్రమాదాన్ని దృష్టిలోకి తీసుకునీ, మనమూ, సోదర సోషలిస్టు దేశాలూ, సోషలిజాన్ని కాపాడేందుకు చెకొస్లొవాకియాకు, అంతర్జాతీయతా దృష్టితో సహాయం అందజేయాలని సమిష్టిగా నిర్ణయించాము. సామ్రాజ్యవాద శక్తులూ, విప్లవ ప్రతీఘాతక శక్తులూ సృష్టించిన అసాధారణ పరిస్థితుల్లో, మన వర్గ ధర్మాన్నిబట్టీ, సోషలిస్టు అంతర్జాతీయతా తత్వానికి మనం బద్ధులమై ఉండడంవల్లనూ, మన దేశాల ప్రయోజనాల పట్లా, యూరప్‌లో సోషలిజం యొక్క, శాంతియొక్క భవిష్యత్తు పట్లా మనకు గల శ్రద్ధాసక్తులను బట్టీ మనం అలా చేయకతప్పదు.

చెకొస్లొవాకియా కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ విస్తృత సమావేశం, "పెరిగిన సంక్షోభం గుణపాఠాలు" అన్న తన పత్రంలో, సోదర దేశాలు అందజేసిన సమిష్టి సహాయాన్ని ఈ దిగువ విధంగా అంచనా వేసిందన్న విషయం మీకు జ్ఞాపకం ఉంటుంది. (ఆ పత్రంనుండి ఉటంకిస్తున్నాను):

"ఐదు సోషలిస్టు దేశాల మిత్రసేనలు చెకొస్లొవాకియాలోకి ప్రవేశించడం, అంతర్జాతీయతా సంఘీభావంతో కూడిన చర్య. చెకొస్లొవాకియా శ్రామిక ప్రజల ఉమ్మడి ప్రయోజనాలకూ, అంతర్జాతీయ కార్మికవర్గం యొక్క, సోషలిస్టు దేశాల కుటుంబం యొక్క ప్రయోజనాలకూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం యొక్క వర్గ ప్రయోజనాలకూ ఇది అనుగుణమైన చర్య. అంతర్జాతీయతా తత్వంతో కూడిన ఈ చర్య వేలకొలది ప్రజల ప్రాణాలను కాపాడింది, శాంతియుతమైన శ్రమ నిశ్చింతగా సాగేందుకు కావలసిన ఆంతరంగిక, బాహ్య పరిస్థితులను కల్పించింది, సోషలిస్టు శిబిరం యొక్క పశ్చిమ సరిహద్దులను పటిష్ఠం చేసింది, రెండవ ప్రపంచ యుద్ధ ఫలితాలను తిరగదోడాలని సామ్రాజ్యవాద శక్తులు పెట్టుకున్న ఆశలను పటాపంచలు చేసింది."

చెకొస్లొవాకియా కమ్యూనిస్టు పార్టీ చేసిన నిర్ధారణతో మనం పూర్తిగా ఏకీభవిస్తున్నాము. సోషలిస్టు శిబిరంపై దాడిచేసి, దానిని బలహీనపరచేందుకూ, శ్రామిక ప్రజలు సాధించుకున్న సోషలిస్టు విజయాలపై దెబ్బతీసి వాటిని నిరర్థకం చేసేందుకూ ప్రయత్నించే శక్తులను నిలవరించేందుకు, సోషలిస్టు దేశాల సోదర ఐక్యతే అన్నిటికన్నా నమ్మకమైన అడ్డుకట్ట అని, జీవితం మరొకసారి తిరుగులేని విధంగా నిరూపించింది. తమ విప్లవ విజయాలను తాము వదులుకోము అనీ, సోషలిస్టు దేశాల కుటుంబం సరిహద్దులకు మార్పు ఉండదనీ, అవి అతిక్రమించరానివనీ, సోషలిస్టు దేశాల ప్రజలు యావత్తు ప్రపంచానికీ సుస్పష్టం చేశారు.

తమకు ఎదురైన పరీక్షలకు తట్టుకొని చెకొస్లొవాకియా కమ్యూనిస్టులు విజయవంతంగా నిలబడినందుకు మనం, హృదయపూర్వకంగా సంతోషిస్తున్నాము. చెకొస్లొవాకియా కమ్యూనిస్టు పార్టీ నేడు తన 14 వ మహాసభకు పురోగమిస్తూంది. చెకొస్లొవాకియాలో సోషలిజం స్థానాలను పటిష్ఠం చేయడంలో ఈ మహాసభ ముఖ్యమైన ఒక కొత్త ఘట్టంగా ఉంటుందనేందుకు మనకు సందేహం లేదు.

కామ్రేడ్స్, సాధించిన విజయాలూ, అవకాశాలూ ఎన్ని ఉన్నా, సమస్యలు ఎన్ని ఉన్నా నేటి సోషలిస్టు ప్రపంచం ఈ నాటికీ ఒక తరుణ, వర్ధమాన సామాజిక వ్యవస్థగానే ఉంది. ఇక్కడ అంతా ఇంకా స్థిరపడలేదు; పూర్వపు చారిత్రక యుగాల ముద్రలుగల విషయాలు ఇంకా చాలా ఉన్నాయి. సోషలిస్టు ప్రపంచం ముందుకు సాగిపోతూంది; నిరంతరాయంగా అభివృద్ధి చెందుతూంది. పాత, కొత్తల మధ్య సంఘర్షణ ద్వారా, ఆంతరంగిక వైరుధ్యాలను పరిష్కరించుకోవడం ద్వారా, దీని అభివృద్ధి కొనసాగుతూంది. ఇది సహజమే. వైరుధ్యాలకు సరియయిన, సకాలమైన పరిష్కారాలను కనిపెట్టేందుకూ, శ్రామికవర్గ మహా దేశికులైన మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌లు చూపిన మార్గాన ఆత్మవిశ్వాసంతో పురోగమించేందుకూ, సోదర పార్టీల అనుభవ సంచయం తోడ్పడుతూంది.

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ శక్తి మరింత పెరిగేందుకు సకల విధాలా దోహదం కూర్చడం తన అంతర్జాతీయతా విధ్యుక్త ధర్మమని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ పరిగణించింది; ఇకముందు కూడా పరిగణిస్తుంది. సోదర దేశాల మధ్య సహకారం మరింత బహుముఖమూ, ప్రగాఢమూ కావాలి, నానాటికి మరింత విస్తృతంగా శ్రామిక ప్రజలు ఇందులో భాగస్వాములు కావాలి, ఒక దేశ నిర్దిష్ట అనుభవాన్ని మరొక దేశం ప్రభుత్వ సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో అన్ని స్థాయిల్లోనూ మరింత సమూలంగా అధ్యయనం చేయాలి—ఇదీ మన వైఖరి.

ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక రంగాల్లో సత్వరాభివృద్ధిని సోషలిస్టు సంస్కృతీ వికాసంతోనూ, శ్రామిక ప్రజల జీవన ప్రమాణాల పెరుగుదలతోనూ పొందికగా జోడించుకుంటూ ప్రతి ఒక్క సోదర దేశమూ వర్ధిల్లా లన్నదే మన కోరిక. కలిసికట్టుగా నవసమాజాన్ని నిర్మించుకుంటూ, దానిని కాపాడుకుంటూ, ఒకరి అనుభవ, జ్ఞాన సంపదలతో ఒకరికి పరిపుష్టిని చేకూర్చుకుంటూ ఉండే జాతుల సుసంఘటిత కుటుంబంగా, బలంగానూ, సమైక్యంగానూ ఉండి, భావి స్వతంత్ర జాతుల ప్రపంచ కుటుంబానికి నమూనాగా ప్రపంచ ప్రజలు పరిగణించే కుటుంబంగా, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ఉండాలన్నది మన కోరిక.

ఉదాత్తమైన ఈ లక్ష్యాన్ని సాధించేందుకు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ తన సర్వ శక్తులా కృషి చేస్తుందని సోషలిస్టు దేశాల్లోని మన మిత్రులకూ, మన సోదరులకూ, మన సహయోధులకూ హామీ ఇచ్చేందుకు నన్ననుమతించండి!

## 2. సామ్రాజ్యవాదం దేశదేశాల ప్రజలకూ, సామాజిక ప్రగతికీ శత్రువు. సామ్రాజ్యవాదాన్నెదుర్కొంటూన్న దేశదేశాల ప్రజలు.

కామ్రేడ్స్, మన పార్టీ, తన 23 వ మహాసభలోనూ, తన అధికార పత్రాలు చాలా వాటిలోనూ, ఆధునిక సామ్రాజ్యవాదాన్ని గురించి సమగ్రమైన అంచనాను ఇదివరకే ప్రకటించింది. 1969 లో జరిగిన అంతర్జాతీయ కమ్యూనిస్టు సమావేశ పత్రాల్లో, నేటి దీని లక్షణాలను గురించిన మార్క్సిస్టు-లెనినిస్టు వివేచన ఉంది. అందుచేత, గత కొద్ది సంవత్సరాల అనుభవం దృష్ట్యా, మనం మన విధానంలో లెక్కలోకి తీసుకోవలసిన కొన్ని మౌలిక అంశాలను గురించి మాత్రమే ఇక్కడ ప్రస్తావించేందుకు నన్నునుమతించండి.

నేటి పెట్టుబడిదారీ విధానం, ప్రపంచంలోని కొత్త పరిస్థితికి తనను తాను మలచుకో ప్రయత్నిస్తూంది. ఈ విషయమే దీని లక్షణాలకు చాలవరకు మూలం. సోషలిజాన్ని తాము ఎదుర్కొంటూన్న పరిస్థితుల్లో, వర్గపోరాటం బ్రహ్మాండమైన విప్లవోద్యమంగా పరిణమిస్తుందేమోనని, పెట్టుబడిదారీ దేశాల్లోని పాలకవర్గాలు, మునుపెనాడూ లేనంతగా భయపడుతున్నారు. శ్రామిక ప్రజలను దోచుకోవడంలోనూ, పీడించడంలోనూ, మరింత ప్రచ్ఛన్నమైన రూపాలను ఉపయోగించేందుకు బూర్జువావర్గం ప్రయత్నించడానికీ, సాధ్యమైనంతవరకు ప్రజాబాహుళ్యాన్ని తన సైద్ధాంతిక, రాజకీయ ఆధిపత్యం కింద ఉంచుకొనేందుకై పాక్షిక సంస్కరణలకు అంగీకరించేందుకు అది అప్పుడప్పుడు సిద్ధపడుతూ ఉండడానికీ కారణం ఇదే. తమ స్థానాలను బలపరచుకొనేందుకూ, ఉత్పత్తిలో సామర్థ్యాన్నీ, వేగాన్నీ పెంచేందుకూ, శ్రామిక ప్రజలను దోచుకోవడాన్నీ, పీడించడాన్నీ మరింత తీవ్ర మొనర్చేందుకూ గుత్తపెట్టుబడిదారీ సంస్థలు, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల విజయాలను విస్తృతంగా ఉపయోగించు కొంటున్నాయి.

అయితే, కొత్త పరిస్థితులకు తనను తాను మలచుకున్నంత మాత్రాన, ఒక వ్యవస్థగా పెట్టుబడిదారీ విధానం స్థిరపడిందని అర్థం కాదు. *పెట్టుబడిదారీ వ్యవస్థలోని సార్వత్రిక సంక్షోభం ప్రగాఢమవుతూనే వచ్చింది.*

పెట్టుబడిదారీ దేశాల్లోకెల్లా అభివృద్ధి పొందిన వాటిలో కూడా తీవ్రమైన ఆర్థిక కల్లోలాలు తప్పడంలేదు. ఉదాహరణకు అమెరికా, తన ఆర్థిక సంక్షోభాల్లో ఒకదానిలో పడి, దాదాపు రెండు సంవత్సరాలుగా సతమత మవుతూంది. గత రెండేళ్ళలోనూ, పెట్టుబడిదారీ ద్రవ్య, ఆర్థిక వ్యవస్థల్లో తీవ్రమైన సంక్షోభాలు వచ్చాయి. ద్రవ్యోల్బణమూ, నిరుద్యోగమూ ఏకకాలంలో పెరిగిపోవడం, ఒక శాశ్వత లక్షణంగా పరిణమించింది. అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాల్లో ఇప్పుడు దాదాపు ఎనిమిది మిల్లియన్ల మంది నిరుద్యోగులున్నారు.

వలసీకరణ క్రమాలుగాని, సోషలిస్టు ప్రపంచాన్నెదుర్కొని సాగించే పోరాటంలో

తమ తమ కృషి సంతటినీ ఏకోన్ముఖం చేయాలని సామ్రాజ్యవాదులకు గల వర్గ తహ తహగాని, సామ్రాజ్యవాద దేశాల మధ్యగల వైరుధ్యాలను తొలగించలేదు. 1970 దశకం తొలి రోజుల నాటికి సామ్రాజ్యవాద పోటీ ప్రధాన కేంద్రాలు ప్రస్ఫుటమయాయి. అవి: అమెరికా—పశ్చిమ యూరప్ (ముఖ్యంగా ఉమ్మడి మార్కెట్ సభ్యులైన ఆరు దేశాలు)— జపాన్. ఇవి ఆర్థికంగానూ, రాజకీయంగానూ పరస్పరం పోటీపడుతూ సాగిస్తూన్న పోరాటం నానాటికి మరింత తీవ్రమవుతూనే ఉంది. యూరప్, జపాను దేశాల సరకుల దిగుమతులపై అమెరికా అధికార సంస్థలు అంతకంతకు మరింత ఎక్కువగా నిషేధాలు విధించడమూ, అమెరికా పెట్టుబడిదారులు తమను దోచుకోవడాన్ని పరిమితం చేసేందుకు యూరప్ దేశాలు చేస్తూన్న ప్రయత్నాలూ ఈ పోరాటానికి కొన్ని చిహ్నాలు మాత్రమే.

సామ్రాజ్యవాదం యొక్క అభివృద్ధి నిరోధక, దురాక్రమణ స్వభావం తొలగిపోలేదు అనేందుకు, గత ఐదేళ్ళలోనూ సామ్రాజ్యవాద విదేశాంగ విధానం కొత్త నిదర్శనాలను సమకూర్చింది.

ఈ సందర్భంలో, ముఖ్యంగా అమెరికా సామ్రాజ్యవాదం గురించి ప్రస్తావించాలి. అంతర్జాతీయ దోపిడీ, పీడనా వ్యవస్థకు ఒకలాంటి హామీదారుగా, రక్షకునిగా వ్యవహరించాలన్న అభిలాషను, అమెరికా సామ్రాజ్యవాదం ఇటీవలి సంవత్సరాల్లో తిరిగి గట్టిగా ప్రదర్శిస్తూంది. అది సర్వత్రా పెత్తనం చెలాయించ జూస్తూంది, ఇతర దేశాల ప్రజల వ్యవహారాల్లో జోక్యం కలిగించుకుంటూంది, వారి న్యాయమైన హక్కులనూ, సార్వభౌమాధికారాలనూ కాలరాస్తూంది, బలప్రయోగం ద్వారానూ, లంచాల ద్వారానూ, ఆర్థిక చొరబాటు ద్వారానూ, ఇతర దేశాల మీదా, ప్రపంచంలోని విశాల ప్రాంతాలమీదా తన సంకల్పాలను రుద్ద జూస్తూంది.

యుద్ధోన్మాద, దురాక్రమణ శక్తులు ఇతర సామ్రాజ్యవాద దేశాల్లో కూడా ఉన్నాయని వేరే చెప్పనక్కరలేదు. అధికాధికంగా నయానాజీలతో ఏకమవుతూన్న ప్రతీకారవాదులు పశ్చిమ జర్మనీలో ఉన్నారు; ఉత్తర ఐర్లాండుని చిత్రవధ చేస్తూన్నవారూ, దక్షిణాఫ్రికా జాత్యహంకారవాదులకు ఆయుధాలను సరఫరా చేస్తూన్నవారూ, అమెరికా దురాక్రమణ విధానాన్ని బలపరుస్తూన్నవారూ బ్రిటన్‌లో ఉన్నారు; యుద్ధాన్ని "శాశ్వతంగా" నిషేధిస్తూన్న తమ రాజ్యాంగ చట్టాన్ని ధిక్కరించి, దేశాన్ని తిరిగి రాజ్య విస్తరణ, దురాక్రమణ మార్గంలోకి నెట్టజూస్తూన్న సైనిక తత్వవాదులు జపానులో ఉన్నారు.

కామ్రేడ్స్, మనం దృష్టిలో ఉంచుకోవలసిన విషయం మరొకటి ఉంది. అదేమంటే, యుద్ధానంతరం, పెట్టుబడిదారీ ప్రపంచంలో సైనిక తత్వం, ఇంతవరకు కనీ వినీ ఎరుగని స్థాయిలో పెచ్చు పెరుగుతూ ఉంది. ఇటీవలి కాలంలో ఈ ధోరణి మరింత తీవ్రమయింది. ఒక్క 1970 లోనే ఉత్తర అట్లాంటిక్ కూటమి దేశాలు, యుద్ధ సన్నాహాల కింద 103 వేల మిల్లియన్ డాలర్లు పెట్టుబడి పెట్టాయి. అమెరికాలో సైనికీకరణ అతి ప్రమాదకర

మైన స్వభావాన్ని సంతరించుకుంది. గత ఐదేళ్ళలోనూ ఆ దేశం సైనిక ప్రయోజనాలకై దాదాపు 400 వేల మిల్లియన్ డాలర్లు ఖర్చు చేసింది.

ఆసియా, ఆఫ్రికా, దక్షిణ అమెరికాల్లో డజన్ల కొలది దేశాల ప్రజలను సామ్రాజ్య వాదులు క్రమబద్ధంగా దోచుకుంటున్నారు. "తృతీయ ప్రపంచం" నుండి వారు ఏటేటా వేలకొలది మిల్లియన్ల డాలర్లను స్వదేశానికి తరలించుకు పోతున్నారు. ఈలోగా, ప్రపంచ ఆహార పరిస్థితిని గురించి 1970 వ సంవత్సరపు ఐక్య రాజ్య సమితి నివేదిక ప్రకారం, ఈ మూడు ఖండాల్లోనూ 375 మిల్లియన్ల మంది ప్రజలు ఆకలితో మాడుతూ, మృత్యు ముఖంలో జీవిస్తున్నారు.

మునుపటి తమ వలస దేశాల ప్రజలపైనీ, లేదా పెట్టుబడిదారీ దోపిడీనుండి తప్పించుకుంటున్న దేశాల్లోనూ, తమ ఆధిపత్యాన్ని నిలుపుకునేందుకు, లేదా, పోయిన ఆధి పత్యాన్ని పునరుద్ధరించుకొనేందుకు సామ్రాజ్యవాదులు ఎటువంటి ఘాతుకానికి ఒడిగట్టడాని కైనా సిద్ధంగా ఉన్నారు. గత ఐదేళ్ళలోనూ ఇందుకు కొత్త నిదర్శనాలు ఎన్నో లభించాయి. అరబ్బు దేశాలపై దురాక్రమణ, గినీపై దండయాత్ర జరిపేందుకు వలసవాదులు చేసిన ప్రయత్నాలు, దక్షిణ అమెరికాలో ప్రగతిశీల ప్రభుత్వాలకు వ్యతిరేకంగా సాగిస్తున్న విద్రోహ కార్యకలాపాలు—శాంతికాముక దేశాల ప్రజలపై సామ్రాజ్యవాద యుద్ధం ముగిసిపోలే దనేందుకు ఇవన్నీ కొత్త జ్ఞాపికలు.

వియత్నాం, కాంబోడియా, లావోస్ దేశాల ప్రజలపై నేటికీ కొనసాగుతూన్న అమెరికా దురాక్రమణ, ఆధునిక వలసవాదులు ఒడిగట్టిన ఘాతుకాలన్నిటిలోకీ ముఖ్య మైనది; అమెరికాను ఇది అప్రతిష్ఠ పాల్జేసింది.

ప్రపంచ ప్రజలను అక్షరాలా కదిలించి వేసిన అమెరికా సామ్రాజ్యవాదుల యుద్ధ నేరాలను గురించిన వాస్తవాలు, గత కొద్ది సంవత్సరాల్లోనూ బయటపడ్డాయి. వియత్నాం లోని సాంగ్ మి గ్రామానికి విషాదకరమైన అపఖ్యాతి దాపురించింది. అక్కడ, ముసలి వారు, స్త్రీలు, పిల్లలతో సహా నిరాయుధులైన సాధారణ ప్రజలను, అమెరికా హంతకులు, కటికి కసాయితనంతో హతమార్చారు.

నఖశిఖ పర్యంతం సాయుధులైన జోక్యందారులు ఒడిగడుతూన్న దారుణాలను గురించి మాట్లాడుతున్నప్పుడు నిగ్రహం వహించడం కష్టం. లక్షలకొలది టన్నుల మంటలబాంబులు దక్షిణ వియత్నాంలో, విశాల ప్రాంతాలకు ప్రాంతాలనే అక్షరాలా మాడ్చి మసి చేశాయి. రసాయనిక ఆయుధాలను ఉపయోగించడం ఫలితంగా, దాదాపు పదిహేను లక్షలమంది వియత్నాం ప్రజలకు విషం సోకింది, చాలమంది చనిపోయారు. "పాశ్చాత్య నాగరకత"కూ, "స్వేచ్ఛా ప్రపంచానికీ" ప్రతినిధులమని చెప్పుకొనే అమెరికా జోక్యందారులూ, వారి హంగుదారులూ ఒడిగడుతూన్న వాటిని నిజాయితీపరు లెవ్వరూ కూడా, అందునా ముఖ్యంగా కమ్యూనిస్టులు సహించజాలరు. అవి, సిగ్గు చేటయినవి;

కార్మేడ్స్, చరిత్రగతిని మళ్ళించడానికి, దానిని తనకు అనుకూలంగా తిప్పుకోడానికి సామ్రాజ్యవాదం చేస్తున్న ప్రయత్నం విఫలం కాకతప్పదు. అయితే, కార్యశూన్యత గాని, ఆత్మ సంతృప్తిగాని ఎంతమాత్రమూ కూడదన్న విషయం, కమ్యూనిస్టులమైన మనకు బాగా తెలుసు. చిట్టచివరిదే అయినా, ఇంతవరకు ఉన్న దోపిడీ వ్యవస్థ లన్నిటి లోకీ అతి బలీయమైన దానిని, పెట్టుబడిదారీ పీడనకు వ్యతిరేకంగా పోరాడుతూన్న యోధులు నేడు ఎదుర్కొంటున్నారు. అందువల్లనే, సుదీర్ఘమైన గడ్డు పోరాటం మన ముందున్నది.

అయితే, ఎంత గడ్డు పోరాట మయినప్పటికీ, అది ముమ్మరమవుతూనే ఉంది; ఆ పోరాట రంగం స్థిరంగా విస్తరిస్తూనే ఉంది. గత కొద్ది సంవత్సరాల్లోనూ, సామ్రాజ్య వాద వ్యతిరేక పోరాట యోధులు వర్గ పోరాట చరిత్రలో మహోజ్వలమైన కొత్త పుటలను రచించారు.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం, విప్లవ శక్తులకు, కాలపరీక్షలో నెగ్గిన సమరశీల అగ్రగదళం పాత్రను, గతంలో లాగానే ఇప్పుడు కూడా నిర్వహిస్తూంది. గుత్తపెట్టుబడిదారీ సంస్థల పాలనను వ్యతిరేకిస్తూన్న శక్తు లన్నిటిలోకీ ముఖ్యమైనది గానూ, అతి బలీయమైనదిగానూ, గుత్తపెట్టుబడిదారీ వ్యతిరేక శక్తు లన్నిటినీ సంఘటిత పరచే కేంద్రశక్తిగానూ కార్మికవర్గానికి గల ప్రాధాన్యాన్ని, గత ఐదేళ్ళలోనూ పెట్టుబడి దారీ దేశాల్లో జరిగిన ఘటనలు పూర్తిగా నిరూపించాయి.

తక్కిన దేశాల్లోకన్నా వర్గపోరాట సంప్రదాయాలు మరింత అభివృద్ధి చెంది, బల మైన కమ్యూనిస్టు పార్టీలు చురుకుగా పని చేస్తూన్న ఫ్రాన్స్, ఇటలీలాంటి దేశాల్లో కార్మిక వర్గ నాయకత్వం కింద శ్రామిక ప్రజలు, ఆయా పెట్టుబడిదారీ ముఠాలపై దాడి చేయడం మాత్రమే కాకుండా, ప్రభుత్వ గుత్తపెట్టుబడిదారీ ఆధిపత్యం వ్యవస్థపైనే మొత్తంగా దాడి చేశారు. బ్రిటన్‌లో వర్గపోరాటం ఉద్రిక్తత అధిక స్థాయి నందుకుంది. అక్కడ నేడు కొనసాగుతూన్న సమ్మెలు, స్థాయిలోనూ, సమ్మెదారుల సంఖ్య విషయంలోనూ, 1926 నాటి సార్వత్రిక సమ్మెకు మాత్రమే సరితూగుతున్నాయి. అమెరికాలో గుత్తపెట్టు బడిదారీ సంస్థలకు వ్యతిరేకంగా సాగుతూన్న పోరాటం గొప్ప స్థాయి నందుకుంది; సరి సమానత్వం కోసం నీగ్రో ప్రజల పోరాటమూ, వియత్నాం యుద్ధానికి వ్యతిరేకంగా యువ జనుల పోరాటమూ కనీ వినీ ఎరుగనంత కసితో సాగుతూ విస్తరిస్తున్నాయి. జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్కులో కార్మిక ప్రజా ఉద్యమం నానాటికి మరింత ఉధృత మవుతూంది. స్కాండినేవియా దేశాల్లోనూ, హాలెండులోనూ అనేక దశాబ్దాల తరువాత తిరిగి, మొట్ట మొదటిసారిగా పెద్ద ఎత్తున వర్గ సంఘర్షణలు జరిగాయి. స్పెయిన్‌లో సామాజిక-రాజ కీయ సంక్షోభం తీవ్రమవుతూనే ఉంది. ఇటీవలి కాలంలో జరిగిన వర్గపోరాటా లన్నిటి లోనూ శ్రామిక ప్రజల ట్రేడ్ యూనియన్లు, అందునా ముఖ్యంగా ప్రపంచ ట్రేడ్ యూని

యన్ల సమాఖ్యలో చేరిన ట్రేడ్ యూనియన్లు, గణనీయమైన, నానాటికి పెరుగుతూన్న పాత్రను నిర్వహించాయి.

ప్రస్తుతం పెద్ద ఎత్తున సాగుతూన్న కార్మికవర్గ పోరాటాలు, కొత్త వర్గపోరాటాలకు నాంది అనీ, ఆ కొత్త పోరాటాలు మౌలికమైన సామాజిక మార్పులకూ, శ్రామిక ప్రజల్లో తక్కిన భాగాలతో బాంధవ్యం ఏర్పరచుకుని కార్మికవర్గం తన అధికారాన్ని స్థాపించుకునేందుకూ దారి తీయవచ్చుననీ, సోదర పార్టీల సమావేశం నిర్ధారణ చేసిన విషయం, జ్ఞాపకం ఉండే ఉంటుంది.

కామ్రేడ్స్, అదే సమయంలో, జాతీయ విముక్తి పోరాటంలో ఉద్భవించిన శక్తులు, ముఖ్యంగా ఆసియా, ఆఫ్రికాల్లోని తరుణ, స్వతంత్ర, సామ్రాజ్యవాద వ్యతిరేక రాజ్యాలు అధికాధికంగా ప్రయోగిస్తూన్న ఒత్తిడికి సామ్రాజ్యవాదం గురి అవుతూంది.

*జాతీయ విముక్తికోసం సాగుతూన్న పోరాటం, ఆచరణలో, ఫ్యూడల్, పెట్టుబడిదారీ దోపిడీ సంబంధాలకు వ్యతిరేకంగా సాగే పోరాటంగా పరిణమించ నారంభించింది.* ఇది ముఖ్య విషయం.

నేడు పెట్టుబడిదారీ విధానేతర అభివృద్ధి మార్గాన్ని, అంటే, కొసకు సోషలిస్టు సమాజాన్ని నిర్మించే మార్గాన్ని చేపట్టిన దేశాలు ఆసియా, ఆఫ్రికాల్లో అప్పుడే చాలా ఉన్నాయి. అనేక దేశాలు ఈ మార్గాన్ని చేపట్టాయి. ప్రజాబాహుళ్యం ప్రయోజనాలకు అనుగుణమైనవీ, జాతీయ స్వాతంత్ర్యాన్ని పటిష్ఠం చేసేవీ, ప్రగాఢమైనవీ అయిన సామాజిక మార్పులను ఈ దేశాల్లో అమలు జరుపుతున్నారు. కాలం గడిచే కొద్దీ ఈ మార్పుల సంఖ్య పెరుగుతూ ఉంది.

జాతీయ, సామాజిక విముక్తి శక్తులు, సామ్రాజ్యవాదుల ఆధిపత్యానికి వ్యతిరేకంగా సాగిస్తూన్న దాడి, వివిధ రూపాలను ధరిస్తూంది. ఉదాహరణకు, సోషలిజం వైపు మొగ్గుగల దేశాల్లో సామ్రాజ్యవాద గుత్తపెట్టుబడిదారీ సంస్థల ఆస్తులను జాతీయం చేస్తున్నారు. దీనివల్ల, ప్రభుత్వ రంగాన్ని బలపరిచేందుకూ, అభివృద్ధి పరచేందుకూ అవకాశం కలుగుతూంది. నిజానికి ఈ రంగం, విప్లవ-ప్రజాతంత్ర విధానానికి ఆర్థిక ప్రాతిపదిక. ఐక్య అరబ్బు రిపబ్లిక్ లాంటి దేశంలో, మొత్తం పారిశ్రామికోత్పత్తిలో 85 శాతం ప్రభుత్వ రంగంలోనే జరుగుతూంది; బర్మాలో గని, నూనె తోడకం పరిశ్రమల్లో 80 శాతానికి పైగానూ, వస్త్రోత్పత్తి పరిశ్రమల్లో ఇంచుమించు 60 శాతమూ ప్రభుత్వ ఆధిపత్యం కింద ఉన్నాయి. ఆల్జీరియాలో, సామ్రాజ్యవాదుల ఆస్తులను జాతీయం చేసేందుకు కొత్తగా గట్టి చర్యలను తీసుకున్నారు. గినీ, సూడాన్, సోమాలి, టాంజానియా దేశాల్లో అనేక విదేశీ పరిశ్రమలనూ, బ్యాంకులనూ, వర్తక సంస్థలనూ ప్రభుత్వానికి అప్పగించడం జరిగింది.

భూ సమస్యను పరిష్కరించేందుకు కూడా తీవ్రమైన చర్యలను తీసుకోవడం జరి

గింది. ఇది జటిలమైన సమస్య. లక్షలాది రైతుల స్థితిగతులపై ప్రభావంగల సమస్య ఇది. గత ఐదేళ్ళ కాలాన్నే చూస్తే, ఐక్య అరబ్బు రిపబ్లిక్, సిరియాల్లో వ్యవసాయ రంగంలో ముఖ్యమైన పరివర్తనలను తెచ్చారు; సూడాన్, సోమాలి దేశాల్లో ఇటువంటి సంస్కరణలను ప్రారంభించారు. అల్జీరియాలో ఈ ఏడాది వ్యవసాయ సంస్కరణను అమలు జరుపుతామని ప్రకటించారు. కాంగో ప్రజారిపబ్లిక్ (బ్రజవిల్లి)లో భూమినీ, ఖనిజ సంపదలనూ పూర్తిగా ప్రభుత్వ యాజమాన్యానికి అప్పగించారు.

వెనుకబడిన సామాజిక సంబంధాలను, అందులోనూ, నయావలసవాదుల, ఆంతరంగిక అభివృద్ధి నిరోధకుల దాడులు నిరంతరం సాగుతూన్న పరిస్థితుల్లో, పెట్టుబడిదారీ విధానేతర సూత్రాలపై పునర్వ్యవస్థీకరించడం సులభమైన పనేమీకాదని వేరే చెప్పనక్కర లేదు. అందువల్ల, ఇన్ని చిక్కులు ఉన్నప్పటికీ, సోషలిజం వైపు మొగ్గుగల దేశాలు, తాము ఎంచుకున్న మార్గాన మరింత ముందుకు పురోగమిస్తూనే ఉన్నాయన్న విషయం ఇంకా ఎక్కువ ప్రాధాన్యాన్ని సంతరించుకుంటూ ఉంది.

మునుపటి వలస, పరాధీన దేశాలన్నిటిలోనూ ప్రగతిశీల సామాజిక మార్పులు ఇదే స్థాయికి పురోగమించలేదు. అయితే, అభివృద్ధి నిరోధక శక్తులకూ, సామ్రాజ్య వాదుల తాబేదారులకూ వ్యతిరేకంగా పోరాటం అన్ని దేశాల్లోనూ సాగుతూంది. కొన్ని దేశాల్లో ప్రగతిశీల శక్తులు ఇప్పటికప్పుడే ముఖ్యమైన విజయాలను సాధించాయి. భారత దేశంలో పెద్ద బ్యాంకులను ఇటీవల జాతీయం చేయడమూ, భారత పార్లమెంటులోని లోక్‌సభకు ఇటీవల జరిగిన ఎన్నికల్లో మితవాద శక్తులపై ఘనవిజయం సాధించడమూ ఉదహరిస్తే చాలు. ఆ దేశంలోని ప్రజాబాహుళ్యం అభివృద్ధి నిరోధక, సామ్రాజ్యవాద అనుకూల శక్తులను దీక్షతో ఎదుర్కొంటున్నాయనేందుకూ, భూ సంస్కరణలనూ, తదితర సామాజిక-ఆర్థిక పరివర్తనలనూ, అంతర్జాతీయ రంగంలో శాంతి, స్నేహ విధానాన్నీ కోరుతున్నారనేందుకూ ఇది నిదర్శనం. సింహళ, నైగిరియా దేశాల్లో గణనీయమైన సామాజిక మార్పులు వచ్చాయి.

ఎన్ని చిక్కులెదురైనా, అప్పుడప్పుడు పరాజయాలు సంభవిస్తున్నా, ప్రపంచంలో విశాల ప్రాంతాల్లో బహుముఖమైన సామాజిక పరివర్తనా క్రమం కొనసాగుతూనే ఉంది. తమ హక్కులకోసం మానవ ఔన్నత్యంకోసం సాగిస్తూన్న పోరాటంలో శ్రామిక ప్రజలు ముఖ్యమైన విజయాలను సాధిస్తూ ఉన్నారు. నేటికీ వలస బానిసత్వంలో మగ్గుతూన్న దేశాల్లోని దేశభక్తులు, స్వాతంత్ర్యం కోసం వీరోచిత పోరాటాన్ని కొనసాగిస్తూనే ఉన్నారు.

మన దేశానికి సంబంధించి నంతవరకు, ఈ న్యాయమైన పోరాటాన్ని అది పూర్తిగా బలపరుస్తూ ఉంది. విముక్త దేశాలతో సోవియట్ యూనియన్ రాజకీయ, ఆర్థిక సహకారం, గత కొద్ది సంవత్సరాల్లోనూ మరింత అభివృద్ధి చెందింది. వాటితో మన వర్తకం

పెరుగుతూంది. అనేక ఆసియా, ఆఫ్రికా దేశాల్లో, మన సహకారంతో డజన్లకొలది పారిశ్రామిక, వ్యవసాయ సంస్థల నిర్మాణం జరిగింది. ఈ దేశాలకు కావలసిన సిబ్బందిని తరిఫీదు చేయడంలో కూడా మనం తోడ్పడుతున్నాము. ఇదంతా కూడా పరస్పర ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకునే జరుగుతూంది.

కొన్ని దక్షిణ అమెరికా దేశాల్లో గొప్ప మార్పులు జరుగుతూ ఉన్నాయి. చిలీ దేశంలో "పాప్యులర్ యూనిటీ ఫోర్సెస్" సాధించిన విజయం అతి ముఖ్యమైన సంఘటన. ఆ ఖండం చరిత్రలో మొట్టమొదటిసారిగా అక్కడ, ప్రజలు తాము కోరుకున్న, తమకు నమ్మకంగల ప్రభుత్వ స్థాపనను, రాజ్యాంగ బద్ధమైన మార్గాల ద్వారా సాధించుకున్నారు. దేశంలోని అభివృద్ధి నిరోధక శక్తులకూ, యాంకీ సామ్రాజ్యవాదానికీ ఇది గంగవెర్రులెత్తించింది. చిలీ ప్రజలకు, తాము సాధించుకున్న విజయాలు దక్కకుండా చేయాలని ఈ శక్తులు చూస్తున్నాయి. కాని, చిలీ ప్రజలు, తాము ఎంచుకున్న మార్గాన ముందుకు సాగిపోడానికి కృతనిశ్చయులై ఉన్నారు. చిలీ చేపట్టిన ప్రగతిశీల పంథాను, తక్కిన దక్షిణ అమెరికా దేశాల శ్రామిక ప్రజలు బలపరుస్తున్నారు. అమెరికా గుత్తపెట్టుబడిదారీ సంస్థల బానిసత్వాన్నెదుర్కొని పెరూ, బొలీవియా దేశాల ప్రభుత్వాలు పోరాడుతున్నాయి.

వలస, పరాధీన దేశాల ప్రజలు, జాతీయ విముక్తి పోరాటంతో ప్రారంభించి, అసలు దోపిడీ వ్యవస్థ పునాదులనే కూల్చేందుకై పోరాటం సాగించేందుకు ముందుకు సాగిపోతారని మహామహుడు లెనిన్, దూరదృష్టితో అన్న మాటలు నిజమవుతున్నాయి. ఒక ప్రపంచ సామాజిక వ్యవస్థగా మొత్తం పెట్టుబడిదారీ వ్యవస్థ స్థానాలపు ఇది, అన్నిటికన్నా గట్టిదెబ్బ అవుతుందన్నది నిస్సందేహం.

కామ్రేడ్స్, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాగే పోరాటంలో విజయం, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తుల సంఘీభావంపై, అందులోనూ ముఖ్యంగా, వాటి అగ్రదళమైన ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ సంఘీభావంపై చాలవరకు ఆధారపడి ఉంది. ఈ సంఘీభావాన్నీ, కమ్యూనిస్టు శ్రేణుల ఐక్యతనూ బలపరిచేందుకు గత ఐదేళ్ళలోనూ మన పార్టీ, తక్కిన సోదరపార్టీలతో కలిసి ఎంతో కృషి చేసింది.

అది జటిలమైన కర్తవ్యం. కమ్యూనిస్టు ఉద్యమ కార్యకలాపాల తాత్విక-సైద్ధాంతిక ప్రాతిపదికగా మార్క్సిజం-లెనినిజంపై పలువైపుల నుండి దాడి జరిపేందుకు ప్రయత్నాలు అతి తీవ్రంగా సాగినది, సరిగ్గా మనం సింహావలోకనం చేస్తూన్న ఈ కాలంలోనే. "మార్క్సిస్టు-లెనినిస్టు" పార్టీలన్న పేరుతో అనేక దేశాల్లో చిన్న చిన్న ముఠాలను ఏర్పరిచేందుకు చైనా నాయకత్వం పూనుకుంది. అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమానికి పోటీగా. వీటిని ఏదో ఒక విధంగా ఏకం చేయడానికి స్పష్టంగా ప్రయత్నించింది. ట్రాట్స్కీవాదులు, ఈ ముఠాలతో కలిసి కూటములుగా ఏర్పడడానికి అప్పుడప్పుడు ప్రయత్నించారు. సంకుచిత జాతీయవాద వేర్పాటు ధోరణులను అక్కడక్కడ తీవ్రం

చేస్తున్నారు. "అతివాద", మితవాద అవకాశవాదాలు రెండింటినీ పునరుద్ధరించడం జరిగింది.

కమ్యూనిస్టు ఉద్యమ సంఘీభావం వైపు, దాని సైద్ధాంతిక పునాదిని పటిష్ఠం చేయడం వైపు పరిస్థితిని మళ్లించడమే ప్రధాన లక్ష్యంగా ఉంటూ వచ్చింది. 1967 లో కార్లొవీ వారీలో జరిగిన యూరప్ కమ్యూనిస్టు పార్టీల సమావేశమూ, మరికొన్ని కమ్యూనిస్టు అంతర్జాతీయ సమావేశాలూ, ఈ లక్ష్యాన్ని సాధించేందుకు జరిగిన కృషిలో ఒక ముఖ్యమైన దశ.

దీని ఫలితంగా, కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల అంతర్జాతీయ సమావేశం జరపడం తక్షణ కర్తవ్యంగా నిర్ణయించడం జరిగింది. ఈ సమావేశం జరగడానికి ముందు, సన్నాహక కార్యక్రమం చాలా జరిగింది. కామ్రేడ్స్, ఈ సమావేశం జరపాలన్న అభిప్రాయాన్ని కలిగించడానికీ, సమావేశ సన్నాహాలకూ సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ఎంతో సేవ చేసిందన్న విషయం మీకు తెలుసు.

కమ్యూనిస్టుల అంతర్జాతీయ ఐక్యతను బలపరచడంలోనూ, సామ్రాజ్యవాద వ్యతిరేక శక్తులన్నిటినీ పటిష్ఠం చేయడంలోనూ ఈ సమావేశం ఒక ముఖ్యమైన ముందంజ. మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంత సూత్రీకరణలను కొన్నిటిని నేటి పరిస్థితికి అన్వయింపజేస్తూ, ముందుకు తీసుకుపోడానికి ఈ సమావేశం ఎంతో తోడ్పడింది. సోదర పార్టీల మధ్య సంప్రతింపులకు ఇది అతి విశాలమైన, అత్యధిక ప్రాతినిధ్యం గల రూపమనీ, ఒక అంతర్జాతీయ శక్తి అయిన కమ్యూనిస్టు ఉద్యమ అవసరాలను ఇది తీర్చుతున్నదనీ ధ్రువపడింది. అవసరం వచ్చినప్పుడల్లా ఈ విధంగా సోదర పార్టీల అంతర్జాతీయ సమావేశాలు జరపాలని, ఈ సమావేశంలో పాల్గొన్నవారు చేసిన నిర్ధారణతో మన పార్టీ పూర్తిగా ఏకీభవిస్తుంది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలో ఇదొక ఆచారంగా స్థిరపడి పోవడం ఉపయోగకరంగా ఉంటుంది.

లెనిన్ శతజయంతి ఉత్సవాలు కూడా, కమ్యూనిస్టు ఉద్యమ సంఘీభావానికి ఎంతో ప్రాముఖ్యం గలవిగా పరిణమించాయి. ఈ ఉత్సవాలు నిజంగా ప్రపంచ వ్యాప్తంగా జరిగాయి. కమ్యూనిస్టు పార్టీల సమావేశమూ, లెనిన్ శతజయంతి ఉత్సవాలూ, మార్క్సిస్టు-లెనినిస్టు బోధ జీవశక్తిని మరొకసారి స్పష్టం చేశాయి; కార్మికవర్గం యొక్క, యావన్మంది శ్రామిక ప్రజల యొక్క ప్రయోజనాల కోసమూ, సామ్రాజ్యవాదానికీ, కార్మికోద్యమంలో ఉన్న దాని గులాములకూ వ్యతిరేకంగానూ, సాగుతూన్న పోరాటంలో సోదర పార్టీల కార్యకలాపాలకు ఉధృతిని చేకూర్చాయి.

అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ సంఘీభావం అధికాధికంగా బలపడుతున్నదనీ, పార్టీల మధ్య ఫలప్రదమైన ద్విపక్ష, బహుపక్ష సంబంధాలు నానాటికి మరింత చురుకుగా కొనసాగుతున్నాయనీ అనేందుకు, మొత్తంమీద ఆధారం ఉంది. మన పార్టీ ఇందుకు

హర్షిస్తుంది. దీనిని పెంపొంద జేసేందుకూ, ఈ దిశలోనే పరిస్థితులు పరిణమించేలా చేసేందుకూ మన పార్టీ తన కృషిని కొనసాగిస్తూనే ఉంటుంది.

అయితే కామ్రేడ్స్, మనం విస్మరించరాని విషయం మరొకటి ఉంది. అదేమిటంటే, చెడు పోకడలను నిర్మూలించడం సర్వత్రా జరగలేదు. మితవాద, "అతివాద" రివిజనిజానికీ, జాతీయతావాదానికీ వ్యతిరేకంగా పోరాటం సాగించడం నేటికీ, అత్యవసర కర్తవ్యంగానే ఉంది. సోషలిజానికీ, కమ్యూనిస్టు ఉద్యమానికీ వ్యతిరేకంగా తాము సాగించే పోరాటంలో, బూర్జువా సిద్ధాంతవేత్తలూ, బూర్జువా ప్రచారకులూ ఎంతో సంతోషంతో ఆసరాగా తీసుకుంటున్నది అచ్చంగా ఈ జాతీయవాద ధోరణులనే, అందునా ముఖ్యంగా సోవియట్ వ్యతిరేక రూపం ధరించిన జాతీయవాద ధోరణులనే. తమతో ఏదో ఒకలాంటి సైద్ధాంతిక ఒప్పందం కుదుర్చుకునే లాగా కమ్యూనిస్టు ఉద్యమంలోని అవకాశవాద శక్తులను పురికొల్పేందుకు వీరు ప్రయత్నిస్తున్నారు. మీరు సోవియట్ వ్యతిరేకులని మాకు దాఖలా చూపండి చాలు, సిసలైన "మార్క్సిస్టులు" మీరే అనీ, మీరు "పూర్తిగా స్వతంత్రమైన" వైఖరులను అవలంబిస్తున్నారనీ చాటి చెప్పేందుకు మేము సిద్ధం అని చెప్పి, వీరు ప్రేరేపిస్తున్నారా అని అనిపిస్తుంది. ఇటువంటి వారు, తమతమ దేశాల్లో కూడా కమ్యూనిస్టు పార్టీలకు వ్యతిరేకంగా పోరాడే మార్గం అవలంబిస్తారని ఘటనలు నిరూపిస్తున్నాయి. ఫ్రాన్స్‌లోని గరాదీ, ఆస్ట్రియాలోని ఫిషర్, వెనిజులాలోని పెత్కోవ్, ఇటలీలోని "ప్రణాళిక" ముఠా నాయకుల్లాంటి ద్రోహులు ఇందుకు ఉదాహరణ. ఇటువంటి వారికి వ్యతిరేకంగా పోరాటం సాగించడం, తమ శ్రేణులను బలపరచుకునేందుకు ముఖ్యంగా అవసరమని, సోదర పార్టీలు భావిస్తున్నాయి. అందుచేత, రివిజనిజానికీ, జాతీయతావాదానికీ వ్యతిరేకంగా పోరాటం సాగించడం, కమ్యూనిస్టు పార్టీలకు ఒక ముఖ్యమైన కర్తవ్యంగానే నేటికీ ఉన్నదని, ఈ ఉదాహరణలు రుజువు చేస్తున్నాయి; ఇటువంటి ఉదాహరణలను ఇంకా ఎన్నయినా చెప్పవచ్చు.

కామ్రేడ్స్, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో, విప్లవ ప్రజాతంత్ర పార్టీలు అధికాధిక పాత్రను నిర్వహిస్తున్నాయి. వీటిలో అనేకం, సోషలిజాన్ని తమ కార్యక్రమ లక్ష్యంగా ప్రకటించాయి. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, వీటితో తన సంబంధాలను బాగా పెంచుకుంటూ ఉంది. ఇటువంటి పార్టీలకూ, తమ తమ దేశాల్లో ఉన్నవాటితో సహా కమ్యూనిస్టు పార్టీలకూ మధ్య పరస్పర సహకారం, సామ్రాజ్యవాద వ్యతిరేకోద్యమ ప్రయోజనాలకూ, జాతీయ స్వాతంత్ర్య పటిష్ఠత, సామాజిక ప్రగతి ఆశయ ప్రయోజనాలకూ పూర్తిగా అనుగుణమని అనేందుకు మనకు సందేహం లేదు.

పశ్చిమ రాజ్యాలు, తూర్పు రాజ్యాలు, దక్షిణ అమెరికా దేశాలు కొన్నిటిలోని అతివాద సోషలిస్టు పార్టీలతో మనం పరస్పర సంబంధాలను కొనసాగిస్తున్నాము; ఆ

సంబంధాలను అభివృద్ధి పరచుకుంటున్నాము. ఈ విషయంలో, గత కొద్ది సంవత్సరాల్లోనూ కొంత చురుకుగానే కృషి జరిగింది.

1969 నాటి అంతర్జాతీయ సమావేశం నిర్దేశించిన పంథా ననుసరించి, శాంతి, ప్రజాస్వామ్యాలకోసం జరిగే పోరాటంలోనూ, సోషలిజం కోసం జరిగే పోరాటంలోనూ, సోషల్ డెమొక్రాట్లతో సహకారాన్ని పెంచుకొనేందుకు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ సిద్ధంగా ఉంది. అయితే, సిద్ధాంతం విషయంలోనూ, విప్లవ సూత్రాల విషయంలోనూ ఏలాంటి రాజీ పడకుండా మాత్రమే ఇందుకు సిద్ధమన్నది నిస్సందేహం. కాని, సోషల్ డెమొక్రాటిక్ పార్టీల్లోని మితవాద నాయకులు, కమ్యూనిస్టుల ఈ పంథాను మొండిగా ప్రతిఘటిస్తున్నారు. కార్మికోద్యమాన్ని గుత్తపెట్టుబడిదారుల ప్రయోజనాలకు లోబడి ఉండేలా చేసే, శాంతి, ప్రజాస్వామ్యం, సోషలిజంల కోసం శ్రామిక ప్రజలు సాగించే పోరాటాన్ని దెబ్బతీసే ప్రతి ఒక్క ధోరణికీ వ్యతిరేకంగా మన పార్టీ, అచంచలమైన దీక్షతో పోరాటం సాగిస్తూనే వచ్చింది; ఇకముందూ సాగిస్తుంది.

కామ్రేడ్స్, ప్రజల ఆశయం కోసం పోరాడిన యోధులు ఏనాడూ ఎదుర్కొన నంతటి కఠినమైన పరీక్షలను కమ్యూనిస్టులు ఎదుర్కోవలసి వచ్చింది. లెనిన్ అన్న ఈ మాటలు మనకు జ్ఞాపకం ఉన్నాయి: "విత్తు నాటడానికీ, పంట చేతికి అందడానికీ మధ్య దీర్ఘ దశాబ్దాలు గడచినా సరే, విప్లవానికి స్వార్థరహితంగా అంకితం కావడమూ, ప్రజల్లో విప్లవ ప్రచారాన్ని సాగించడమూ వృధా కావు" (*కలెక్టెడ్ వర్క్స్*, సం. 18, పుట 31). సోషలిజాన్ని వాస్తవంగా ఆచరణలో పెట్టడంలోనూ, లక్షోప లక్షల ప్రజల ఆలోచనలూ, కార్యచరణల్లోనూ, కమ్యూనిస్టుల భావాలు అద్భుతంగా మొలకలెత్తాయి.

సోదర కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీలు తమ తమ దేశాల్లో సాగిస్తూన్న బ్రహ్మాండమైన కృషికి సోవియట్ దేశ కమ్యూనిస్టులు ఎంతో విలువ ఇస్తున్నారు. ఈ కృషి ఎంత కష్ట సాధ్యమైనదో, ఇందుకు, స్వార్థరహితమైన దీక్ష, మహత్తరమైన మన ఉమ్మడి ఆదర్శాలపట్ల అపారమైన భక్తి తాత్పర్యాలూ ఎంతగా అవసరమో మనకు బాగా తెలుసు. ప్రియమైన మిత్రులారా, మా పార్టీ సుసంఘటితమైన సమరశీల శ్రేణుల్లో సర్వదా మీతో భుజం భుజం కలిపి ముందుకు సాగుతుందని, మన సహయోధులకు, యావత్తు ప్రపంచంలోని కమ్యూనిస్టులకు నేడు, మరొకసారి హామీ ఇవ్వాలనుకుంటున్నాము.

పోరాటంలో చేసిన మహత్తర త్యాగాలను మనం ఏనాటికీ మరచిపోము. కమ్యూనిస్టు ఉద్యమ యోధుల పేరులూ, ధైర్యసాహసాలతోనూ, కార్మికవర్గ ఆశయంపట్ల విధేయతతోనూ చేసిన ఘనకార్యాలూ, విజయవంతమైన సోషలిస్టు విప్లవ పతాకను మొట్ట మొదటిసారిగా ఎగురవేసిన లెనిన్ పార్టీకీ, సోవియట్ ప్రజలకూ ఎల్లప్పుడూ కూడా పరమ పవిత్రమైనవిగానే ఉంటాయి.

తన అంతర్జాతీయతా విధ్యుక్త ధర్మాన్ని బాగా ఎరిగి ఉన్న సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, ప్రపంచ వ్యాప్తమైన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని మరింత శక్తివంతం చేసేందుకూ, ఈ పోరాటంలోని భాగస్వాముల సమరశీల ఐక్యతను పటిష్ఠం చేసేందుకూ తోడ్పడే పంథానే, ఇకముందు కూడా, అంతర్జాతీయ రంగంలో అనుసరిస్తుంది.

ప్రపంచ పరివ్యాప్తంగా సోషలిస్టు ఆశయం సంపూర్ణ విజయం సాధించడం అనివార్యం. ఈ విజయాన్ని సాధించడం కోసం, శ్రామిక ప్రజల సౌఖ్యంకోసం సాగే పోరాటానికి మనం మన సర్వశక్తులనూ అర్పిస్తాము।

## 3. శాంతికోసం, దేశదేశాల ప్రజల భద్రతకోసం సోవియట్ యూనియన్ సాగించిన పోరాటం. సామ్రాజ్యవాద దురాక్రమణ విధానానికి ఎదురుదెబ్బ.

కామ్రేడ్స్, సోవియట్ యూనియన్‌లో కమ్యూనిస్టు నిర్మాణాన్ని కొనసాగించడం కోసం శాంతియుత పరిస్థితులను నెలకొల్పేందుకూ, సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తుల కార్యకలాపాలను బట్టబయలు చేసి వమ్ము చేసేందుకూ, సోషలిజాన్నీ, దేశదేశాల ప్రజల స్వాతంత్ర్యాన్నీ, శాంతినీ కాపాడేందుకూ, మనం ఇప్పుడు సమీక్షిస్తూన్న కాలంలో పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ ప్రభుత్వమూ తమ సర్వశక్తులా కృషి చేశాయి.

ఒక వంక దురాక్రమణను గట్టిగా తిప్పికొట్టడమూ, మరొక వంక అత్యవసర అంతర్జాతీయ సమస్యలను పరిష్కరించడం, అన్య సామాజిక వ్యవస్థకు చెందిన దేశాలతో మామూలు సంబంధాలను, పరిస్థితి అనుకూలంగా ఉన్న చోట సత్సంబంధాలను పెట్టుకోవడం అనే నిర్మాణాత్మక పంథాను అనుసరించడం—ఈ రెండింటినీ మన విధానం సర్వదా జోడిస్తూ ఉంది. వాటి వాటి సామాజిక వ్యవస్థలతో నిమిత్తం లేకుండా దేశాల శాంతియుత సహజీవనం అనే లెనినిస్టు సూత్రాన్ని, గతంలో లాగానే మనం ఏకరీతిగా బలపరుస్తున్నాము. అంతర్జాతీయ పరిణామంలో ఈ సూత్రం, నేడు నిజమైన శక్తిగా రూపొందింది.

వాటి తీవ్రతవల్ల నేమి, లేదా, భవిష్యత్తుకు అవి ముఖ్యమైనవి కావడంవల్ల నేమి, మనం ప్రత్యేకంగా శ్రద్ధ వహించవలసి వచ్చిన అతి ముఖ్యమైన అంతర్జాతీయ సమస్యలను గురించి ప్రస్తావించేందుకు నన్ననుమతించండి.

ఆగ్నేయాసియా ఘటనలతో ప్రారంభించుదాము. ప్రపంచంలోని ఆ ప్రాంతంలో అమెరికా పాలకవర్గాలు ప్రారంభించిన దురాక్రమణ యుద్ధం అమెరికా ప్రజలకు జయమాలల నేమీ ప్రసాదించ లేదు సరికదా, శవాలంకరణ మాలలను వేలకొలదిగా ప్రసాదించింది. ప్రత్యక్ష సాయుధ జోక్యంగాని, సంప్రతింపులను భగ్నం చేయడంగాని, చివరకు కిరాయి సైనికులను నానాటికి మరింత విస్తృతంగా ఉపయోగించడం గాని, తమ

దేశానికి తామే అధినాథులము కావాలని వియత్నాం ప్రజలకు గల దృఢదీక్షను భగ్నం చేయ జాలవన్న విషయం, పరిస్థితులను వాస్తవికతా దృష్టితో చూడగల వారి కెవ్వరికైనా స్పష్టం కాగలదు.

యుద్ధ వియత్నామీకరణ అని చెప్పుకుంటున్నదీ, అంటే, అమెరికా ప్రయోజనాలకోసం వియత్నాం దేశీయులే తోటి వియత్నాం దేశీయులను చంపుకునేలా చేసే పన్నాగమూ, దురాక్రమణను కాంబోడియా, లావోస్‌లకు విస్తరింప జేయడమూ— ఇవేవీ కూడా, ఇండోచైనాలో అది ప్రారంభించిన పాపిష్టి యుద్ధం ఊబినుండి అమెరికాను బయటపడవేయనూ లేవు, దురాక్రమణను ప్రారంభించి, నేటికీ కొనసాగిస్తూన్న వారు ఆ దేశానికి కుప్పతెప్పలుగా తెచ్చిపెట్టిన అవమానాన్ని తుడిచివేయనూ లేవు. వియత్నాం సమస్యా పరిష్కారానికి ఒకే ఒక మార్గముంది. వియత్నాం ప్రజాతంత్ర రిపబ్లిక్ ప్రభుత్వమూ, దక్షిణ వియత్నాం రిపబ్లిక్ తాత్కాలిక విప్లవ ప్రభుత్వమూ చేసిన ప్రతిపాదనల్లో ఇది స్పష్టంగా సూచిత మయింది. ఈ ప్రతిపాదనలను మనం గట్టిగా బల పరుస్తున్నాము.

వియత్నాం, కాంబోడియా, లావోస్ దేశాల ప్రజలపై సామ్రాజ్యవాద దురాక్రమణను అంత మొందించాలని సోవియట్ యూనియన్ గట్టిగా కోరుతూంది. ఇండోచైనా ప్రజల న్యాయమైన ఆశయాన్ని మన దేశం ఆచరణ పూర్వకంగా బలపరచింది, ఇక ముందూ బలపరుస్తుంది.

మధ్యప్రాచ్యం, ప్రపంచంలో మరొక "నిప్పుల కుంపటి"గా ఉంది.

ఐక్య అరబ్బు రిపబ్లిక్, సిరియా, జోర్డాన్‌లపై ఇజ్రాయిల్ జరిపిన దాడి ఫలితంగా ఉత్పన్నమైన సంక్షోభం, గడచిన కాలంలోని అంతర్జాతీయ సంబంధాల పరిణామంలో అతి తీవ్రమైనదిగా ఉంది.

ఈ దురాక్రమణను ఆపి, ఖండించేందుకు మనం, సోదర సోషలిస్టు దేశాలతో కలిసి చేయవలసినదంతా చేశాము. అతి ఖండితమైన రూపంలో ఈ సమస్యను, ఐక్య రాజ్య సమితి భద్రతా సంఘం ఎదుట పెట్టాము. మనం కోరగా, ఈ సమస్యపై ఐక్య రాజ్య సమితి సర్వ ప్రతినిధి అసాధారణ సమావేశం జరిగింది. కాల్పుల విరమణను గురించి ఐ. రా. స. చేసిన నిర్ణయాన్ని ధిక్కరించిన ఇజ్రాయిల్‌తో సోవియట్ యూనియనూ, తక్కిన సోదర దేశాలూ దౌత్య సంబంధాలను తెంచి వేసుకున్నాయి. దండయాత్రకు గురి అయిన అరబ్బు దేశాల, ముఖ్యంగా ఐక్య అరబ్బు రిపబ్లిక్, సిరియా దేశాల రక్షణ శక్తిస్తోమతులను పునరుద్ధరించేందుకు మన దేశం తోడ్పడింది. ఈ దేశాలతో మన సహకారం ఏడాది కేడాదికీ పెరుగుతూంది.

ఐక్య అరబ్బు రిపబ్లిక్ ఇటీవలి సంవత్సరాల్లో ముఖ్యమైన చొరవ చూపింది. ఐ రా స ప్రత్యేక ప్రతినిధి డాక్టర్ గున్నార్ యారింగ్ చేసిన ప్రతిపాదనకు అది తన

సమ్మతిని ప్రకటించింది. ఆక్రమిత ప్రాంతాలనుండి ఇజ్రాయిల్ తన సేనలను ఉపసంహరించుకున్నదే తడవుగా దానితో శాంతి ఒప్పందం కుదుర్చుకునేందుకు తన సంసిద్ధతను ప్రకటించింది. అద్యతన భావిలో సూయజ్ కాలువగుండా నౌకల రాకపోకలను పునరుద్ధరించేందుకు తగు చర్యలను కూడా ఐక్య అరబ్బు రిపబ్లిక్ ప్రతిపాదించింది. ఈ విధంగా, అరబ్బు పక్షం వైఖరి, మధ్యప్రాచ్య సంక్షోభాన్ని పరిష్కరించేందుకు నిజమైన ప్రాతిపదికను సమకూర్చుతూంది. ఈ ప్రతిపాదనలను ఇజ్రాయిల్ ప్రభుత్వం నిరాకరించింది; అరబ్బు భూభాగాలు తమకు చెందాలని ఇజ్రాయిల్ ప్రభుత్వం ఇప్పుడు బాహాటంగానే కోరుతూంది. మధ్యప్రాచ్యంలో శాంతి సాధనకు ఎవరు అవరోధం కలిగిస్తున్నారో, ఆ ప్రాంతంలో యుద్ధానికి ప్రమాదకరమైన ఆలవాలాన్ని అట్టే ఉంచుతూన్న నేరం ఎవరిదో దీనినిబట్టి స్పష్టమవుతూంది. అదే సమయంలో, ఇజ్రాయిల్ ఉగ్రవాదులను పురిగొల్పుతూన్న వారి అసహ్యకరమైన పాత్ర, అమెరికా సామ్రాజ్యవాదులూ, సామ్రాజ్యవాద దురాక్రమణ శక్తుల చేతిలో కీలుబొమ్మగా అంతర్జాతీయ యూదు దురహంకార ఉద్యమమూ నిర్వహిస్తూన్న పాత్ర, నానాటికి మరింత స్పష్టంగా వెల్లడవుతూంది.

అయితే, ఇజ్రాయిల్ ప్రభుత్వం, విజ్ఞతతో పరిస్థితులను పరిశీలించాలి. ఇతరుల భూభాగాలను భుక్తం చేసుకొని తప్పించుకు పోగలమనే ఇజ్రాయిల్ పాలకవర్గాలు నిజంగా అనుకుంటున్నారా? బందిపోటు దాడి ఫలితంగా దండయాత్రికులకు చేకూరే లాభాలు, చివరకు వట్టి మిథ్యగానే పరిణమిస్తాయి. సినాయ్ ఎడారి భూముల్లో కనిపించే ఎండమావుల్లాగానే ఇవి కూడా అదృశ్యమై పోతాయి. మధ్యప్రాచ్యంలో రాజకీయ పరిష్కారం ఎంత ఆలస్యమైతే, ప్రపంచ ప్రజల ఆగ్రహమూ, దురాక్రమణదారుని పట్లా, దాని పోషకుల పట్లా అరబ్బు ప్రజల ద్వేషమూ అంత తీవ్రమవుతాయి, ఇజ్రాయిల్ పాలకులు తమ ప్రజలకూ, తమ దేశానికీ తెచ్చిపెట్టే కీడు అంత ఎక్కువగా ఉంటుంది.

సోవియట్ దేశం, ఇకముందు కూడా తన అరబ్బు మిత్రులను గట్టిగా బలపరుస్తూనే ఉంటుంది. మధ్యప్రాచ్యంలో కుదిరే రాజకీయ పరిష్కారానికి, భద్రతా సంఘంలోని తక్కిన శాశ్వత సభ్యులతో కలిసి అంతర్జాతీయ హామీని సమకూర్చేందుకు మన దేశం సిద్ధంగా ఉంది.

ఈ పరిష్కారం కుదిరినదే తడవుగా, ఆ రంగం అంతటా సైనిక ఉద్రిక్తతను తొలగించేందుకూ, అందునా ముఖ్యంగా మధ్యధరా సముద్రాన్ని శాంతికీ, స్నేహపూర్వక సహకారానికీ ఆటపట్టుగా ఉండే సముద్రంగా మార్చడానికీ తీసుకోవలసిన చర్యలను గురించి ఆలోచించడానికి వీలవుతుందని భావిస్తున్నాము.

కామ్రేడ్స్, ఈ సంవత్సరా లన్నిటిలోనూ, మన విదేశాంగ విధానానికి సంబంధించిన కార్యకలాపాల్లో యూరప్, అతి ముఖ్యమైన రంగాల్లో ఒకటిగా ఉంటూ వచ్చింది.

సోవియట్-ఫ్రెంచి సంబంధాలు మెరుగు కావడం, యూరప్ వ్యవహారాల గతి

క్రమం అంతటికీ చాల ముఖ్యమైన సత్ఫలితాలను చేకూర్చింది. ఫ్రాన్సు అధ్యక్షునితో ఇటీవల మాస్కోలో జరిగిన సంప్రతింపుల ఫలితంగానూ, రాజకీయ సమాలోచనలను గురించిన ఒక ఒప్పంద వివరణ పత్రంపై సంతకాలు జరగడం ఫలితంగానూ, సోవియట్-ఫ్రెంచి సహకారానికి గల అవకాశాలు విస్తరించాయి. మన రెండు దేశాల ప్రజల మైత్రి, మంచి చారిత్రక సంప్రదాయాలపై ఆధారపడి ఉంది. ఈనాడు ఈ రెండు దేశాలకూ, విస్తృతమైన ఉమ్మడి ప్రయోజనాల రంగం కూడా ఉంది. సోవియట్, ఫ్రాన్సు దేశాల మధ్య సంబంధాలు మరింత అభివృద్ధి చెందాలనీ, ప్రగాఢం కావాలనీ మనం కోరుతున్నాము; అంతర్జాతీయ భద్రతకు ఇది ముఖ్యమని భావిస్తున్నాము.

జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌తో మనకుగల సంబంధాల్లో గణనీయమైన ఒక మార్పు వచ్చినందువల్ల యూరప్‌లో కొత్త సదవకాశా లేర్పడుతున్నాయి.

మన బంధు దేశాలూ, మిత్ర దేశాల్లాగానే మనం కూడా, యూరప్‌లో సుస్థిర శాంతి, యూరప్ దేశాల సరిహద్దుల అనుల్లంఘనీయత పైనే ముఖ్యంగా ఆధారపడి ఉంటుంది అన్న ప్రాతిపదికపైనే, యుద్ధానంతర కాలం పొడుగునా వ్యవహరించాము. జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్‌ల మధ్యగల సరిహద్దు, పోలెండు పడమటి సరిహద్దులతో సహా ఈ సరిహద్దుల అనుల్లంఘనీయతను, సోవియట్ యూనియన్‌తోనూ, పోలెండుతోనూ, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ కుదుర్చుకున్న సంధు లిప్పుడు, నిస్సందేహంగా ధ్రువీకరించాయి.

ఈ సంధులను ధ్రువపరచడం సమస్యపై పశ్చిమ జర్మనీలోని రాజకీయ శక్తుల మధ్య తీవ్రమైన విభజన ఉంది. బాన్‌లోని, మరికొన్ని పాశ్చాత్య దేశాల రాజధానుల్లోని వాస్తవిక దృష్టి కలవారికి ఒక సామాన్య విషయం తెలిసి వుంటుందని ఎవరైనా అనుకుంటారు. అదేమిటంటే, ఈ సంధుల ధ్రువీకరణ ఆలస్యం కావడం, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్ విధానం అంతటిపైనీ క్రొత్తగా అనుమానం కలిగిస్తుంది, యూరప్‌లోని రాజకీయ వాతావరణాన్నీ, అంతర్జాతీయ ఉద్రిక్తతను తగ్గే అవకాశాలను పాడు చేస్తుంది.

సోవియట్ యూనియన్‌కి సంబంధించి నంతవరకు, సోవియట్-పశ్చిమ జర్మనీ సంధి కుదరడం వల్ల తనకు సంక్రమించిన బాధ్యతలను నెరవేర్చడానికి అది సిద్ధంగా ఉంది. జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్కుకూ, యూరప్‌లోని సోషలిస్టు భాగానికీ మధ్యగల సంబంధాలను మామూలు స్థితికి తేవడంలోనూ, మెరుగు పరచడంలోనూ మన వంతు కర్తవ్యాన్ని నెరవేర్చడానికి మనం సిద్ధంగా ఉన్నాము. అయితే అవతలి పక్షం ఈ సంధికి సర్వాత్మనా అనుగుణంగా వ్యవహరించినప్పుడే ఇలా జరుగుతుందన్నది నిస్సందేహం.

యూరప్‌లో ఇటీవల మంచి మార్పులు వచ్చాయంటే, దాని అర్థం, రెండవ ప్రపంచ యుద్ధంవల్ల యూరప్‌కు సంక్రమించిన సమస్యలు పూర్తిగా పరిష్కారం అయి

పోయాయని కాదు. యూరప్ పరిస్థితిలో వచ్చిన మెరుగుదలను కొనసాగించేందుకు, యూరప్‌లో సమిష్టి భద్రతను నెలకొల్పడంలో పురోగమించేందుకు, ద్విపక్ష ప్రాతిపదిక పైనీ, అఖిల యూరప్ ప్రాతిపదికపైనీ సహకారాన్ని అభివృద్ధి పరచేందుకు ఏమి చేయాలి?

అఖిల యూరప్ సమావేశాన్ని జరపడం ద్వారా మొత్తం యూరప్‌లోని పరిస్థితి మెరుగయ్యేలా చేయవచ్చు. యూరప్ దేశాల్లో ఎక్కువ భాగం ఇప్పుడీ ప్రతిపాదనను బలపరుస్తున్నాయి. దీనికై సన్నాహాలు ఆచరణ పూర్వక రాజకీయాల రంగంలో భాగ మౌతున్నాయి. అయితే యూరప్‌లో ఉద్రిక్తత సడలింపునకు అడ్డుతగిలే ప్రయత్నాలు ఆగిపోలేదు. అఖిల యూరప్ సమావేశం జరగాలంటే యూరప్ ఖండంలోని దేశాలన్నీ కూడా తీవ్రంగా కృషి చేయాల్సి ఉంటుంది.

ఈ ఖండంలోని పరిస్థితి మెరుగు కావడానికి, సోవియట్-పశ్చిమ జర్మనీ, పోలెండు-పశ్చిమ జర్మనీ సంధులు సాధ్యమయినంత త్వరగా ఆచరణలోనికి రావడం సహజం గానే అవసరం.

పశ్చిమ బెర్లిన్‌కు సంబంధించిన సమస్యలు కూడా పరిష్కారం కావాలి. అమెరికా, ఫ్రాన్స్, బ్రిటన్లు కూడా మనలాగానే, పశ్చిమ బెర్లిన్ ప్రత్యేక హోదాను నిర్ణయించిన మిత్రరాజ్య ఒప్పందాల పట్ల గౌరవభావంతోనూ, స్వతంత్ర సోషలిస్టు రాజ్యంగా జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్కు సార్వభౌమాధికారాల పట్ల గౌరవభావంతోనూ వ్యవహరించి ఉన్నట్లయితే ప్రస్తుతం కొనసాగుతూన్న సంప్రదింపులు, పశ్చిమ బెర్లిన్ జనాభాతో సహా అన్ని పక్షాలకూ పరస్పర లాభదాయకంగా, జయప్రదంగా ముగిసి ఉండేవి.

సార్వత్రికంగా ఆమోదించిన అంతర్జాతీయ న్యాయసూత్రాల ప్రాతిపదికపై జర్మన్ ప్రజాతంత్ర రిపబ్లిక్, జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్కుల మధ్య న్యాయమైన సంబంధాలను నెలకొల్పడం, ఈ రెండు దేశాలను ఐక్యరాజ్య సమితిలో సభ్యులుగా చేర్చుకోవడం మరొక అత్యవసర కర్తవ్యం.

మ్యూనిచ్ ఒప్పందం, మొదటినుంచీ కూడా చెల్లనేరనిదని గుర్తించాలని, చెకొస్లొవాకియా సోషలిస్టు రిపబ్లిక్కు కోరుతూన్న న్యాయమైన కోర్కెను తీర్చడం కూడా చాలా ముఖ్యమైన విషయం.

కామ్రేడ్స్, నిరాయుధీకరణ నేటి అతిముఖ్య అంతర్జాతీయ సమస్యల్లో ఒకటి. యుద్ధ ప్రమాదాన్ని తగ్గించే నిర్దిష్టమైన ఫలితాలను సాధించాలనీ, ఆయుధాల పోటీ తప్పని సరి అయిన చెడుగు అని దేశదేశాల ప్రజలు భావించకుండా చేయాలనీ మనం కోరుతున్నాము.

అణ్వస్త్ర వ్యాప్తి నివారణ సంధిని రూపొందించడమూ, అది అమలులోకి రావడమూ, ఇప్పుడు మనం సింహావలోకనం చేస్తున్న కాలంలో జరిగాయి. కొన్ని అణ్వస్త్ర

రాజ్యాలతో సహా అన్ని దేశాలూ దీనిని ఆమోదించడం ఇంకా జరగక పోయినప్పటికీ, అణుయుద్ధం విరుచుకుపడే ప్రమాదాన్ని ఇది కొంతవరకు తగ్గిస్తోంది. జర్మన్ ఫెడరల్ రిపబ్లిక్కు, జపాన్, ఇటలీ మొదలైన దేశాలు ఈ ఒప్పందాన్ని ధ్రువపరచడం ద్వారా దీనిపై తాము పెట్టిన సంతకాలను బలపరచడం ఇప్పుడు జరగవలసిన ముఖ్యమైన పని.

రోదసిలోనూ, సముద్రం మీదనూ, సముద్ర గర్భంలోనూ అణ్వాయుధాలను ఉంచ డాన్ని నిషేధిస్తూ ఒప్పందాలు కుదిరాయి. అయితే ఇంతవరకు జరిగినదంతా కొద్దిపాటి తొలి చర్యలు మాత్రమే. అణుశక్తి కేవలం శాంతియుత ప్రయోజనాలకు మాత్రమే ఉప యోగపడే స్థితిని నెలకొల్పాలన్నది మన లక్ష్యం.

వ్యూహాత్మక ఆయుధాలను పరిమితం చేయడం గురించి మనం అమెరికాతో సంప్రతింపులు సాగిస్తున్నాము. ఈ సంప్రతింపులు ఫలప్రదమైనట్లయితే, మరొక దఫా రాకెట్ ఆయుధాల పోటీ జరగకుండా నివారించడమూ, గణనీయమైన వనరులు నిర్మా ణాత్మక లక్ష్యాలకు వినియోగమయ్యేలా చేయడమూ సాధ్యమౌతుంది. ఈ సంప్రతిపుల్లో సత్ఫలితాలను సాధించేందుకే మనం కృషి చేస్తున్నాము.

అయితే ఒక విషయం నొక్కి చెప్పవలసి వుంది. అదేమిటంటే, నిరాయుధీకరణ సంప్రతింపులలో పాల్గొంటున్న పక్షాల భద్రతా ప్రయోజనాలను సరిసమానంగా దృష్టిలోకి తీసుకున్నప్పుడు మాత్రమే, ఏ ఒక్కరూ ఏకపక్ష లాభాలను సాధించేందుకు ప్రయత్నించ కుండా వున్నప్పుడు మాత్రమే, ఆ సంప్రతింపులు మొత్తంమీద ఫలప్రదం కాగలవు—అతి సున్నితమైన సైనిక-సాంకేతిక విషయాలకు సంబంధించిన చర్చలను గురించి వేరే చెప్పనక్కర లేదు.

అణ్వస్త్ర, సాంప్రదాయిక ఆయుధాల పోటీని తుదముట్టించడం కోసమూ, నిరా యుధీకరణ కోసమూ సాగే పోరాటాన్ని సార్వత్రిక, సంపూర్ణ నిరాయుధీకరణ పర్యంతం కొనసాగించడం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, సోవియట్ ప్రభుత్వాల విదేశాంగ కార్య కలాపాల్లోని అతిముఖ్య రంగాల్లో ఒకటిగా ఇకముందు కూడా వుంటుంది.

పెట్టుబడిదారీ దేశాలతో సోవియట్ యూనియన్ సంబంధాలు ఇటీవలి సంవ త్సరాల్లో బాగా చురుకు దేలి, వైవిధ్యం సంతరించుకున్నాయి. వీటిలో కొన్నిటితో, సాధారణ విదేశాంగ సమస్యల విషయంలో సహకారం విస్తృతమయింది. మరింత చక్కని పరస్పర సదవగాహనకూ, వైఖరులు మరింత సన్నిహిత మయేందుకూ దోహదకరంగా రాజకీయ సమాలోచనలను, ఆచరణలో ఆమోదించడం జరిగింది. ఆర్థిక, విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లో సంబంధాలు గణనీయమైన స్థాయి నందుకున్నాయి. కొన్ని సందర్భాల్లో ఇవి, దీర్ఘకాలిక ప్రాతిపదికపై ఆధారపడి ఉన్నాయి. ఉదాహరణకు వోల్గా మోటారుకార్ల ఫ్యాక్టరీని నిర్మించడంలో ఇటలీతోనూ, సోవియట్ దేశం నుండి పశ్చిమ యూరప్‌కు గ్యాస్ సరఫరా గొట్టాలను నిర్మించడంతో సహా గ్యాసు పరిశ్రమను

అభివృద్ధి పరచడంలో ఆస్ట్రియా మొదలైన కొన్ని దేశాలతోనూ మనం సహకరిస్తు న్నాము. పరస్పర లాభదాయకమైన షరతులపైనే ఈ సహకారం కొనసాగుతున్నదని వేరే చెప్పనక్కరలేదు. ఫ్రాన్స్‌లో ఇనుము, ఉక్కు పరిశ్రమ సముదాయాన్ని నిర్మించ డంలో సోవియట్ యూనియన్ భాగస్వామ్యం గురించి ఇటీవలనే ఒప్పందం కుదిరింది. సోవియట్ దూరప్రాచ్యంలో ఒక కొత్త ఓడరేవును నిర్మించడంలో జపాను కంపెనీలు సహకరించ బోతున్నాయి. వ్యవహార రంగంలో మన భాగస్వాములు ఎంతో ఆసక్తిని కనపరచిన మరికొన్ని ముఖ్య ప్రాజెక్టులను గురించి చర్చలు జరుగుతున్నాయి.

మామూలు ప్రకారంగానే, మన పొరుగు దేశాలతో సంబంధాల పట్ల మనం ఎంతో శ్రద్ధ వహించాము. ఫినాండుతో ఇరుగు పొరుగు సత్సంబంధాలూ, పరస్పర సహకారమూ, నానాటికి మరింత బలపడుతూనే ఉన్నాయి; ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్ దేశాలతో మన సంబం ధాలు జయప్రదంగా అభివృద్ధి చెందుతూ ఉన్నాయి; పాకిస్తాన్, టర్కీ దేశాలతో మనకు మామూలు సంబంధా లున్నాయి; స్వీడన్‌తో మన సంబంధాలు స్థిరంగా ఉన్నాయి.

భారత దేశంతో మన స్నేహ సంబంధాలు గణనీయంగా అభివృద్ధి చెందాయి. అంతర్జాతీయ వ్యవహారాల్లో భారత ప్రభుత్వం శాంతియుత, స్వతంత్ర విధానాన్ని అనుస రించడం, మన రెండు దేశాలనూ బంధిస్తూన్న సంప్రదాయ సిద్ధమైన స్నేహభావమూ, సోవియట్-భారత సహకారాన్ని ప్రగాఢ మొనర్చేందుకు తోడ్పడ్డాయి.

జపానుతో పరస్పరం లాభదాయకమైన సహకారాన్ని మరింత అభివృద్ధి పరచు కునేందుకు పెద్దగా అవకాశా లున్నాయని విశ్వసిస్తున్నాము. ప్రాదేశిక సమస్యలని అంటూన్న వాటిని జపానులోని కొన్ని వర్గాల వారు దుర్వినియోగం చేసుకోడానికి జరిగే ప్రయత్నాలు, సోవియట్-జపాను సంబంధాలకు ఏలాంటి మేలూ చేకూర్చక పోయినప్ప టికీ, ఇటువంటి అవకాశా లున్నాయని అనుకుంటున్నాము. తగు ఒప్పందాల ప్రాతిపదికపై ఈ సంబంధాలను పూర్తిగా మామూలు స్థితికి తీసుకు రావడానికి, జపానులో విదేశీ సైనిక స్థావరాలు ఉండడం కూడా ఒక ఆటంకంగా ఉంది. వాస్తవ విషయం ఏమంటే, ఈ సంబంధాలను మామూలు స్థితికి తీసుకు రావడం, ఉభయదేశాల ప్రజల దీర్ఘకాలిక ప్రయో జనాలకూ, దూరప్రాచ్యంలోనూ, పసిఫిక్కు ప్రాంతంలోనూ శాంతి ప్రయోజనాలకూ అనుగుణమైనదిగా ఉంటుంది.

ఇక, అమెరికాతో సోవియట్ దేశ సంబంధాల విషయం. సోవియట్-అమెరికా సంబంధాలు మెరుగు కావడం, సోవియట్, అమెరికా దేశాల ప్రజల ప్రయోజనాలకూ, పటిష్ఠమయిన శాంతి ప్రయోజనాలకూ దోహదకరంగా ఉంటుంది. అయితే, ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో అమెరికా సాగిస్తూన్న దురాక్రమణ కార్యకలాపాలను గురించి ఉపేక్ష వహించజాలము. సోవియట్ దేశ ప్రయోజనాలకు సంబంధించిన కొన్ని సమస్యలతో సహా, అనేక అంతర్జాతీయ సమస్యల విషయంలో, ఇటీవలి కాలంలో అమెరికా

ప్రభుత్వం మరింత బిర్రబిగుసుకున్న వైఖరిని అవలంబిస్తూంది. అమెరికా విదేశాంగ విధానంలో తరుచుగా కనబడుతూన్న వంకర టింకరలవల్ల కూడా, అమెరికాతో వ్యవహరించడం మరింత కష్టమైపోతూ ఉంది. స్వల్పకాలిక ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని దేశంలో జరుగుతూన్న రాజకీయ పన్నాగాలకూ, ఈ వంకర టింకరలకూ సంబంధం ఉన్నదన్నది స్పష్టం.

సోవియట్, అమెరికా దేశాల మధ్య సంబంధాలను మెరుగు పరచడం సాధ్యమేనన్న నమ్మకాన్ని ప్రాతిపదిక చేసుకొని మనం వ్యవహరిస్తున్నాము. శాంతియుత సహజీవన సూత్రాలను నికరంగానూ, పూర్తిగానూ ఆచరణలో పెట్టడం, పరస్పరం లాభదాయకమయిన సంబంధాలను అభివృద్ధి పరచడం, శాంతిని పటిష్ఠం చేయడంలో సహకరించేందుకు సిద్ధంగా వున్న దేశాలతో ఆ కృషిలో సహకరించడం, వాటితో మన సంబంధాలను సాధ్యమయినంతగా సుస్థిరం చేయడం—ఇదీ, అమెరికాతో సహా పెట్టుబడిదారీ దేశాల విషయంలో మనం అనుసరిస్తూన్న సూత్రబద్ధమయిన విధానం. అయితే, ఎదుటి పక్షానికి, ముఖ్య సమస్యలను సంప్రతింపుల ద్వారా పరిష్కరించుకోవాలన్న కోరిక నిజంగా ఉన్నదా, లేక, "బలం చూపి వ్యవహరించే" విధానాన్ని అనుసరించాలనే ప్రయత్నం మాత్రమేనా అన్న విషయాన్ని మనం, తప్పనిసరిగా దృష్టిలోకి తీసుకోవాలి.

తమ దురాక్రమణ పథకాలను కప్పిపుచ్చుకో వలసిన అవసరం కలిగినప్పుడెల్లా, సామ్రాజ్యవాదులు "సోవియట్ ప్రమాదం" అనే బూచిని పునరుద్ధరిస్తున్నారు. హిందూ మహా సముద్రంలోనూ, కార్డిల్లెరాస్ పర్వత శిఖరాలపైనీ ఈ ప్రమాదం జాడలను కనిపెట్ట జూస్తున్నారు. ఇక, ఉత్తర అట్లాంటిక్ కూటమి దుర్భిణీల్లోంచి గనుక చూచినట్లయితే, యూరప్ మైదానాల్లో కనిపించేదల్లా, పశ్చిమ దేశాలపై విరుచుకు పడడానికి సిద్ధంగా ఉన్న సోవియట్ సేనావాహినులు తప్ప మరొకటి కాదు.

అయితే, తనకు పూర్తిగా వ్యతిరేకమయిన ఉద్దేశాలను సోవియట్ దేశానికి అంటగట్టేందుకు జరిగే ప్రయత్నాలు ఆయా దేశాల ప్రజలను మోసగించ జాలవు. పూర్తి బాధ్యతతో మనం ఇలా ప్రకటిస్తున్నాము: ఎవరి భూభాగాలనూ మేము కోరడం లేదు, మేము ఎవరినీ బెదిరించడం లేదు, ఎవరిపైనీ దాడి చేసే ఉద్దేశం మాకు లేదు, అన్ని జాతులూ స్వేచ్ఛగా, స్వతంత్రంగా అభివృద్ధి పొందాలన్నదే మా కోరిక. అయితే, తుది హెచ్చరికల భాషనూ, బలం చూపి వ్యవహరించే భాషనూ మనమీద ఎవ్వరూ ప్రయోగించకుండా ఉందురు గాక.

ఎటువంటి అతిక్రమణల నుండి అయినా సరే మన సరిహద్దుల అనుల్లంఘనీయతను కాపాడేందుకూ, సోషలిజంవల్ల సాధించిన లాభాలను రక్షించుకోడానికీ అవసరమయిన

వన్నీ—నిజమైన శాంతి విధానం, సైనిక శక్తి, సోవియట్ ప్రజల ఐక్యత—మన కున్నాయి.

కామ్రేడ్స్, హిట్లరు జర్మనీనీ, సైనికవాద జపానునూ చిత్తుచేసిన తరువాత గడ చిన పాతికేళ్ళు, ఇప్పుడు మనం సమీక్షిస్తూన్న కాలంతో పూర్తి అయాయి. మహత్తర మయిన ఆ విజయం ప్రసాదించిన ఫలితాలు, నేటి అంతర్జాతీయ రంగంలోని వాస్తవిక తలో సజీవంగా ప్రతిఫలిస్తూనే ఉన్నాయి. అంత గొప్ప త్యాగం చేసి సాధించిన ప్రతి ఒక్కదానినీ సోవియట్ ప్రజలు పరమ పవిత్రమయినదిగా పరిగణిస్తున్నారు.

ఇప్పటికి పాతికేళ్ళకు పైగా మన ప్రజలు శాంతిని అనుభవిస్తున్నారు. మన పార్టీ విదేశాంగ విధానం సాధించిన విజయాలన్నిటిలోకీ ఇది గొప్పదని మనం భావిస్తున్నాము. ఇప్పటికి పాతికేళ్లుగా, మానవ జాతికి ప్రపంచ యుద్ధం బారినుండి రక్షణ చేకూరింది. దేశ దేశాల ప్రజలు సాధించిన చరిత్రాత్మక విజయాల్లో ఇది మరొకటి. సోవియట్ దేశమూ, దాని విదేశాంగ విధానమూ దీనికి గణనీయంగా దోహదం కూర్చాయి. కాని, దురాక్రమణ, సైనికవాద శక్తులను వెనక్కు నెట్టి వేయడం అయితే జరిగింది గాని, వాటివల్ల మరి ప్రమాదం లేకుండా చేయడం మాత్రం జరగలేదు. యుద్ధానంతర సంవత్సరాల్లో ఈ శక్తులు తరతమ స్థాయిల్లో యుద్ధాలనూ, సాయుధ సంఘర్షణలనూ 30 కి పైగా ప్రారం భించాయి. మరొక ప్రపంచ యుద్ధ ప్రమాదాన్ని పూర్తిగా లేకుండా చేయడం జరిగిందని కూడా చెప్పజాలము. ఈ ప్రమాదం వాస్తవరూపం ధరించకుండా చేయడం, శాంతికాముక దేశాలూ, అన్ని దేశాల ప్రజలూ నిర్వర్తించవలసిన అతి ముఖ్య కర్తవ్యం.

*శాంతిని ఆచరణ పూర్వకంగా కాపాడే, అంతర్జాతీయ భద్రతను పటిష్ఠం చేసే తన విధానంతో, సోవియట్ యూనియన్, సామ్రాజ్యవాదుల దురాక్రమణ విధానాన్ని ఎదుర్కొంది.* ఈ విధానంలోని ప్రధాన సూత్రాలు అంద రికీ తెలిసినవే. ఇప్పటికి అనేక సంవత్సరాలుగా సోదర దేశాలతోనూ, తదితర శాంతి కాముక దేశాలతోనూ, సహకరిస్తూ, ప్రపంచ మంతటా కోట్లాది ప్రజల హృదయపూర్వక అండదండలతో, మన పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ, శాంతి ఆశయం పట్లా, జాతుల మధ్య మైత్రి ఆశయంపట్లా గట్టి వైఖరిని అవలంబించి, ఇప్పటికి అనేక సంవత్సరాలు ఈ సూత్రాల ననుసరించి పోరాటం సాగిస్తూ ఉన్నాయి. ప్రస్తుత పరిస్థితిలో ఈ పోరాటం నిర్వర్తించవలసిన నిర్దిష్టమయిన మౌలిక కర్తవ్యాలు ఈ దిగువ పేర్కొన్నవని సోవి యట్ కమ్యూనిస్టు పార్టీ భావిస్తూంది.

*మొదటిది—*

ఆగ్నేయాసియాలోనూ, మధ్యప్రాచ్యంలోనూ యుద్ధాలకు ఆలవాలములుగా ఉన్న వాటిని నిర్మూలించడం; దురాక్రమణకు గురిచేసిన దేశాల, ప్రజల న్యాయమైన హక్కు

లను గౌరవించే ప్రాతిపదికపై, ఈ ప్రాంతాల్లో రాజకీయ పరిష్కారానికి దోహదం కూర్చడం.

ఏలాంటి దురాక్రమణ చర్యకయినా సరే, అంతర్జాతీయ వ్యవహారాల్లో ఏలాంటి నిరంకుశ ప్రవర్తనకైనా సరే వెనువెంటనే గట్టి ఎదురుదెబ్బ తీయడం. ఐక్యరాజ్య సమితిలో గల అవకాశాలను కూడా ఇందుకు పూర్తిగా ఉపయోగించుకోవాలి.

అపరిష్కృత సమస్యల పరిష్కారం విషయంలో బలప్రయోగం బెదరింపులనూ, బలప్రయోగాన్నీ పూర్తిగా విసర్జించడం, అంతర్జాతీయ రంగంలో ఒక నియమం కావాలి. తనకు సంబంధించి నంతవరకు సోవియట్ యూనియన్, ఈ వైఖరిని ఆమోదించే దేశాలను, తగు ద్విపక్ష, మండల, ఒప్పందాలను కుదుర్చుకునేందుకు ఆహ్వానిస్తూంది.

*రెండవది—*

రెండవ ప్రపంచ యుద్ధం ఫలితంగా యూరప్‌లో వచ్చిన ప్రాదేశిక మార్పుల తుది గుర్తింపును ప్రాతిపదిక చేసుకొని వ్యవహరించాలి. ఈ ఖండంలోని పరిస్థితులు ఉద్రిక్తత సడలింపు దిశగానూ, శాంతి దిశగానూ సమూలంగా మలుపు తిరిగేలా చేయాలి. అఖిల యూరప్ సమావేశం జరిగేలాగానూ, అది జయప్రదమయేలాగానూ చూడాలి.

యూరప్‌లో ఉమ్మడి భద్రత చేకూరేందుకు సర్వశక్తులా కృషి చేయాలి. ఉత్తర అట్లాంటిక్ కూటమినీ, వార్సాసంధినీ ఏకకాలంలో రద్దు చేయడానికి, లేదా, మొదటి మెట్టుగా, వీటికి చెందిన సైనిక సంస్థలను తొలగించి వేయడానికి తాము సిద్ధమేనని, రక్షణ లక్ష్యాలతో ఏర్పడిన వార్సాసంధి సభ్యదేశాలు సమిష్టిగా ప్రకటించాయి. ఈ సంసిద్ధతను మనం పునరుద్ఘాటిస్తున్నాము.

*మూడవది—*

అణు, రసాయనిక, విషక్రిమి ఆయుధాలను నిషేధిస్తూ ఒప్పందాలు కుదుర్చుకోవాలి.

అణ్వాయుధ పరీక్షలను, భూగర్భ పరీక్షలతో సహా ప్రతి ఒక్కరూ, సర్వత్రా మానుకునేందుకై కృషి చేయాలి.

ప్రపంచంలోని వివిధ ప్రాంతాల్లో అణ్వస్త్రరహిత మండలాల ఏర్పాటుకు దోహదం కూర్చాలి.

అణ్వాయుధాలు గల అన్ని దేశాలూ ఆ ఆయుధాలను విసర్జించాలనీ, ఈ లక్ష్యాలను నెరవేర్చడం కోసం ఐదు అణ్వస్త్ర దేశాలైన సోవియట్ యూనియన్, అమెరికా, చైనా ప్రజారిపబ్లిక్, ఫ్రాన్స్, బ్రిటన్‌ల సమావేశం జరగాలనీ మనం కోరుతున్నాము.

*నాలుగవది—*

అన్ని రకాల ఆయుధాల పోటీని అంతమొందించేందుకై సాగుతున్న పోరా

టాన్ని మరింత శక్తివంతం చేయాలి. నిరాయుధీకరణకు సంబంధించిన సమస్యలను కూలంకషంగా చర్చించేందుకై ప్రపంచ దేశాల సమావేశం జరగాలని మనం అభిలషిస్తున్నాము.

ఆయా దేశాల్లోని విదేశీ సైనిక స్థావరాలను తొలగించి వేయాలని మనం కోరుతున్నాము. పరస్పరాభిముఖంగా సాయుధ బలాల మోహరింపు మరీ ప్రమాదకరంగా ఉన్న ప్రాంతాల్లో, ముఖ్యంగా మధ్యయూరప్‌లో సాయుధ బలాలనూ, ఆయుధాలనూ తగ్గించి వేయాలని మనం కోరుతున్నాము.

ప్రమాదవశాన గాని, బుద్ధిపూర్వకంగా తలపెట్టిగాని, సాయుధ సంఘర్షణలు జరగడానికీ, అవి అంతర్జాతీయ సంక్షోభాలుగా, యుద్ధంగా పరిణమించేందుకూ గల అవకాశాలను తగ్గించేందుకు తగు చర్యలను రూపొందించడం మంచిదని మనం భావిస్తున్నాము.

సైనిక ఖర్చులను తగ్గించుకునేందుకు, అన్నిటికన్నా ముఖ్యంగా అగ్ర రాజ్యాలు వాటిని తగ్గించుకొనేందుకు ఒప్పందాలను గురించి సంప్రతింపులు జరపడానికి సోవియట్ యూనియన్ సిద్ధంగా ఉంది.

*ఐదవది—*

ఇంకా మిగిలి ఉన్న వలస ప్రభుత్వాలను రద్దు చేయడానికి సంబంధించిన ఐ. రా. స. నిర్ణయాలను పూర్తిగా అమలు జరపాలి. మానవ వంశ వివక్ష, జాతివెలి విధానమూ ప్రదర్శితం కావడాన్ని సర్వత్రా ఖండించాలి, బహిష్కరించాలి.

*ఆరవది—*

అందుకు సిద్ధంగా ఉన్న దేశాలతో, అన్ని రంగాల్లోనూ పరస్పరం లాభదాయకమయిన సహకార సంబంధాలను ప్రగాఢం చేసుకొనేందుకు సోవియట్ దేశం సిద్ధంగా ఉంది. మానవుని పరిసరాలను కాపాడడం, విద్యుచ్ఛక్తి వనరులనూ, ఇతర ప్రకృతి సిద్ధ వనరులనూ అభివృద్ధి పరచడం, రవాణా, వార్తా ప్రసార సౌకర్యాలను అభివృద్ధి పరచడం, అతి ప్రమాదకరమైన, విస్తృతంగా వ్యాపించి ఉన్న జాడ్యాలను నివారించడం, నిర్మూలించడం, రోదసినీ, ప్రపంచ మహా సముద్రాన్నీ పరిశోధించడం, వినియోగించుకోవడం—ఈ సమస్యలను పరిష్కరించడంలో, అందుకు సంబంధించిన దేశాలతో కలిసి పాల్గొనేందుకు మన దేశం సిద్ధంగా ఉంది.

శాంతికోసం, అంతర్జాతీయ సహకారం కోసం, జాతుల స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, మన పార్టీ ప్రతిపాదించిన పోరాట కార్యక్రమంలోని ముఖ్యాంశాలివి.

శాంతి, జాతుల మధ్య మైత్రి విధానాన్ని నికరంగా అనుసరిస్తూనే సోవియట్ యూనియన్, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా దీక్షతో పోరాటం సాగిస్తూనే ఉంటుందనీ, దురాక్రమణదారుల దుష్ట పన్నాగాలనూ, విద్రోహ కార్యకలాపాలనూ గట్టిగా తిప్పికొడు

తూనే ఉంటుందనీ మనం గట్టిగా ప్రకటిస్తున్నాము. ప్రజాస్వామ్యం, జాతీయ విముక్తి, సోషలిజంల కోసం ఆయా దేశాల ప్రజలు సాగిస్తున్న పోరాటాన్ని, గతంలో లాగానే ఇకముందూ అచంచలంగా బలపరచి తీరుతాము.

కామ్రేడ్స్, గడచిన ఐదేళ్ళూ, అంతర్జాతీయ విధాన రంగంలో మన పార్టీ యొక్క, ప్రభుత్వం యొక్క కార్యకలాపాలు శక్తివంతంగానూ, ముమ్మరంగానూ సాగిన కాలమని, పైని వివరించిన దానినిబట్టి స్పష్టమవుతుంది.

అంతర్జాతీయ వ్యవహారాల్లో అంతా మన ఒక్కరిమీదనే, లేదా మన మిత్రులపైనే ఆధారపడి లేదన్నది నిస్సందేహం. అన్ని రంగాల్లోనూ, మనం నిర్దేశించుకున్న లక్ష్యాల వైపు, మనం కోరుకున్నంత వేగంగా పురోగమించలేక పోయాము. కొన్ని ముఖ్యమైన పనులు ఇంకా పూర్తి కావలసి ఉంది. వాటి ప్రాధాన్యం ముందు ముందు పూర్తిగా స్పష్టమవుతుంది. అయితే, మొత్తం పరిస్థితిని బేరీజువేసి చూస్తే ఒక విషయం స్పష్టమవుతూంది. ఈ ఐదేళ్ళలోనూ గొప్ప ఫలితాలను సాధించడం జరిగింది. అంతర్జాతీయ రంగంలో మన దేశం స్థానం మరింత బలపడింది, దాని ప్రతిష్ఠ ఇనుమడించింది, సోవియట్ ప్రజల శాంతియుత కృషికి నమ్మకమైన రక్షణ ఉంది.

# II

# ప్రస్తుత దశలో పార్టీ ఆర్థిక విధానం యొక్క ప్రధాన సమస్యలు

కామ్రేడ్స్, పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ దేశ ఆర్థికాభివృద్ధిపై ఏనాడైతే కేంద్రీకరిస్తాయో, అది అత్యంత సుఖప్రదమైన యుగం కాగలదని లెనిన్, యాభై ఏళ్ళ క్రితం *గొయెల్రో* పథకాన్ని విస్తృత చర్చకు పెట్టిన సందర్భంలో చెప్పారు. చరిత్రలో ఆర్థికాభివృద్ధికి సంబంధించిన మొట్టమొదటి ప్రభుత్వ ప్రణాళిక అది. మహా సభలనూ, సమావేశాలనూ, "మన ఆర్థిక విజయాలను సరిచూచే సంస్థలుగా, ఆర్థికాభివృద్ధికి సంబంధించిన పనిని మనం నిజంగా నేర్చుకో వీలైనవిగా" మార్చాలి అని ఆయన కోరారు (*కలెక్టెడ్ వర్క్స్*, సంపుటి 31, పుట 514.)

ఆ మాటకు గల పూర్తి అర్థంలో మన పార్టీ మహాసభలు, నిజంగానే అలాంటి సంస్థలు అయాయి! లెనిన్ దూరదృష్టితో చెప్పినట్లు ఆర్థిక విషయాలకు సంబంధించినదే, పార్టీ యొక్క, సోవియట్ ప్రభుత్వం యొక్క ప్రధాన విధానం. కమ్యూనిజం దిశలో సోవియట్ సమాజ పురోభివృద్ధీ, మన సోషలిస్టు రాజ్యంయొక్క అంతర్జాతీయ స్థానాలు పటిష్టం కావడమూ, ఈ విధానం యొక్క విజయంపైనే నిర్ణయాత్మకంగా ఆధారపడి వున్నవి.

ఈ ముఖ్యమైన దిశలో తన కృషిని గురించి నివేదించే సందర్భంలో ఒక విషయం చెప్పేందుకు పార్టీ కేంద్రకమిటీకి చక్కటి ఆధారాలున్నవి. అదేమంటే, సోవియట్ ప్రజలు 8 వ పంచవర్ష ప్రణాళికను సముచితరీతిని పూర్తి చేశారు; కమ్యూనిజానికి పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించటంలో, దేశంయొక్క శక్తి స్తోమతలను పటిష్టం చేయటంలో, ప్రజల జీవన ప్రమాణాలను పెంచటంలో ఈ విధంగా మరో ప్రధానమైన ముందంజ సాధించటం జరిగింది.

## 1. 8 వ పంచవర్ష ప్రణాళికా కాలంలో సాధించిన ప్రధాన ఫలితాలు; పార్టీ ఆర్థిక విధాన కర్తవ్యాలు

### 1966-1970 కాలంలో జాతీయార్థికాభివృద్ధి

*ఆర్థికరంగంలో* ఈ పంచవర్ష ప్రణాళిక సాధించిన ప్రధాన ఫలితం ఏమంటే, జాతీయార్థిక వ్యవస్థయొక్క స్థాయి గణనీయంగా పెరిగింది; దాని అభివృద్ధి మరింత వేగం పుంజుకొంది; నాణ్యతకు సంబంధించిన సూచికలు మెరుగయాయి.

ప్రధాన ఆర్థిక లక్ష్యాల విషయంలో, 23 వ మహాసభ ఆదేశాలను జయప్రదంగా నెరవేర్చటం జరిగింది. జాతీయాదాయం 38-41 శాతం పెరగవలసింది; నిజానికది

41 శాతం పెరిగింది. పారిశ్రామికోత్పత్తి పెరుగుదల లక్ష్యం 47-50 శాతంకాగా, అది 50 శాతం పెరిగింది. శ్రామిక ప్రజల జీవన ప్రమాణాల పెరుగుదలకు సంబంధించిన కీలక సూచికల విషయంలో మహాసభ ఆదేశాలు నిర్ణయించిన లక్ష్యాలను అధిగమించటం జరిగింది.

మొత్తంపైన, 8 వ ప్రణాళికా కాలంలో, అంతకు ముందు ప్రణాళికా కాలంలో కంటే గణనీయమైన అధిక ఫలితాలు లభించాయి.

## 7 వ, 8 వ పంచవర్ష ప్రణాళికల్లో జాతీయార్థికాభివృద్ధికి సంబంధించిన కీలక సూచికలు

(సాపేక్షధరలు; అభివృద్ధి-వేల మిలియన్ రూబుళ్ళలో; పెరుగుదల శాతం.)

| | 7 వ ప్రణాళికా కాలం (1961-1965) | | 8 వ ప్రణాళికా కాలం (1966-1970) | |
|---|---|---|---|---|
| | సగటు అభివృద్ధి | 1965 లో 1960 కి అభివృద్ధి శాతం | సగటు అభివృద్ధి | 1970 లో 1965 కి అభివృద్ధి శాతం |
| మొత్తం సామాజికోత్పత్తి | 113 | 137 | 175 | 142 |
| వినిమయం కోసం, మూలనిధులను పోగు చేసేందుకోసం ఉపయోగించిన జాతీయాదాయం | 45 | 132 | 77 | 141 |
| పారిశ్రామికోత్పత్తి | 84 | 151 | 125 | 150 |
| దీనిలో, | | | | |
| గ్రూపు (ఎ) | 66 | 158 | 91 | 151 |
| గ్రూపు (బి) | 18 | 136 | 34 | 149 |
| వ్యవసాయోత్పత్తి (గత ప్రణాళికా కాలంతో పోల్చినప్పుడు సాలీనా సగటు ఉత్పత్తి) | 7.1 | 112 | 14.0 | 121 |
| పెట్టుబడులు (5 ఏళ్ళకు) | 77 | 145 | 104 | 142 |
| అన్ని రకాల సాధనాల ద్వారా మొత్తం సరకు రవాణా (వేలమిలియన్‌ల టన్ను-కిలోమీటర్లు) | 878 | 147 | 1,061 | 138 |
| చిల్లర వర్తకం | 26.1 | 134 | 50.2 | 148 |

వినిమయంకోసం, మూల నిధులను పోగు చేసేందుకోసం వుపయోగించిన జాతీయాదాయం సగటున సాలీనా 7.1 శాతం చొప్పున పెరిగింది. క్రితం పంచవర్ష ప్రణాళికా కాలంలో ఈ పెరుగుదల 5.7 శాతం. ఉత్పత్తిరంగ సామర్థ్యానికి ఒక కీలక సూచిక అయిన సామాజిక శ్రమ ఉత్పాదకశక్తి 37 శాతం పెరిగింది. 7 వ పంచవర్ష ప్రణాళికా కాలంలో దీని పెరుగుదల 29 శాతం.

ఆర్థికవ్యవస్థకు మూలాధారమైన భారీ పరిశ్రమలను మరింత అభివృద్ధి పరచటం జరిగింది. సాంకేతిక ప్రగతిని నిర్ధారణచేసే శాఖలు, అంటే విద్యుచ్ఛక్తి, రసాయన, పెట్రో రసాయన పరిశ్రమలు, ఇంజినియరింగు, ముఖ్యంగా రేడియో ఎలక్ట్రానిక్స్, పరికరాల తయారీ శాఖలు మరింత వేగంగా అభివృద్ధి చెందుతూ వచ్చాయి. మొత్తం పారిశ్రామికోత్పత్తిలో, ఈ శాఖల్లో ఉత్పత్తి అయిన సరకుల వాటా 28 శాతం నుంచి 33 శాతానికి పెరిగింది. తేలికరకం పరిశ్రమలు, ఆహార పరిశ్రమా వేగంగా అభివృద్ధి చెందుతూ వచ్చాయి. ఈ ఐదేళ్ళలో వాడకం సరకుల ఉత్పత్తి 49 శాతం పెరిగింది. ఉత్పత్తి యొక్క ప్రస్తుత స్థాయిని తెలియజేసేందుకు, 1970 లోని పారిశ్రామికోత్పత్తి, యుద్ధానికి పూర్వపు అన్ని పంచవర్ష ప్రణాళికల కాలంలోని మొత్తం పారిశ్రామికోత్పత్తికి దాదాపు రెట్టింపు వుందని చెబితే చాలు.

ఈ క్రింది పట్టిక 1966-1970 లో పారిశ్రామికోత్పత్తి పెరుగుదలను తెలియజేస్తుంది.

| | 1965 | 1970 | 1970 లో 1965 శాతం |
|---|---|---|---|
| విద్యుచ్ఛక్తి (వేల మిలియన్‌ల కిలోవాట్ గంటలు) | 507 | 740 | 146 |
| నూనె, ద్రవరూపంలోకి మార్చిన పెట్రోలియం గ్యాసుతో సహా (మిలియన్ టన్నులు) | 243 | 353 | 145 |
| బొగ్గు (మిలియన్ టన్నులు) | 578 | 621 | 108 |
| గ్యాసు (వేల మిలియన్‌ల ఘన మీటర్లు) | 129 | 200 | 154 |
| ఉక్కు (మిలియన్ టన్నులు) | 91 | 116 | 127 |
| రేకులు కడ్డీలు మొదలయినవి (మిలియన్ టన్నులు) | 71 | 92 | 130 |
| ఇంజినియరింగు, లోహకార పరిశ్రమల ఉత్పత్తులు (వీటి విలువ వేల మిలియన్ రూబుళ్ళలో) | 51 | 88 | 174 |

| | 1965 | 1970 | 1970 కి 1965 కు శాతం |
|---|---|---|---|
| రసాయనిక ఎరువులు, సాంప్రదాయిక యూనిట్లలో (మిలియన్ టన్నులు) | 31 | 55 | 177 |
| కృత్రిమ రెసిన్‌లు, ప్లాస్టిక్‌లు (వేల టన్నులు) | 803 | 1,672 | 208 |
| సిమెంటు (మిలియన్ టన్నులు) | 72 | 95 | 132 |
| అన్ని రకాల వస్త్రాలు (వేల మిలియన్ చదరపు మీటర్లలో) | 7.5 | 8.9 | 118 |
| దుస్తులు (వీటివిలువ వేల మిలియన్ రూబుళ్లలో) | 9.0 | 15.9 | 177 |
| తోలు పాదరక్షలు (మిలియన్ జతలు) | 486 | 676 | 139 |
| రేడియోలు, టెలివిజన్ సెట్లు (మిలియన్‌లు) | 8.8 | 14.5 | 164 |
| ఇండ్లలో వాడుకునే రెఫ్రిజరేటర్లు (మిలియన్‌లు) | 1.7 | 4.1 | 247 |

గడచిన ఐదేళ్ళలో వ్యవసాయ అభివృద్ధిలో గణనీయమైన విజయాలు సాధించాం అనేక కారణాలవల్ల ఈ శాఖ మన ఆర్థికవ్యవస్థలో అన్నిటికన్నా కష్టభరిత మయిన, జటిలమయిన రంగంగా వుంటూ వచ్చింది. ప్రస్తుతమూ అలానే వుంది. అందుకనే, ఇందులో పార్టీ కార్యకలాపాలు, గ్రామసీమలోని శ్రామిక ప్రజలు, ఈ రంగానికి సంబంధించిన పరిశ్రమల్లోని కార్మికులూ ఘనవిజయాలను సాధించటం మనకు సంతృప్తిదాయక మవుతున్నది.

క్షేత్రోత్పత్తులు సాలీనా, సగటున 21 శాతం పెరిగాయి. అంతకు ముందు ఐదేళ్ళ కాలంలో ఈ పెరుగుదల 12 శాతం. ధాన్యం ఉత్పత్తిలో గణనీయమైన మార్పులు వచ్చాయి. సంవత్సరానికి సగటున ధాన్యం మొత్తం ఉత్పత్తి 37 మిలియన్ టన్నులు, అంటే 30 శాతం పెరిగింది. మాంసం, పాలు, గుడ్లు మొదలయిన పదార్థాల ఉత్పత్తి చెప్పుకో దగినంతగా పెరిగింది.

ఈ దిగువ పట్టిక ప్రధానమయిన క్షేత్రోత్పత్తుల సాలీనా, సగటు దిగుబడిని స్థూలంగా తెలియజేస్తూ వుంది.

| | మిలియన్ టన్నులు | | |
|---|---|---|---|
| | 1961-1965 | 1966-1970 | 1961-1965 తో 1966-1970 కి పెరుగుదల శాతం |
| ధాన్యం | 130.3 | 167.5 | 129 |
| పత్తి | 5.0 | 6.1 | 129 |
| చక్కెరదుంప (ఫ్యాక్టరీలో శుద్ధిచేసే నిమిత్తం) | 59.2 | 81.0 | 137 |
| పొద్దు తిరుగుడు పూలగింజలు | 5.1 | 6.4 | 126 |
| ఎల్లగిసె నార | 0.41 | 0.46 | 112 |
| బంగాళాదుంప | 81.6 | 94.8 | 116 |
| కూరగాయలు | 16.9 | 19.3 | 114 |
| మాంసం (కళేబరాల బరువు) | 9.3 | 11.6 | 124 |
| పాలు | 64.7 | 80.5 | 124 |
| గుడ్లు (వేల మిలియన్‌లు) | 28.7 | 35.8 | 124 |
| ఉన్ని (వేల టన్నులు) | 362 | 397 | 110 |

1970 లో సాధించిన ఫలితాల గురించి విడిగా చెప్పుకోవలసి వుంటుంది. 186 మిలియన్ టన్నులకుపైగా ధాన్యమూ, 6.9 మిలియన్ టన్నుల పత్తీ దేశంలో లభ్యమయింది. వీటి మొత్తం ఉత్పత్తి యిదివర కెన్నడూ యింత ఉన్నతస్థాయి నందుకొని వుండలేదు. ధాన్యం సగటున హెక్టార్‌కు 15.6 సెంట్నర్లు, పత్తి 25 సెంట్నర్లు పండింది.

మొత్తం సరకు రవాణా విషయంలో ఈ ఐదేళ్ళ కాలానికి నిర్ణయించిన లక్ష్యాన్ని నెరవేర్చాం. పరిశ్రమాదుల నిర్మాణం భారీ ఎత్తున కొనసాగింది. దాదాపు 1900 భారీ ఫ్యాక్టరీలనూ, యంత్రాలనూ పనిలోపెట్టాం. ప్రస్తుత పంచవర్ష ప్రణాళిక తొలి సంవత్సరాల్లో ఫ్యాక్టరీలను మరింతగా అభివృద్ధిచేసేందుకు చక్కటి మూల వనరులను సృష్టించటం జరిగింది.

దేశంయొక్క ఉత్పత్తి శక్తుల స్థల నిర్ణయాన్ని మెరుగుపరచటం జరిగింది. సైబీరియా, దూరప్రాచ్యం, మధ్య ఆసియా, కజక్‌స్తాన్‌ల ఆర్థికశక్తి స్తోమత చెప్పుకోదగినంతగా పెరిగింది. అన్ని రిపబ్లిక్కుల జాతీయార్థిక వ్యవస్థలు ముందంజ వేశాయి. వాటిలో ప్రతి ఒక్కటీ, మొత్తం దేశం ముందున్న కర్తవ్యాల పరిపూర్తికి తమ వంతుగా

కూర్చే దోహదం పెరిగింది. దేశ ఆర్థిక పునాదీ, మన దేశంలోని అన్ని జాతుల సోద రత్వమూ వి_స్తృతం గావించబడ్డాయని దీని అర్థం.

గడచిన ఐదేళ్ళకాలమూ సామాజిక కర్తవ్యాలను పూ_ర్తి చేయటంలో ఒక ముఖ్య దశగా వుంది. సామాజిక సంబంధాల్లో వచ్చిన మార్పుల గురించి ఈ క్రింద చర్చించు తాను. ప్రజల జీవన ప్రమాణాల పెరుగుదలకు సంబంధించిన కొన్ని సమస్యల గురించి ఈ సందర్భంలో నేను చెప్ప గోరుతున్నాను. పార్టీ 23 మహాసభ ఆదేశాల్లో నిర్ణ యించింది 30 శాతం కాగా, ఈ ఐదేళ్ళలో జనాభా తలసరి నిజ ఆదాయాలు 33 శాతం పెరిగాయి. ఆ క్రితం ఐదేళ్ళ కాలంలో ఈ పెరుగుదల 19 శాతం వుంది.

కామ్రేడ్స్, ఈ ఐదేళ్ళలో కార్మికుల, ఆఫీసు పనివారల కనీస వేతనాన్ని, నెలకు 60 రూబుళ్ళకు పెంచటం జరిగిందని మీరెరుగుదురు. దేశంలో కార్మికుల, ఆఫీసు పని వారల సగటు వేతనం 26 శాతం పెరిగింది. సామాజికోత్ప_త్తి ద్వారా సమిష్టి వ్యవ సాయ క్షేత్ర రై_తుల ఆదాయాలు 42 శాతం పెరిగాయి. శ్రమకు గ్యారంటీ అయిన ప్రతిఫలాన్ని ప్రవేశపెట్టారు; పింఛన్ పుచ్చుకునే వయఃపరిమితిని తగ్గించారు. సమిష్టి వ్యవసాయక్షేత్రాల సభ్యులకు జబ్బు పడినప్పుడూ, అశ_క్తత యేర్పడినప్పుడూయిచ్చే అల వెన్సులను ప్రవేశపెట్టారు.

1970 నాటికి, ఈ ఐదేళ్ళ కాలంలో సామాజిక వినియమ నిధులు 50 శాతం, అంటే దాదాపు 64 వేల మిలియన్ రూబుళ్ళకు పెరిగాయి.

చిల్లర వ_ర్తకం పెరుగుదల జీవన ప్రమాణాల స్థాయిని తెలియజేసే ఒక కీలకమైన సూచిక. వినిమయ స్వరూపం గణనీయంగా పెరగడంతో యిది 1966-1970 లో 48 శాతా నికి చేరుకొంది. 1965 నాటి స్థితితో పోల్చిచూ_స్తే, 1970 లో తలసరి మాంసం వాడకం 17 శాతం, పాలు, పాల ఉత్ప_త్తుల వాడకం 22 శాతం, గుడ్ల వాడకం 23 శాతం, చేపలు, వాటికి సంబంధించిన యితర పదార్థాల వాడకం 33 శాతం, చక్కెర వాడకం 14 శాతం పెరి గింది. అదే సమయంలో రొట్టె, బంగాళాదుంపల వాడకం తగ్గింది. ప్రజలకు సాంస్కృతిక సాధనాలు, గృహోపకరణాలు, ముఖ్యంగా రేడియోలు, టెలివిజన్ సెట్లు, బట్టలనుతికే యంత్రాలు, రెఫ్రిజరేటర్లు మొదలయిన స్థిరోపయోగ వ_స్తువుల అమ్మకం పెరిగింది.

మనం నివాసవసతి సమస్యను ఎంత పెద్ద ఎ_త్తున పరిష్కరించ బూనుకున్నామో, దాని గురించి ఎంత పట్టుదలతో కృషి చేస్తున్నామో అందరూ ఎరిగినదే. ఈ పద్దు క్రింద దాదాపు 60 వేల మిలియన్ రూబుళ్ళు కర్చుపెట్టాం. గడచిన ఐదేళ్ళలో 500 మిలియన్ల చదరపు మీటర్లకుపై_గా వై_శాల్యం గల నివాసవసతి ఏర్పాటుచేయటం జరిగింది. అంటే ఒక్కొక్కటి ఒక మిలియన్ జనాభాగల యాభై కి పై_గా పెద్ద పట్టణాలతో సమాన వై_శాల్యం గల నివాసవసతిని దేశంలో నిర్మించామన్నమాట. నూతన గృహ ప్రవేశాలు జరుపుకున్న కుటుంబాల్లో ఎక్కువ భాగం ఆధునిక వసతులు గల విడి విడి వాటాల్లోకి వెళ్ళాయి.

పౌర విద్య, ఆరోగ్య వ్యవస్థలు చక్కటి అభివృద్ధి సాధించాయి. సోవియట్ ప్రజల ఆరోగ్యమూ, దీర్ఘాయువునూ గురించి పార్టీ, ప్రభుత్వమూ నిరంతర శ్రద్ధ వహిస్తున్నవి. 1966-1970 లో మనం 151,000 మంది డాక్టర్లను, అంటే ఆ క్రితం ఐదు సంవత్సరాలలో కంటే అదనంగా 22,000 మందిని తరిఫీదు చేశాం. శాఖోప శాఖలుగా వున్న వైద్యసంస్థలు గణనీయంగా విస్తరించాయి.

సోవియట్ కార్మికుల్లోనూ, ఆఫీసు పనివారిలోనూ ఎక్కువమంది కొన్ని సంవత్సరాలుగా వారానికి ఐదు రోజుల చొప్పున పని చేస్తున్నారు; వారంలో రెండు రోజులు సెలవు పొందుతున్నారు. కార్మికుల్లోని అత్యధిక భాగానికి, సంవత్సరంలో జీతంతో యిచ్చే శెలవుల కాలాన్ని పొడిగించటం జరిగింది.

గడచిన ఐదేళ్ళకాలంలో ప్రజల జీవన ప్రమాణం గణనీయంగా పెరిగిన విషయం మీరు చూస్తూ వున్నారు. ఈ విజయాలు సోవియట్ ప్రజలకు నూతనోత్తేజాన్ని ప్రసాదించగలవనీ, దేశ సంక్షేమం కోసం, మన వీర ప్రజల మేలుకోసం మరింత ఫలప్రదంగా కృషిచేయాలనే అభిలాషను వారిలో రేకెత్తించ గలవనీ ఆశించేందుకు అనుమతి నివ్వండి!

గడచిన ఐదేళ్ళ కాలంలో లభించిన ఫలితాలను సమీక్షించుకొనేటప్పుడు, సాధించిన విజయాలకు తగిన విలువ నిస్తున్నప్పటికీ గూడా, ఆర్థిక రంగంలోని లోపాల గురించీ, అపరిష్కృత సమస్యల గురించీ పార్టీకి తెలుసు. ప్రధానమైన ఆర్థిక సూచికలకు సంబంధించిన, 23 వ మహాసభ ఆదేశాలను పూర్తి చేయటంలో కొన్ని ముఖ్య వస్తువుల ఉత్పత్తి లక్ష్యాలు సంపూర్ణంగా నెరవేరలేదనే విషయాన్ని అన్నిటికంటే ముందు చెప్పుకోవలసి వుంది.

రసాయన పరిశ్రమ, యంత్ర పరికరాల పరిశ్రమ, తేలికరకం పరిశ్రమలు మొదలయిన వాటి ఉత్పత్తిశక్తిని విస్తరింప జేయటంలో కొన్ని జాప్యాలు గూడ జరిగాయి. అనేక మంత్రిత్వశాఖలు కర్మాగారాల ఆధునికీకరణకు సంబంధించిన పథకాలను పూర్తి చేయలేదు; శ్రామిక ఉత్పాదకశక్తికి సంబంధించిన లక్ష్యాలను సాధించటంలో వెనుకబడ్డాయి. వ్యవసాయ రంగానికి విద్యుచ్ఛక్తినీ, యంత్రాలనూ అందజేసేందుకు సంబంధించిన పథకాలు సంపూర్ణంగా నెరవేర్చబడలేదు.

సగటు వేతనాలను పెంచేందుకు సంబంధించిన లక్ష్యాలను మించిపోవడం జరిగినప్పటికీ, ప్రణాళికలో నిర్దేశించిన విధంగా కొన్ని తరగతుల రేట్లనూ, మూలవేతనాలనూ పెంచటం జరగలేదు. కొన్ని ఆహార పదార్థాల అదనపు ఉత్పత్తి (ముఖ్యంగా మాంసము, కొన్నిరకాల వాడకం సరకుల ఉత్పత్తి) గణనీయంగానే వున్నప్పటికీ, అది ఈనాటికీ అవసరాలకు సరిపడినంతగా లేదు. దీనివల్ల కొన్ని సందర్భాల్లో దుకాణాల్లో సరకుల కొరత ఏర్పడుతూ వున్నది.

బాహ్య, ఆంతరంగిక స్వభావం కలిగిన కొన్ని భౌతిక కారణాలు కొంతవరకు

ఈ చిక్కులకు మూలం. అయితే, సహజంగానే, ఆర్థిక, ప్రభుత్వ, పార్టీ సంస్థల కృషి లోని లొసుగులకూ, ప్రణాళికా రచనలో, కొత్త యంత్రాలను ఉత్పత్తిచేసి వాటిని వినియోగించు కోవటంలో, లభ్యమయిన శక్తి స్తోమతులను వుపయోగంలోకి తేవటంలో జరిగిన లోపాలకూ సంబంధించిన కారణాలపై మనం ఈ మహాసభలో దృష్టిని కేంద్రీక రించవలసి వుంటుంది.

అయినప్పటికీ, ఈ లోపాలూ, అపరిష్కృత సమస్యలూ, ప్రధానాంశాన్ని, అంటే పంచవర్ష ప్రణాళిక యొక్క మౌలిక సత్ఫలితాలను మరుగు పరచజాలవు. పార్టీ, ప్రజలూ ఒకగొప్ప, జటిల కర్తవ్యాన్ని చక్కగానే సాధించారు. నిరంతర ఆర్థికాభి వృద్ధినీ, దేశ రక్షణ పాటవాన్ని పరిపుష్టం చేయటాన్నీ, శ్రామిక ప్రజల జీవన ప్రమా ణాల్లో గణనీయమైన గొప్ప పెరుగుదల సాధించటమనే విషయంతో జోడించటమన్నది ఈ కర్తవ్యం.

ఆర్థికాభివృద్ధిలో సోవియట్ ప్రజల విజయాలకు గొప్ప రాజకీయ ప్రాముఖ్యం వుంది. మన దేశంలో సోషలిస్టు వ్యవస్థ మరింతగా పటిష్ట మయేందుకూ, యావన్మంది సోవియట్ ప్రజలూ పార్టీ వెనుక మరింత సన్నిహితంగా సంఘటిత పడేందుకూ ఈ విజయాలు తోవతీశాయి. సోషలిస్టు రాజ్యాల ఆర్థికశక్తిని పెంచటమూ, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా సాగే ఆర్థిక పోటీలో ప్రపంచ సోషలిస్టు వ్యవస్థయొక్క స్థానాలను శక్తివంతం చేయటమూ అన్న ఉమ్మడి ఆశయానికి యివి గొప్ప దోహదం చేశాయి.

కామ్రేడ్స్, 23 వ మహాసభ దేశ ఆర్థికాభివృద్ధి యొక్క ప్రధాన ధోరణిని నిర్వ చించినప్పుడు 8 వ పంచవర్ష ప్రణాళిక కోసం ప్రధాన సూచికలను ఆమోదించటం మాత్రమే గాక, దీర్ఘ కాలిక ఆర్థికవిధానానికి సంబంధించిన కొన్ని ముఖ్యమైన సమస్యలను కూడా లేవనెత్తింది. కేంద్రకమిటీ వీటిని పరిష్కరించే సందర్భంలో, మహాసభ ఆదే శాలను అనుసరిస్తూ, వ్యవసాయ, పారిశ్రామిక రంగాల మేనేజిమెంటులో, గడచిన దశలో జరిగిన లోపాలను సరిదిద్దేందుకు చర్యలు తీసుకొంది.

ఆర్థిక మేనేజిమెంటును మెరుగు పరచేందుకు గత ఐదేళ్ళలో చాలా కృషి జరిగిందని మహాసభకు నివేదించగల స్థితి వుంది. కేంద్రకమిటీ విస్తృత సమా వేశాలూ, కేంద్రకమిటీ, సోవియట్ యూనియన్ మంత్రిమండలీ చేసిన నిర్ణయాలూ ప్రధాన ఆర్థిక సమస్యలను పరిష్కరించాయి. 1966 మే, 1970 జులై, 1969 డిసెంబర్‌లో జరిగిన విస్తృత సమావేశాల ప్రాముఖ్యాన్ని ప్రత్యేకించి పేర్కొనవలసి వుంది. 1966 మే, 1970 జులై సమావేశాల్లో వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన ఒక సమగ్రమైన, దీర్ఘ కాలిక కార్యక్రమాన్ని రూపొందించారు. 1969 డిసెంబర్ విస్తృత సమావేశం ఉత్పత్తి ఫలదాయకతను పెంచే, మేనేజిమెంటును మెరుగుపరచే మార్గాల వంటి, మన ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి సంబంధించిన మౌలిక సమస్యలను చర్చించింది.

ఈ కృషి అంతటి ఫలితాలనూ బేరీజు వేసినప్పుడు, మన మిప్పుడు సమీక్షించుతున్న కాలంలో, తన ఆర్థిక విధానానికి సంబంధించిన అతి పెద్దవయిన, అత్యంత జటిలమైన అనేక సమస్యల అధ్యయనంలోనూ, వాటికి స్పష్టమైన భావ రూపాన్ని కల్పించటంలోనూ మన పార్టీ ప్రస్ఫుటమైన ప్రగతి సాధించిందని చెప్పవచ్చు.

స్థానిక పార్టీ సంస్థల, కమిటీల సృజనాత్మక కృషి పెరిగిన విషయాన్ని పేర్కొనటం అవసరమని కేంద్రకమిటీ భావిస్తున్నది. అనేక రిపబ్లిక్కుల, ప్రాంతాల, మండలాల పార్టీ సంస్థలు ఆర్థిక విషయాలకు సంబంధించి, దేశ వ్యాపిత ప్రాముఖ్యం గల సూచనలను కేంద్రకమిటీకి అందజేశాయి. జాతీయార్థిక వ్యవస్థ గురించిన నిర్ణయాలు రూపొందించేటప్పుడు ఈ సూచనలను పరిశీలించటమూ, వాటిని లెక్కలోకి తీసుకోవటమూ జరిగింది

పార్టీ, ప్రభుత్వం, ఆర్థిక సంస్థలు, ట్రేడ్ యూనియన్‌ల కార్యకర్తలూ, శ్రామిక ప్రజా బాహుళ్యమూ ఆర్థిక విషయాలను మరింత లోతుగా తరచి చూడ నారంభించారు; మన సమస్యలనూ, వాటి పరిష్కార మార్గాలనూ యిదివరకంటే చక్కగా అర్థం చేసుకుంటున్నారు. ఇప్పుడు సమీక్షించుతున్న దశలో పార్టీ కృషిద్వారా లభించిన ముఖ్యమైన ఫలితాల్లో యిది ఒకటి.

పారిశ్రామిక, వ్యావసాయిక, రవాణా, నిర్మాణ, శాస్త్ర, సాంస్కృతిక రంగాలలో జరిగిన నిస్వార్థ కృషి, మన బహుళజాతి దేశంలోని సమస్త జాతుల కృషి ఫలితమే దేశ ఆర్థిక విజయాలు. తమ శ్రమద్వారా ఘన విజయాలు సాధించిన కార్మికవర్గాన్ని, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులను, మేధావులను, సోవియట్ యూనియన్ లోని సమస్త శ్రామిక ప్రజలను మహాసభ పక్షాన అభినందించేందుకు అనుమతించ గోరుతున్నాను;

## దేశ ఆర్థికాభివృద్ధి ప్రస్తుత దశలోని ప్రత్యేకతలు; కొత్త పంచవర్ష ప్రణాళిక ముందున్న కర్తవ్యాలు

కామ్రేడ్స్, ఆయా దశల్లోని కర్తవ్యాల యొక్క ప్రత్యేకతలను, పార్టీ పని చేస్తున్న పరిస్థితుల యొక్క ప్రత్యేకతలను లెక్కలోకి తీసుకోవటంలోనే, రాజకీయాల్లోని ఇబ్బందీ, కళా యిమిడివున్నాయని వి. ఐ. లెనిన్ నొక్కి చెప్పారు. దేశాభివృద్ధిక్రమంలోని ప్రతి ఒక్క దశకు సంబంధించిన ప్రధాన లక్షణాలను దృష్టిలో పెట్టుకోవలసిన ఆర్థిక విధానాన్ని రూపొందించటంలో కూడా ఈ వైఖరికి అపార ప్రాముఖ్యం వుంది.

మూడవ దశకం ద్వితీయార్ధం నాటికే మన దేశంలో సోషలిజం విజయం సాధించిందని గుర్తు పెట్టుకోవాలి. దీని తరువాత సోవియట్ ప్రజలు మూడు దశాబ్దాలకు పైగా వీరోచితశ్రమా, పోరాటమూ కొనసాగించారు. మన ఆనాటి ఆర్థిక వ్యవస్థా, నేటి మన ఆర్థికవ్యవస్థా కూడా ఒకేరకం ఉత్పత్తి సంబంధాలపై, ఒకేరకం ఆర్థిక నియ

మాలపై, అంటే సోషలిస్టు నియమాలపై ఆధారపడి వున్నవి. అయినప్పటికీ మూడవ దశకం చివరి రోజుల నాటి ఆర్థిక వ్యవస్థకూ, ఆధునిక ఆర్థిక వ్యవస్థకూ మధ్యగల వ్యత్యాసాన్ని తెలిపే స్పష్టమైన కొత్త, ముఖ్య లక్షణాలున్నాయి.

జాతీయార్థిక వ్యవస్థలో, సోషలిస్టు సామాజిక సంబంధాల్లో, ప్రజా బాహుళ్యం యొక్క సంస్కృతీ, చైతన్యాల్లో అపారంగా ఉన్నతమయిన స్థాయి సాధించబడింది. పురోగామి సోషలిస్టు సమాజం, మనదేశం యొక్క భవిష్యత్తు అని, లెనిన్ 1918 లో ప్రస్తావించారు. సోవియట్ ప్రజలు తమ నిస్వార్థశ్రమ ద్వారా దాన్ని నిర్మించారు. పార్టీ కార్యక్రమమూ, ఇటీవలి పార్టీ మహాసభలూ నిర్ణయించిన బృహత్ కర్తవ్యాన్ని —కమ్యూనిజానికి పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించటం—ఆచరణలో పరిష్కరించేందుకు దీనివల్ల మనకు వీలు చిక్కింది.

రానున్న దశ విషయంలో, పార్టీ ఆర్థికవిధానం యొక్క మౌలిక అంశాలను మహాసభలో చర్చించేటప్పుడు, మన ఆర్థికాభివృద్ధి యొక్క ప్రస్తుత దశలోని కొన్ని ప్రత్యేక లక్షణాల గురించి మనం శ్రద్ధ వహించాలి.

వీటిలో అన్నిటికంటే ముఖ్యమైనది ఆర్థికవ్యవస్థ యొక్క అపూర్వ నూతన పరిమాణం. బహుముఖమైన పారిశ్రామిక రంగం, భారీ సోషలిస్టు వ్యవసాయ రంగం, పురోగామి విజ్ఞానశాస్త్రం, ఉన్నత నైపుణ్యం గల కార్మికుల, ప్రవీణుల, మేనేజర్లతో కూడిన సిబ్బంది, రోజుకు దాదాపుగా రెండువేల మిలియన్ రూబుళ్ళ విలువయిన సామాజికోత్పత్తిని, అంటే, మూడవ దశకం చివరి రోజులకంటే పది రెట్లు అధికంగా సామాజికోత్పత్తిని సమకూర్చే ఆర్థికవ్యవస్థ—వీటిని ఆధారం చేసుకొని బ్రహ్మాండమయిన ఆర్థిక శక్తిని నిర్మించటం జరిగింది.

పార్టీ తన ఆర్థిక కార్యకలాపాలలో దేశ ఆర్థికశక్తి అపార పెరుగుదలను దృష్టిలో పెట్టుకొంటుంది. నిర్దిష్ట రూపంలో దీని అర్థం ఏమిటి? ప్రప్రధానంగా మనకు గల అవకాశాలు గణనీయంగా పెరిగా యన్నమాట. లోగడ దశల్లో ఊహా మాత్రమైన కర్తవ్యాలను మన మీనాడు స్వీకరిస్తున్నాం, ఆచరణలో సాధిస్తున్నాం.

అదే సమయంలో, సమాజం నేటి పరిస్థితుల్లో ఆర్థిక వ్యవస్థపై మోపే బాధ్యతలు ఆర్థికావసరాలతో పాటు వేగంగా పెరుగుతున్నవి. సోషలిస్టు నిర్మాణం తొలి దశల్లో, మనం, ప్రప్రధానమైన విషయాలపై, తరుణ సోవియట్ రాజ్యం అసలు మనుగడకే ఆధారభూతమైన వాటిపై కేంద్రీకరించవలసి వచ్చింది. ఇప్పుడు పరిస్థితి మారుతూ వుంది. మనమిప్పుడు ఏకకాలంలో విస్తృత సమస్యల సముదాయాన్ని పరిష్కరించాలని కోరుకోవటం మాత్రమే కాదు (ఆ కోర్కె మనకు ఎప్పుడూ వుంది) వాటిని పరిష్కరించగలం; పరిష్కరించి తీరాలి కూడా.

నిరంతర ఆర్థికాభివృద్ధికోసం వనరులను సేకరించేటప్పుడు, ఉత్పత్తి రంగానికి

కొత్త సాంకేతిక సామగ్రిని తిరిగి సమకూర్చేటప్పుడు, శాస్త్ర, విద్యా రంగాలపై బ్రహ్మాండమయిన మొత్తాలను వెచ్చించేటప్పుడు, సోవియట్ ప్రజల సంక్షేమాన్ని మెరుగు పరచేందుకు సంబంధించిన కర్తవ్యాల సాధనపై అదే సమయంలో అధికాధిక శక్తినీ, సాధనాలనూ కేంద్రీకరింప జేయాలి. ఏదో ఒక రంగంలో ముందుకు దూసుకు పోతున్నప్పుడు —ఆ రంగం ఎంత ముఖ్యమైన దైనాసరే—మరే యితర రంగాల్లో కూడా దీర్ఘకాలం వెనుకబడి వుండటానికి యిక నెంతమాత్రం వీల్లేదు.

మనదేశం ఆర్థికాభివృద్ధిలో సాధించిన ఉన్నతస్థాయి మరో ముఖ్యమైన ప్రభావాన్ని కూడా కలిగించింది. అదేమంటే, ప్రణాళికా రచన, నియంత్రణ, ఆర్థిక మేనేజిమెంటులకు సంబంధించిన పద్ధతులు నెరవేర్చవలసిన కర్తవ్యాలు గణనీయంగా పెరుగుతున్నాయి. ఆర్థికమైన లింకులన్నీ పరస్పరం ఆధారపడి వుండే స్థితి ఎంతో ఎక్కువైంది. దీర్ఘకాలిక ప్రణాళికా రచన, అంతర్ పరిశ్రమ సంబంధాల వ్యవస్థను ఏర్పరచటం, పాదార్థిక సరఫరాలను మెరుగు పరచటం—వీటి ప్రాముఖ్యాన్ని అది యినుమడింప జేసింది.

శాస్త్ర, సాంకేతిక విప్లవ సత్వర పురోగమనం కూడా, దేశ ఆర్థికాభివృద్ధి యొక్క ప్రస్తుత దశలోని ముఖ్యమైన, నిర్దిష్ట లక్షణాలకు మూలం. సోషలిజం, అంటే ప్రణాళికా బద్ధమైన సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ, శాస్త్ర, సాంకేతిక రంగాల సర్వతోముఖ ప్రగతికి అత్యంత విస్తారావకాశాలను ప్రసాదిస్తుంది. అయితే, శాస్త్ర, సాంకేతిక విప్లవానికి, మన ఆర్థిక కార్యకలాపాలకు సంబంధించిన అనేక అంశాలు మెరుగు కావటం అవసరం. వేరే మాటల్లో చెప్పాలంటే అది సోషలిజానికి అనుకూలమైన ఒక బ్రహ్మాండమైన శక్తి. అయితే అది తగు విధంగా అదుపులోకి తెచ్చుకోవలసిన శక్తి.

బాహ్య పరిస్థితుల్లోని కొన్ని తీవ్రమైన మార్పులు గూడా, నేటి చారిత్రక దశ యొక్క ప్రత్యేక లక్షణాలు కొన్నింటిని తీర్చి దిద్దుతున్నవి. మనం యిదివరకే చెప్పుకొన్నట్లు, వీటిలోకెల్లా ముఖ్యమైంది సోషలిస్టు దేశాల ఆర్థిక విలీనీకరణ పురోగమన క్రమం. మన ఆర్థిక కర్తవ్యాలు చాలావాటి విషయంలో ఈ క్రమాన్ని మనం లెక్కలోకి తీసుకోవాలి. రెండు ప్రపంచ వ్యవస్థలమధ్య సాగుతున్న ఆర్థిక, సాంకేతిక - శాస్త్ర పోటీ, సోషలిజానికీ, పెట్టుబడిదారీ విధానానికీ మధ్య జరిగే వర్గ పోరాటంలోని ఒక భాగం. ఈనా డిది యిదివరకటికంటే చాలా గొప్ప పాత్ర వహిస్తూ వుంది. ఈ పాత్రను కూడా మనం లెక్కలోకి తీసుకోవాలి.

దేశ ఆర్థికాభివృద్ధి యొక్క ప్రస్తుత దశలోని ముఖ్య లక్షణాల్లో యివి కొన్ని. రాజకీయ కర్తవ్యాల క్రిందకు మార్చినట్లయితే వీటిని క్లుప్తంగా ఈ క్రింది విధంగా వర్ణించవచ్చు: జాతీయార్థిక వ్యవస్థ యొక్క విస్తారస్థాయీ, ఆర్థిక అవకాశాలూ, సామాజిక అవసరాలూ యిదివరకటి కంటే అధికంగా వుండటం కారణంగా, మన యావత్తు ఆర్థికరంగ కృషి ప్రమాణాన్నీ ఎంతగానో మెరుగు పరచడం, మన ఆర్థికవ్యవస్థ

ఫలదాయకతను గణనీయంగా పెంచటం, విస్తారమైన మన ఆర్థికవ్యవస్థ నంతటినీ, మరింత చక్కగా పనిచేసే యంత్రాంగంగా మార్చటం తక్షణావసరం అవుతూ వుంది.

మన విప్లవ సంకల్పం, విశాల దృష్టి, లక్షలాది ప్రజల శక్తి సామర్థ్యాలను సమీకరించటంలో పార్టీకిగల చాకచక్యం, నిర్మాణాత్మక కర్తవ్యాలను పూర్తి చేసేందుకై కార్మిక వర్గం, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతాంగం, మేధావుల యొక్క శ్రామిక ఉత్సాహం— ఇవి మనకు అన్ని విషయాల్లోనూ, అన్ని సమయాల్లోనూ సహాయపడుతున్నవి. ఈ మహత్తర శక్తిని క్రమబద్ధమైన, శ్రమ శీలమైన, నిర్మాణ కృషితో, ఆర్థిక విషయాల ఎడ నికరమైన శాస్త్రీయ దృష్టితో, కఠినమైన స్వీయ క్రమశిక్షణతో, సర్వతో ముఖమయిన సమర్థతతో మరింత సన్నిహితంగా జోడించటం యిప్పుడు, యిదివర కేనాడూ లేనంతగా అవసరం.

కామ్రేడ్స్, నూతన పంచవర్ష ప్రణాళికకు సంబంధించిన ఆదేశాల అంతటి ముఖ్యమైన రాజకీయ పత్రాన్ని రూపొందించటంలో కేంద్రకమిటీ పై పరిస్థితు లన్నిటినీ లెక్కలోకి తీసుకొన్నది.

సోవియట్ సమాజం కమ్యూనిజానికి మరింతగా పురోగమించటంలో, దాని పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించటంలో, దేశం యొక్క ఆర్థిక, రక్షణ శక్తి స్తోమతులను పెంచటంలో, 9 వ పంచవర్ష ప్రణాళిక తప్పనిసరిగా ఒక ముఖ్య ఘట్టం అవుతుంది. సోషలిస్టు ఉత్పత్తి పెరుగుదలలో అధిక వేగాలు, దాని ఫల *దాయకత పెరుగుదల, శాస్త్ర, సాంకేతిక ప్రగతి, శ్రామిక ఉత్పాదకశక్తి ముమ్మరంగా పెరగటం—వీటిని ఆధారం చేసుకొని ప్రజల జీవన ప్రమాణాన్నీ, సాంస్కృతిక స్థాయినీ గణనీయంగా పెంచటం ఈ పంచవర్ష ప్రణాళిక ముందున్న ప్రధాన కర్తవ్యం.*

వచ్చే అయిదేళ్ళలో జాతీయాదాయాన్ని 37-40 శాతం పెంచవలసి వుంది. వినిమయనిధి 40 శాతం, మూల నిధుల సమీకరణ 37 శాతం పెరుగుతుంది. పారిశ్రామికోత్పత్తి 42-46 శాతమూ, సాలీనా సగటు వ్యావసాయికోత్పత్తి 20-22 శాతమూ పెరుగుతాయి. తలసరి నిజ ఆదాయాలు దాదాపు మూడోవంతు పెరుగుతాయి.

1971-75 సోవియట్ యూనియన్ ఆర్థికాభివృద్ధి పంచవర్ష ప్రణాళిక గురించిన ఆదేశాలపై కామ్రేడ్ ఎ. ఎన్. కొసిగిన్ నివేదిక సమర్పించనున్నారు గనుక, రానున్న దశలో పార్టీ ఆర్థిక విధానానికి సంబంధించిన మూడు మౌలిక సమస్యల గురించి మాత్రమే వివరించేందుకు నన్ను అనుమతించ వలసిందిగా కోరుతున్నాను.

మొదటిది, సోవియట్ ఆర్థికవ్యవస్థ అభివృద్ధిని పార్టీ ఏ ప్రధాన లక్ష్యాలపై ఆధారపరచ జూస్తున్నదో, వాటికి సంబంధించిన సమస్య.

తదుపరి, పెరుగుదలకు సంబంధించిన వనరుల సమస్య. సామాజిక ఉత్పత్తి మరింత సత్వరంగా పెరిగేందుకు సమీకరించ వలసిన వనరులివి.

చివరిది, జయప్రదమయిన ఆర్థిక పెరుగుదలను సాధించేందుకు ఆర్థిక మేనేజిమెంటు యొక్క యంత్రాంగాన్ని మెరుగుపరచే సమస్య.

## 2. జీవన ప్రమాణాభివృద్ధి పార్టీ ఆర్థిక విధానం యొక్క పరమలక్ష్యం

9 వ పంచవర్ష ప్రణాళికలో జీవన ప్రమాణాల్ని గణనీయంగా పెంచటమనే ప్రధాన కర్తవ్యాన్ని నిర్ణయించిన కేంద్రకమిటీ, ఇది వచ్చే ఐదేళ్ళ కాలంలోని మన కార్యకలాపాలను మాత్రమే గాక, దీర్ఘ కాలం పాటు దేశ ఆర్థికాభివృద్ధి యొక్క సాధారణ మొగ్గును కూడా నిర్ణయించగలదని ఎంచుతూ వుంది. ఈ పంథాను నిర్ణయించటంలో పార్టీ, సోషలిస్టు వ్యవస్థలో ప్రజల భౌతిక, సాంస్కృతిక అవసరాలను సాధ్యమయినంత సంపూర్ణంగా సమకూర్చడ మనేది సామాజిక ఉత్పత్తి యొక్క పరమ లక్ష్యం అనే అభిప్రాయంతో ప్రధానంగా వ్యవహరిస్తూ వుంది.

సోవియట్ అధికారం ఏర్పాటయిన తొలిరోజుల నుంచే మన పార్టీ, ప్రభుత్వమూ యిందుకోసం తమకు సాధ్యమైనదంతా చేస్తూ వచ్చాయి. కాని, అందరికీ తెలిసిన చారిత్రక కారణాలవల్ల, చాలాకాలం పాటు మనకు గల అవకాశాలు పరిమితంగానే వుండేవి. ఇప్పుడా అవకాశాలు చెప్పుకోదగ్గంత అధికంగా వున్నవి. ఇందువల్ల ఆర్థికాభివృద్ధిని, ప్రజల జీవితాన్ని మెరుగు పరచటం కోసం, యిదివరకంటే మరింత సంపూర్ణంగా కేంద్రీకరించటమనే సమస్యను లేవనెత్తేందుకు పార్టీకి వీలు కలుగుతూ వుంది.

మరింతఉన్నతమైన జీవన ప్రమాణం ఆర్థికాభివృద్ధికి అధికాధికంగా అత్యావశ్యకం అవుతూ వుందన్న వాస్తవ దృష్టితో కూడా పార్టీ వ్యవహరిస్తూ వుంది. జీవన ప్రమాణం పెరుగుదల, ఉత్పత్తి సత్వరంగా అభివృద్ధి చెందేందుకు ముఖ్యమైన ఆర్థిక ఆవశ్యకతల్లో ఒకటి.

శ్రమకు భౌతిక, నైతిక ప్రోత్సాహకాల పాత్రను మరింత పెంచటమనే మన విధానాన్ని అనుసరించి ఏర్పడింది మాత్రమే కాదు ఈ వైఖరి. సోవియట్ ప్రజల యొక్క, సమస్త శ్రామిక ప్రజల యొక్క సామర్థ్యమూ, సృజనాత్మక కృషి సర్వతోముఖంగా అభివృద్ధి చెందేందుకు అనుకూలమైన పరిస్థితులను సృష్టించటం, అంటే సమాజం యొక్క ప్రధాన ఉత్పాదక శక్తిని అభివృద్ధి పరచడమన్న విశాలమైన సమస్య ఇది.

యంత్రాలు, సాంకేతిక శాస్త్రమూ పైననే గాకుండా, కార్మికుల పైన గూడా, ప్రధానంగా వారిపైనే, అంటే ఈ యంత్రాలను సృష్టించే, ఈ సాంకేతిక రీతులను నియంత్రించే వారిపైనే ఆధునిక ఉత్పత్తి రంగం అధికాధిక బాధ్యతలను మోపుతూ

వుంది. కార్మికుల్లోని అధికాధిక భాగానికి, వారు జయప్రదంగా పని చేసేందుకు ప్రత్యేక పరిజ్ఞానమూ, ఉన్నతమైన వృత్తి శిక్షణా, మానవుని సాధారణ సాంస్కృతిక స్థాయీ తప్పనిసరి అవసర మవుతున్నవి. ఇవన్నీ చాలావరకు జీవన ప్రమాణం పైనా, భౌతిక, ఆత్మిక అవసరాలను ఎంత మేరకు పూర్తిగా తీర్చవచ్చుననే దానిపైనా ఆధార పడు-తున్నవి.

ఈ విధంగా మన లక్ష్యాలూ, అధికతర ఆర్థిక శక్తిస్తోమతలూ, ఆర్థికాభివృద్ధి యొక్క అవసరాలూ, ప్రజల జీవన ప్రమాణాలను మెరుగు పరచేందుకు సంబంధించిన అత్యంత వైవిధ్యం గల కర్తవ్యాలను మరింత సమగ్రంగా నెరవేర్చే దిశలో ఆర్థిక వ్యవస్థను నడపటం సాధ్యమూ, అవసరమూ గావిస్తున్నవి. 8 వ పంచవర్ష ప్రణాళిక ఈ విషయంలో ఆచరణ పూర్వక ఫలితాలను గణనీయంగా సమకూర్చింది. ఈ విజయాలను పటిష్టం చేసుకోవటం మాత్రమే గాక, కొత్తగా గణనీయమైన ముందంజ వేయటం గూడా ఇక మనపై ఆధారపడింది.

శ్రామిక ప్రజల జీవన ప్రమాణాన్ని మెరుగు పరచటం ప్రధాన కర్తవ్యమని నిర్వచించే టప్పుడు, న్ని అతి తేలికగా తీసుకునే వైఖరికి మనం ఏ మాత్రం తావీయరాదు. ప్రజల జీవన ప్రమాణాన్ని గణనీయంగా పెంచే పంథాను ఆచరణలో పెట్టేందుకు చాలా కాలం పడుతుంది; అందుకు తీవ్ర కృషీ, అపారమైన సాధన సంపత్తీ, అవసర మవుతాయి. మనం ఉత్పత్తి చేసిన దానిని మాత్రమే పంపిణీ చేయగలం, వినియోగించుకో గలం. దీనికి వేరే రుజువులు అవసరం లేదు. మన ప్రణాళికలు, జీవన ప్రమాణం మెరుగు కావడాన్ని, అధికతర సామాజికోత్పత్తితోనూ, మరింత ఉన్నతమైన శ్రామిక ఉత్పాదక శక్తితోనూ సన్నిహితంగా ముడిపెడుతూ వున్నవి; దీని ద్వారానే బలాన్నీ, వాస్తవిక దృష్టినీ సమకూర్చు కుంటున్నవి. కాని, యిదికూడ పార్టీ పైనా, మొత్తంగా సోవియట్ ప్రజల పైనా వున్న బాధ్యతను నిరూపిస్తున్నది. ఈనాడు మనం ఎలా జీవిస్తున్నాం, రేపు ఎలా జీవిస్తాం అన్నది మనపైనే, మన శ్రమ శక్తి విజయాలపైనే ఆధారపడి వుంది.

ప్రజల సంక్షేమం విషయంలో పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ యూనియన్ మంత్రిమండలి మహాసభకు సమర్పించుతున్న ప్రతిపాదనల గురించీ, పథకాల గురించీ నివేదించేందుకు అనుమతించ గోరుతున్నాను.

శ్రామిక ప్రజల *నగదు ఆదాయాలను* మరింతగా పెంచతలపెట్టారు. ప్రజల నిజ ఆదాయాల పెరుగుదలలో నాలుగింట మూడువంతుల భాగం, శ్రమకు చెల్లించే అధికతర ప్రతిఫలం ద్వారా సమకూరుతుంది.

ఈ ఐదేళ్ళకాలంలో కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల నెలసరి కనీస వేతనాన్ని 70 రూబుళ్ళకు పెంచటం జరుగుతుంది. పరిశ్రమలు, రవాణా, తదితర పాదార్థిక ఉత్పత్తి రంగాల్లోని మధ్యస్త తరగతుల వారి మూలవేతనాలనూ, జీతాలనూ పెంచాలి. వ్యవసాయ

యంత్ర నిర్వాహకుల వేతనాల రేట్లు పెంచాలి. ఉపాధ్యాయులకు, వైద్యులకు, యితర వైద్య సిబ్బందికీ, యింకా అనేక యితర వృత్తులవారికీ మరింత ఎక్కువ జీతాల నివ్వ తలపెట్టారు. ఉరల్స్, ఉత్తరాది యూరపియన్ ప్రాంతం, పశ్చిమ సైబీరియా, కజక్ స్తాన్ (ఈ రిపబ్లిక్‌లోని దక్షిణ భాగం మినహా)లోనూ, దూరప్రాచ్యం, తూర్పు సైబీరియా, మధ్య ఆసియాలలోని కొన్ని కొన్ని జిల్లాల్లోనూ, అనేక శాఖల్లో అదనపు వేతనాలను ప్రవేశపెట్టడం, లేదా వాటిని పెంచటం జరుగనున్నది. రాత్రి షిఫ్టులో చేసే పనికి యిచ్చే అలవెన్సులు గణనీయంగా పెరుగనున్నవి.

ప్రాంతాలూ, ఆర్థిక శాఖలూ, ఈ చర్యలను క్రమేణా అమలుజరుపుతాయి. మొత్తం పైన, దాదాపు 90 మిలియన్‌ల మంది కార్మికులకూ, ఆఫీసు ఉద్యోగులకూ ఈ చర్యల వల్ల లాభం చేకూరుతుంది. ఫలితంగా కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల నెలసరి, సగటు వేతనాలు 146-149 రూబుళ్ళకు, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల శ్రమకు చెల్లించే ప్రతిఫలం 98 రూబుళ్ళకు పెరుగుతాయి.

శ్రామిక ప్రజల్లోని కొన్ని తరగతులకు పన్నుల రాయితీలను విస్తరింప జేయాలని కూడా తలపెట్టారు.

కామ్రేడ్స్, శ్రామిక ప్రజల నగదు ఆదాయాల పెరుగుదలకు సంబంధించిన మరో సమస్యను గూడా ప్రస్తావించ గోరుతున్నాను.

దేశ పారిశ్రామికీకరణ జరిగిన సంవత్సరాల్లోనూ, యుద్ధానంతర పునర్నిర్మాణ కాలంలోనూ, మన యావత్తు శక్తినీ, వనరులనూ కూడగట్టుకోవట మన్నదే, మన ఆర్థిక వ్యవస్థను ముందుకు తీసుకు వెళ్లేందుకూ, అభివృద్ధి చేసేందుకూ వుండిన ఏకైక మార్గం. మన దేశ ప్రజలు ఈ విషయం చక్కగా గ్రహించారు. ఉమ్మడి ఆశయానికి వారు తమ నిస్వార్థ శ్రమను మాత్రమేగాక, తాము మిగుల్చుకున్న డబ్బును కూడ ధారపోశారు; ప్రభుత్వ రుణ పత్రాలను చురుకుగా కొన్నారు. ఇదంతా, ఆర్థికాభివృద్ధిని వేగిర పరచటంలో ముఖ్య పాత్ర వహించింది. రుణ పత్రాలను విస్తృతంగా కొనటం ప్రభుత్వ బడ్జెట్‌కు స్పష్టమయిన తోడ్పాటు మాత్రమేగాక, సోవియట్ ప్రజల దేశభక్తికీ, సోషలిస్టు ఆశయంపట్ల వారి దీక్షకూ చక్కని వ్యక్తీకరణ కూడా.

కొత్త ప్రభుత్వ రుణపత్రాలు విడుదల చేయటం 1958 నుంచే నిలిపివేయ గలిగామని గుర్తుంచుకోవాలి. అయినప్పటికీ, ప్రజలవద్ద యింకా డబ్బు చెల్లించవలసినవి, దాదాపు 25,800 మిలియన్ రూబుళ్ల విలువగల రుణపత్రా లున్నవి. ఈ డబ్బు చెల్లింపుకు 20 ఏళ్ల వాయిదాపెట్టి, 1977 నుంచి 1996 వరకు, సరిసమానమయిన సంవత్సర వాయిదాలు ఏర్పాటు చేశారు.

మన ప్రస్తుత వనరులను పరిశీలించిన మీదట, కేంద్రకమిటీ పొలిట్ బ్యూరో, సోవియట్ మంత్రిమండలీ, నిర్ణీత గడువుకంటే ముందుగానే ఈ రుణ పత్రాలకు

డబ్బు చెల్లించవచ్చునని అభిప్రాయ పడుతున్నవి; ఈ పత్రాల క్రింద 1974-1975 లో రెండువేల మిలియన్ రూబుళ్ళ మొత్తం చెల్లించవచ్చునీ, ఆ తదుపరి సంవత్సరాలలో చెల్లించే మొత్తాలను పెంచవచ్చునీ భావిస్తున్నవి. ప్రజలవద్ద వున్న మొత్తం రుణ పత్రాలను 1990 నాటికి, అంటే నిర్ణయించిన వ్యవధికి 6 సంవత్సరాలు ముందుగానే విడుదల చేయించాలని తలపెడుతున్నారు. ఈ నిర్ణయం సరైనదీ, పార్టీ విధానానికీ ప్రజల, ప్రయోజనాలకూ పూర్తిగా అనుగుణమైనదీ నని భావిస్తున్నాం.

శ్రమకు చెల్లించే ప్రతిఫలం ద్వారా ఆదాయాలను పెంచటమే గాక, సామాజిక వినిమయ నిధులను కూడా గణనీయంగా పెంచవలసి వుంది. 1975 నాటికి ఈ నిధులు 90 వేల మిలియన్ రూబుళ్ళు అయేలా, వాటిని 40 శాతం పెంచ తలపెట్టారు. వైద్య సౌకర్యాలను మెరుగు పరచేందుకు, విద్యాభివృద్ధికి, నవతరాన్ని తీర్చిదిద్దేందుకు ఈ మొత్తాలను వినియోగించటం జరుగుతుంది.

సామాజిక నిధులను ముఖ్యమైన మరికొన్ని యితర సామాజిక చర్యలకోసం డబ్బు సమకూర్చేందుకు కూడా వుపయోగించటం జరుగుతుంది. పెద్ద కుటుంబాల, సహాయం అవసరమైన కుటుంబాల, ఉత్పత్తి రంగంలో పని చేస్తున్న మహిళల, పింఛన్‌దారుల, విద్యార్థుల జీవన పరిస్థితులను మెరుగుపరచటం, పై చర్యల్లో ఒకటి. ప్రణాళికలో ఈ క్రింది పనులు తలపెట్టారు:

—కుటుంబ సభ్యుల తలసరి ఆదాయం 50 రూబుళ్ళకు మించి లేనప్పుడు, ఆ కుటుంబాల్లోని బిడ్డలకు నగదు అలవెన్సులు ప్రవేశపెట్టటం;

—జబ్బుతోవున్న బిడ్డల సేవకోసం, జీతంమీద యిచ్చే సెలవు రోజుల సంఖ్యను పెంచటం, శ్రామిక మహిళ లందరికీ, వారు ఎంత కాలంగా ఉద్యోగం చేస్తున్నారనే విషయంతో నిమిత్తం లేకుండా గర్భిణులుగా వున్నప్పు డిచ్చే శెలవులకూ, ప్రసూతి శెలవులకూ నూటికి నూరు వంతుల జీతం యిచ్చే పద్ధతిని ప్రవేశపెట్టడం;

—కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల వృద్ధాప్యపు పింఛన్ల కనీస మొత్తాన్ని పెంచటం;

—సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల కనీస పింఛన్లను పెంచటమూ, కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల పింఛన్ మొత్తాన్ని లెక్కించేందుకు ఏర్పాటయిన పద్ధతిని వీరికి గూడా వర్తింప జేయటం;

—కార్మికుల, ఆఫీసు ఉద్యోగుల, సైనికుల విషయంలో, అశక్తు లయిపోయిన వారికీ, కుటుంబ పోషకుణ్ణి కోల్పోయిన కుటుంబాలకూ సంబంధించిన పింఛన్ ఏర్పాట్లను మెరుగు పరచటం;

—విద్యార్థి వేతనాలను పెంచటం; ఉన్నత విద్యా సంస్థల్లోనూ, ప్రత్యేక సెకండరీ విద్యా సంస్థల్లోనూ, విద్యార్థి వేతనాలను పొందే అర్హతలను విస్తరింప జేయటం;

—ఆసుపత్రుల్లోనూ, పట్టణాల్లోని వృత్తి. సాంకేతిక పాఠశాలల్లోనూ భోజనాల కోసం యిచ్చే అలవెన్సును పెంచటం.

జీవన ప్రమాణాల్ని పెంచే లక్ష్యంతో, జీతాలు, వేతనాలు, అధిక అలవెన్సులకు సంబంధించిన కొత్త చర్యలను అమలు జరిపేందుకోసం ప్రస్తుత పంచవర్ష ప్రణాళికా కాలంలో 22 వేల మిలియన్ రూబుళ్లు కేటాయించారు. 8 వ పంచవర్ష ప్రణాళికలో ఈ మొత్తం 10 వేల మిలియన్ రూబుళ్ళు.

గృహ నిర్మాణం మరింత పెద్ద ఎత్తున కొనసాగుతుంది. వచ్చే ఐదేళ్ళలో 565-575 మిలియన్ చదరపు మీటర్ల గృహవసతి నేర్పాటుచేయ తలపెడుతున్నాం. దీని వల్ల దాదాపు 60 మిలియన్‌ల మంది ప్రజల నివాస పరిస్థితులు మెరుగవుతాయి. పౌర సదుపాయాల కోసమూ, పట్టణాలను, పల్లెలను మెరుగు పరచేందు కోసమూ నిధులను గణనీయంగా కేటాయిస్తున్నారు.

ఈ సందర్భంలో నేను మాస్కో గురించి ప్రత్యేకంగా ప్రస్తావించ గోరుతున్నాను. దేశ రాజధానిగా, మన దేశంలోని అతి పెద్ద పారిశ్రామిక, సాంస్కృతిక, విజ్ఞాన శాస్త్ర కేంద్రంగా, మహత్తరమయిన మన సోషలిస్టు రాజ్యానికి చిహ్నంగా, అది సోవియట్ ప్రజలు అందరికీ ప్రీతి పాత్రమైంది. మాస్కోలో గృహ వసతులను అభివృద్ధి పరచటానికీ, పట్టణాభివృద్ధికీ, రవాణా సదుపాయాలను మెరుగు పరచేందుకూ, పెద్ద ఎత్తున కృషి యిదివరకు వలెనే కొనసాగుతుంది. మాస్కోను ఆదర్శ కమ్యూనిస్టు నగరంగా తయారు చేయటం యావన్మంది సోవియట్ ప్రజల విధ్యుక్త ధర్మం.

దేశంలోని యితర నగరాలను మెరుగు పరచేందుకు కూడా మన శ్రద్ధను రెట్టింపు చేయాలి. సోషలిస్టు వ్యవస్థలోని లాభాలు, పట్టణాలు అభివృద్ధి చెందే సహజక్రమాన్ని, పట్టణ ప్రజలకు అధికాధికంగా ఆరోగ్యవంతమయిన, అధిక సౌఖ్యవంతమైన జీవిత పరిస్థితులు సమకూరేలా నిర్వహించ వీలు కలిగిస్తున్నవి.

సోవియట్ ప్రజల ఆదాయాలను గణనీయంగా పెంచేందుకు, గృహ నిర్మాణాల్ని విస్తరింప జేసేందుకు, పట్టణాలనూ, పల్లెలనూ అభివృద్ధి పరచేందుకు సంబంధించిన చర్యలను రూపొందించే సందర్భంలో, ఆహార పదార్థాలు, పారిశ్రామిక సరకులు, సేవా సౌకర్యాల విషయమై, ఆర్థిక స్తోమతతో ప్రజలు అధికాధికంగా కోరుతూన్న వాటిని సంతృప్తి పరచటమనే కర్తవ్యానికి యిప్పుడు గూడా ప్రత్యేక ప్రాముఖ్యం వుందని కేంద్రకమిటీ గట్టిగా అభిప్రాయ పడుతూ వుంది. వాడకం సరకుల ఉత్పత్తి, సోవియట్ ప్రజల నగదు ఆదాయాలకంటే అధిక వేగంతో పెరగాలి.

ఈ సరకులను తయారుచేసే అన్ని ఆర్థిక విభాగాల అభివృద్ధినీ పెంచడంద్వారా ఈ సమస్య పరిష్కార మవుతుంది. పారిశ్రామిక రంగానికి సంబంధించిన ప్రధాన

నిష్పత్తుల పరస్పర సంబంధాన్ని గురించిన ముఖ్య సమస్యను పార్టీ ఈ దృష్టితోనే చూస్తూ వుంది.

పోగుపడిన ఉత్పాదకశక్తి స్తోమతలవల్ల, కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో (బి) గ్రూపుకు చెందిన పరిశ్రమల పెరుగుదల వేగాలు మరికొంత పెరిగేందుకు వీలవుతుందని కేంద్రకమిటీ అభిప్రాయ పడుతూంది. దీనివల్ల జీవన ప్రమాణాల విషయంలో నిర్దేశించిన పెరుగుదల సాధ్యమవుతుంది. ఉత్పత్తి సాధనాల ఉత్పత్తిలో సత్వరాభివృద్ధి సాధించడంపై ఆధారపడిన మన సాధారణ విధానాన్ని యిది రద్దు పరచడం లేదు. ఇది సహేతుకమే. ఈ రెండు ఉప విభాగాలలోని పెరుగుదల వేగాల పరస్పర సంబంధాన్ని నిర్ధారణ చేయటంలో పార్టీ, సరిగ్గా లెనిన్ బోధించినట్లే, ఆయా దశల్లోని నిర్దిష్ట అవసరాలనూ, వున్న వనరులనూ బట్టి వ్యవహరిస్తూ వుంది.

## దేశం యొక్క ఆర్థిక శక్తికీ, ప్రజల జీవన ప్రమాణాల యితోధికాభివృద్ధికీ పునాది భారీ పరిశ్రమ

జాతీయ - ఆర్థిక నిష్పత్తుల విషయంలో పైన చెప్పిన మార్పును బట్టి, భారీ పరిశ్రమల పట్ల' మన శ్రద్ధను సడలిస్తున్నామని అర్థం కాదు.

సోషలిస్టు పరిశ్రమాభివృద్ధికి, ముఖ్యంగా దానికి ప్రాతిపదిక అయిన భారీ పరిశ్రమాభివృద్ధికి ప్రాధాన్యం యిచ్చే పార్టీ విధానం, మన దేశాన్ని ఒక శక్తివంత మయిన రాజ్యంగా మార్చింది. ఈ విధానాన్ని స్థిరంగా అమలు పరచినందువల్లనే సోషలిస్టు విప్లవ విజయాలను కాపాడుకో గలిగామనీ, శతాబ్దాల వెనుకబాటుతనాన్ని తుద ముట్టించ గలిగామనీ, బ్రహ్మాండమయిన ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక ప్రగతిని సాధించ గలిగామనీ చెప్పడం అతిశయోక్తి కాజాలదు.

నేటి పరిస్థితుల్లో, భారీ పారిశ్రామిక రంగ అభివృద్ధిలోని అధిక వేగాలు తమ ప్రాముఖ్యాన్ని పూర్తిగా నిలబెట్టు కుంటున్నవి.

విస్తృతమయిన సోషలిస్టు పునరుత్పత్తి, భవిష్యత్ ఆర్థికాభివృద్ధి అవకాశాలూ, వేగాలూ, కమ్యూనిజం యొక్క పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మాణమూ, యివి అన్నీ కూడా చాలావరకు, భారీ పరిశ్రమల రంగం జయప్రదంగా అభివృద్ధి చెందటం పైనే ఆధారపడి వుండటం, వాటి ప్రాధాన్యత నిలిచివుండటానికి కారణం. ఆర్థిక వ్యవస్థ యొక్క అన్ని రంగాలకూ సాంకేతిక సాధనాలను సమకూర్చటమూ, మరింత ఉన్నతమైన శ్రామిక ఉత్పాదకశక్తి కోసం పాదార్థిక, సాంకేతిక వనరులను అందించటమూ, భారీ పారిశ్రామిక రంగం కృషిపైనే ఆధారపడి వుంది.

భారీ పరిశ్రమలను అభివృద్ధి పరచుకోకుండా, దేశ భద్రతకూ, మన ప్రజల శాంతియుత శ్రమకూ హామీ కల్పించగల స్థాయిలో మన రక్షణ పాటవాన్ని నిలబెట్టుకొనజాలం.

ఇది కూడా భారీ పారిశ్రామిక రంగంలోని అధిక అభివృద్ధి వేగాల ప్రాముఖ్యం నిలిచి వుండటానికి కారణం. గడచిన ఐదేళ్ళలో ఈ విషయంలో చాలా కృషి చేశాం: సోవియట్ సైన్యానికీనాడు అధునాతనమైన, సున్నితమైన అన్ని రకాల ఆయుధాలూ వున్నవి. రక్షణ పరిశ్రమ యితోధికాభివృద్ధీ, దాని నిర్దిష్ట కార్యక్రమమూ, చాలావరకు అంతర్జాతీయ పరిస్థితిపై ఆధారపడి వుంటాయి. శాంతిని పటిష్ఠం చేసేటటువంటి, మన భద్రతకు హాని కలిగించ నటువంటి, వాస్తవిక దృష్టితో కూడిన నిరాయుధీకరణ చర్యలను బలపరచేందుకు సోవియట్ యూనియన్ సిద్ధంగా వుంది. అదే సమయంలో, ఘటనా పరంపరలో సంభవించగల ఎలాంటి మార్పులకైనే సరే మనం సిద్ధంగా వుండాలి.

చివరి విషయం. భారీ పరిశ్రమకు ప్రత్యేక ప్రాముఖ్యం వుంది. ఎందుకంటే, యితర విషయాలతోబాటు, జీవన ప్రమాణాలను మెరుగుపరచే మౌలిక కర్తవ్యాలను అది లేనిదే పరిష్కరించ లేము. వ్యవసాయం, తేలిక రకం పరిశ్రమల, ఆహార పరిశ్రమల సత్వరాభివృద్ధి కోసమూ, భవన నిర్మాణము, వర్తకమూ, సాముదాయిక సేవలూ మరింత పెద్దగా విస్తరించేందుకూ, భారీ పరిశ్రమల రంగం ఉత్పత్తి సాధనాల ఉత్పత్తిని గణనీయంగా పెంచవలసి వుంది.

భారీ పరిశ్రమ యొక్క అంతిమ ప్రయోజనం సరిగ్గా యిదే. వి. ఐ. లెనిన్ చెప్పిన ఈ క్రింది మాటలను ఈ సందర్భంలో గుర్తు చేయ గోరుతున్నాను: "చివర కంటా చూచినట్లయితే, ఉత్పత్తి సాధనాల తయారీ తప్పనిసరిగా వాడకం వస్తువుల ఉత్పత్తితో ముడిపడి వుంది. ఉత్పత్తి సాధనాలను తయారుచేయటం వాటిని ఉత్పత్తిచేయటం కోసమే కాదు; వాడకం వస్తువులను తయారుచేసే పారిశ్రామిక శాఖలకు ఉత్పత్తి సాధనాలు అధికాధికంగా అవసరమవుతున్నందు వల్లనే వాటిని తయారు చేయటం జరుగుతూ వుంది" (*కలెక్టెడ్ వర్క్స్*, సంపుటి 4, పుట 163).

పార్టీ, భారీ పరిశ్రమలకు మరో ముఖ్య కర్తవ్యాన్ని కూడా నిర్దేశిస్తున్నది. అదేమంటే అవి నేరుగా తమ ఫ్యాక్టరీలలోనే వాడకం సరకుల తయారీని విస్తరింపజేయాలి. భారీ పరిశ్రమ శాఖలన్నిటికీ యిందుకు అవసరమైన సదుపాయాలు గణనీయంగా వున్నవి. ఈ సందర్భంలోనే రక్షణ పరిశ్రమను కూడా నేను పేర్కొన గోరుతున్నాను. ఈనాడీ పరిశ్రమ ఉత్పత్తిలో యించుమించు 42 శాతం పౌర అవసరాలకు ఉపయోగపడుతూ వుంది. ఉన్నతమైన దాని శాస్త్ర, సాంకేతిక స్థాయి ఫలితంగా, దాని పరిజ్ఞానమూ, కనిపెట్టిన కొత్త విషయాలూ, ప్రక్రియలూ ఆర్థిక వ్యవస్థ యొక్క అన్ని రంగాలకూ కీలక ప్రాముఖ్యం కలిగి వున్నవి.

పర్యవసానం ఏమంటే, భారీ పరిశ్రమయొక్క పాత్ర తగ్గిపోలేదు సరికదా ప్రస్తుత దశలో అది మరింత ప్రాముఖ్యాన్ని సంతరించుకుంటూనే వుంది. అది పరిష్కరించే తక్షణ, ఆచరణపూర్వక సమస్యల సముదాయం పెరుగుతూ వుండటం యిందుకు

కారణం. వచ్చే అయిదేళ్ళలో దాని ముఖ్య శాఖలు చాలా కఠినమైన బాధ్యతలను నిర్వహించవలసి వుంది. ఆ బాధ్యతలు యివీ: విద్యుచ్ఛక్తి ఉత్పత్తిని 1,000,000 మిలియన్ కిలోవాట్ గంటలకు పైగా, నూనె ఉత్పత్తిని 480-500 మిలియన్ టన్నులకు, గ్యాసు ఉత్పత్తిని 300-320 వేల మిలియన్ ఘనమీటర్లకు, ఉక్కు ఉత్పత్తిని 142-150 మిలియన్ టన్నులకు పెంచవలసి వుంది. ఇంజినియరింగు, లోహకార పరిశ్రమ, రసాయన, పెట్రోరసాయన పరిశ్రమల ఉత్పత్తులు 70 శాతం పెరగవలసి వుంది.

భారీ పారిశ్రామిక రంగంలోని కార్మికులు ముఖ్యమూ, ఉదాత్తమూ నైన ఈ కర్తవ్యాలను గౌరవప్రదంగా నెరనేర్చగలరని పార్టీకి గట్టి నమ్మకం వుంది.

## వ్యవసాయ రంగ ఇతోధికాభివృద్ధి కార్యక్రమం

కామ్రేడ్స్, మొత్తం ఆర్థికవ్యవస్థ పెరుగుదల వేగాలూ, సోవియట్ ప్రజల జీవన ప్రమాణం పెరుగుదల వేగాలూ, అనేక విషయాల్లో వ్యవసాయ రంగం జయప్రదంగా అభివృద్ధి చెందటంపై ఆధారపడి వున్నవి. ఆ కారణంచేతనే, యిప్పుడు మనం సమీక్షించుతున్న కాలంలో దానిగురించి అంత ఎక్కువ శ్రద్ధ వహించటం జరిగింది. వ్యవసాయానికి సంబంధించిన సమస్యల గురించి కొంతకాలంగా విస్తారమైన చర్చ జరిగినందు వల్లనూ, గడచిన దశల్లో కూడా దీనినిగురించి యుక్తమైన అనేక నిర్ణయాలు చేయటం జరిగినందు వల్లనూ, గత కొద్ది సంవత్సరాల్లోనూ స్పష్టీకరించిన ఈ సమస్యలపట్ల తీసుకోవలసిన వైఖరి యొక్క మౌలిక లక్షణాలు కొన్నిటి గురించి ప్రతినిధులకు తెలియజేయటం ముఖ్యమని కేంద్రకమిటీ భావిస్తూ వుంది.

వీటిల్లో ఒకటి ఏమంటే, 1955 మార్చిలో జరిగిన కేంద్రకమిటీ విస్తృత సమావేశం నిర్ణయించినటువంటి, 23 వ మహాసభ నిర్ణయాల్లో సంఘటిత రూపం యివ్వబడినటువంటి పంథాకు దృఢంగా అంటిపెట్టుకొంటూ, కేంద్రకమిటీ, వ్యవసాయోత్పత్తి పెరుగుదలకు ప్రోద్బల మిచ్చే సుస్థిర ఆర్థిక పరిస్థితులను సృష్టించడానికి ప్రత్యేక ప్రాముఖ్య మిచ్చింది. నిర్దిష్ట రూపంలో సమీష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలకు దీని అర్థం యిదీ: రానున్న కొన్ని సంవత్సరాల మేరకు స్థిరమైన సేకరణ పథకాలు వుండటం, ప్రణాళిక లక్ష్యాలకు పైబడి సరఫరా చేసే సరకులకు, ఉత్పత్తి పెరుగుదలకు ప్రోత్సాహ న్నివ్వగల ధరలను ప్రవేశపెట్టటం మొదలయిన చర్యలు.

మరో లక్షణం యిదీ: వ్యావసాయిక - సాంకేతిక, నిర్మాణ స్వభావం గల చెదురు మదురు చర్యలు సరిపోవని మనం భావిస్తున్నందువల్ల, వ్యవసాయాభివృద్ధిని నిర్ణయించే మొత్తం అంశాల సముదాయాన్ని లెక్కలోకి తీసుకొనేందుకు ప్రయత్నించాం. ఈ అంశాల్లో కొన్ని యివీ: గ్రామసీమకు అవసరమైన యంత్రాలను, ఎరువులను సరఫరా చేయటం, పరిశ్రమాదుల నిర్మాణాన్ని విస్తరింపజేయటం, భూమిని మెరుగు చేయటం,

సిబ్బందికి శిక్షణ యివ్వటం, ఉత్పత్తి వ్యవస్థను మెరుగు పరచటం. దీనివల్ల వ్యవసాయ రంగ అవసరాల గురించి నిర్దిష్టమైన వివేచనా, ఆ అవసరాలను తీర్చేందుకు సాధనాలను కనుగొనటమూ అవసరమైంది.

ఈ వైఖరిని ఆధారంగా చేసుకుని కేంద్రకమిటీ 1970 జూలై విస్తృత సమావేశంలో విశాలమైన, సమగ్రమైన ఒక వ్యవసాయాభివృద్ధి కార్యక్రమాన్ని రూపొందించింది. ఈ కార్యక్రమం దీర్ఘకాలికమైనదీ, వాస్తవదృష్టితో కూడినదీను. కామ్రేడ్స్, వ్యవసాయ సమస్యలు ఒకటి, లేదా రెండు సంవత్సరాల్లో, లేదా ఐదేళ్లలో సైతం పూర్తిగా పరిష్కరించటం సాధ్యపడేవి కావు. దానికి అంతకంటే చాలా ఎక్కువ కాలమూ, బ్రహ్మాండమైన నిధుల కేటాయింపులూ, వ్యవసాయ కార్మికులు మాత్రమే గాక, మన పారిశ్రామిక రంగం యావత్తూ బ్రహ్మాండమైన కృషి చేయటమూ అవసరం.

ప్రస్తుత పంచవర్ష ప్రణాళికా లక్ష్యాలను ఈ విస్తృత సమావేశ నిర్ణయాలపై ఆధారపడి రూపొందించటం జరిగింది. ఈ లక్ష్యాలను పూర్తి చేయడంవల్ల క్షేత్రోత్పత్తులు పెరుగుతాయి. తద్వారా, వచ్చే సంవత్సరాలలో మనం ప్రజలకు క్షేత్రోత్పత్తుల, పరిశ్రమలకు ముడి పదార్థాల సరఫరాను ఒక పద్ధతి ప్రకారం విస్తరింప జేయగలుగుతాం, మెరుగు పరచగలుగుతాం. ప్రస్తుత కర్తవ్యాలను పరిష్కరించటంతో బాటు, అదే సమయంలో మనం నూతన పంచవర్ష ప్రణాళికా కాలంలో, వ్యవసాయ రంగం యొక్క పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదికను నిర్మించే విషయంలో ఒక పెద్ద ముందంజ వేయాలి. వ్యవసాయోత్పత్తికీ, గ్రామసీమలో పరివర్తన సాధించేందుకూ సంబంధించిన సమస్యలను పూర్తిగా పరిష్కరించేందుకూ, వ్యవసాయం ప్రకృతి శక్తులపై ఆధారపడి వుండే స్థితిని తగ్గించటానికీ యిది భవిష్యత్తులో మనకు సాయపడుతుంది.

వ్యవసాయరంగంలో పెట్టుబడుల పరిమాణాన్ని నిర్ణయించే విషయంలో కేంద్ర కమిటీ ఈ మార్గదర్శక సూత్రాలనే అనుసరించింది. సుమారు 129 వేల మిలియన్ రూబుళ్ళు, అంటే లోగడ రెండు పంచవర్ష ప్రణాళికల్లోనూ కలిపి పెట్టిన పెట్టుబడికి సమానమైన మొత్తాన్ని ప్రభుత్వమూ, సమిష్టి వ్యవసాయక్షేత్రాలూ వ్యవసాయానికి పెట్టుబడి పెడతాయి.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో నిర్వర్తించవలసి వున్న కర్తవ్యాల స్వభావం, వ్యావసాయిక సంస్థల, గ్రామీణ పార్టీ సంస్థల, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల బాధ్యత పెరుగుదలను నిర్ణయిస్తూ వుంది. సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల కార్మికులూ ధాన్యం సగటు వార్షిక ఉత్పత్తిని కనీసం 195 మిలియన్ టన్నులకు పెంచవలసి వుంది; నిర్ణీత ప్రణాళిక క్రిందా, ప్రణాళిక లక్ష్యాలకు మించి అదనపు ధరలకూ ప్రభుత్వానికి ధాన్యం అమ్మకాన్ని 80-85 మిలియన్ టన్నులకు పెంచవలసి వుంది. రానున్న ఐదేళ్ళలో మాంసం సగటు వార్షిక ఉత్పత్తిని 14 మిలియన్

టన్నులకు పైగానూ, పాల ఉత్పత్తిని 92 మిలియన్ టన్నులకూ, గుడ్ల ఉత్పత్తిని 46 వేల మిలియన్‌లకూ పెంచవలసి వుంది. ఇతర క్షేత్రోత్పత్తుల విషయంలోనూ గణనీయమైన పెరుగుదల సాధించ తలపెట్టాం.

ఈ నిర్ణయాలను అమలు పరచేందుకు, కేంద్రకమిటీ యొక్క జూలై విస్తృత సమావేశ నిర్ణయాలను అనుసరించి, పెద్ద మొత్తాల్లో డబ్బునూ, గణనీయమైన పాదార్థిక వనరులనూ కేటాయించటం జరుగుతూ వుంది. వ్యవసాయక్షేత్రాలకు గడచిన ఐదేళ్ళలో కంటే మరెన్నో ఎక్కువ ట్రాక్టర్లు, నూర్పిడి యంత్రాలు, లారీలు, యితర వ్యావసాయిక యంత్రాలూ, రసాయనిక ఎరువులు, వివిధ రకాల యితర రసాయనాలు, పశు, పక్షి పోషణ విభాగాలకు సంబంధించిన యంత్రాలు, విద్యుచ్ఛక్తి, భవన నిర్మాణ సామగ్రులూ అందుతాయి. వీటికి సంబంధించిన కచ్చితమైన అంకెలను ప్రతినిధులు ముసాయిదా ఆదేశాలను బట్టి తెలుసుకోవచ్చు.

వ్యవసాయోత్పత్తికీ, దాన్ని మరింత ఫలదాయకంగా చేసేందుకూ, యిదంతా నిజమయిన, చాలా పెద్ద దోహదం. అదేసమయంలో మనము ఒక విషయాన్ని ప్రత్యేకించి నొక్కి చెప్ప గోరుతున్నాం. అదేమంటే లభ్యమవుతున్న శక్తి స్తోమతలనూ, వ్యవసాయ రంగానికి యిప్పటికే వున్న దానంతటినీ సంపూర్ణంగా వినియోగించుకోవటం అవసరం. దురదృష్టవశాత్తూ, ఈ విషయంలో యిప్పటికీ చాలా లోటుపాట్లు వున్నవి.

కామ్రేడ్స్, ధాన్యం ఉత్పత్తిని పెంచటమన్నది ఇదివరకువలెనే, యిప్పటికీ కూడా వ్యావసాయిక రంగ ప్రధాన కర్తవ్యాల్లో ఒకటిగా వుంది. ధాన్యం విషయంలో మన అవసరాలు ఏడాది కేడాదికీ పెరుగుతున్నవి. ఈ విషయం ఆహార ధాన్యాలకు మాత్రమే గాక, పశువుల మేతగా వుపయోగించే ధాన్యానికీ వర్తిస్తూ వుంది. వేగంగా అభివృద్ధి చెందుతూ వున్న పశుపోషణ రంగ అవసరాల దష్ట్యా పశువుల మేతకోసం వుపయోగించే ధాన్యోత్పత్తిని విస్తరింపజేయాలి.

ప్రధాన ధాన్యప్పంట ప్రాంతాలైన ఉక్రైన్, కజక్‌స్తాన్, మధ్య ప్రాంతాల్లోని నల్లరేగడి మండలాలు, ఉత్తర కాకసస్, ఓల్గా ప్రాంతం, ఉరల్స్, సైబీరియా స్టెప్పీలలోనూ, నల్లరేగడికాని యితర భాగాల్లోనూ కూడా ధాన్యం మొత్తం దిగుబడిని పెంచేందుకు గణనీయమైన అవకాశా లున్నవని కేంద్రకమిటీ అభిప్రాయ పడుతూ వుంది. ఎరువులనూ, యంత్రాలనూ మరింత ఫలదాయకంగా వినియోగించటం పైనా, వ్యవసాయ, సాంకేతిక నియమాలను కచ్చితంగా పాటించటం పైనా, కృషి వ్యవస్థీకరణను మెరుగు పరచడం పైనా, ధాన్యం తరుగులను పట్టుదలతో నిరోధించటం పైనా (ఇతర క్షేత్రోత్పత్తులకూ యిది వర్తిస్తుందని వేరే చెప్ప నవసరంలేదు) ఈ అవకాశాలు ఆధారపడి వున్నవి.

అన్నిటికన్నా ఎక్కువ దిగుబడుల నిచ్చే పంటలకూ, వంగడాలకూ ప్రాధాన్యమివ్వటంద్వారా, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాలూ, వ్యావసాయిక సంస్థలూ భూమి

సాగు స్వరూపాన్ని మెరుగుపరచే కృషిని పట్టుదలతో కొనసాగించాలి. దక్షిణాది మండలాల్లో, ఉదాహరణకు స్తావ్రొపోల్ ప్రాంతం, రోస్తోవ్, వోల్గావాల లోనూ, మరికొన్ని మండలాల్లోనూ మొక్కజొన్న పంట ప్రాంతాన్ని సమర్థనీయం కాని విధంగా తగ్గించారు. ఈ పరిస్థితిని చక్కదిద్దాలి. పశుగ్రాసం కోసం వుపయోగించే నూక ఉత్పత్తిని, ముఖ్యంగా ముతక గోధుమ, జొన్న నూక ఉత్పత్తిని కూడా పెంచాలి. ప్రణాళికలో తలపెట్టిన వరి పంట విధానాన్ని నిర్ణీత కార్యక్రమం ప్రకారం అమలు పరచాలి. దేశ అవసరాలు పూర్తిగా తీరేలా, ఈ పంచవర్ష ప్రణాళిక ముగిసే నాటికి వరిపంట 2 మిలియన్ టన్నులకు పెరగటానికి యిది అవసరం.

పశు పోషణను మరింతగా విస్తరింప జేయటానికి సంబంధించిన తీవ్రమైన, ముఖ్యమైన సమస్య కూడా మన ముందున్నది. అత్యంత విలువయిన ఆహారపదార్థాలు ప్రజలకు నిరంతరం సరఫరా అయ్యేలా చేయాలంటే, కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో నానాటికీ పెరుగుతూ వున్న సోవియట్ ప్రజల అవసరాలను తీర్చాలంటే, ఈ రంగంలో మనం పెద్ద ముందంజ వేయాలి. ఇందుకు కూడా సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల శక్తి స్తోమతులను మరింత సంపూర్ణంగా సమీకరించాలి.

మొట్టమొదటి విషయం ఏమంటే, పశుపోషణను విస్తరింప జేసేందుకు ప్రాతిపదిక అయిన పశుగ్రాసం వనరులను అభివృద్ధి చేయాలి. మేత బయళ్ళను, పచ్చిక పొలాలను మెరుగు పరచటం, వాటిని మరింత సంపూర్ణంగా వుపయోగించటం, గడ్డి, పశుగ్రాసం, నిలవచేసిన ఎండు గడ్డి, పాతర పెట్టిన గడ్డి, సారవంతమైన యితరకాల మేతల నిలవలను పెంచటం, అన్ని రకాల పశుగ్రాసాల పంట దిగుబడులను పెంచటం—ఇది నేటికీ ఒక ముఖ్య కర్తవ్యంగానే వుంది. రోగాలవల్ల, సరైన నిర్వహణ లేనందువల్ల పశువుల మందలకు సంభవించే నష్టాలను తగ్గించేందుకు చర్యలు తీసుకోవాలి. పశుపోషణ విభాగాలను నిర్మించేందుకూ, వాటిని యాంత్రికీకృతం చేసేందుకూ, మేలు జాతి పశువుల పోషణను మెరుగు పరచేందుకూ, మాంసంకోసం వుపయోగించే గొర్ల మందల, కోళ్ల, బాతులు మొదలయిన పక్షుల పెంపకాన్నీ విస్తరింప జేసేందుకూ ఎంతో కృషి చేయవలసి వుంది.

మాంసము, పాల ఉత్పత్తి విషయంలో యిప్పటికీ, వ్యక్తిగత అనుబంధ పశుపోషణ గణనీయమైన పాత్ర వహిస్తూ వుంది. అయితే, కొన్నిచోట్ల దీని గురించి తగినంత శ్రద్ధ చూపటం లేదు. సామాజికోత్పత్తిని పెంచటంపై ప్రధానంగా శ్రద్ధ వహిస్తూనే, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులకూ, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల ఉద్యోగులకూ పశువులనూ, కోళ్ళు, బాతులు మొదలయినవాటినీ, వాటికి అవసరమైవ మేతలనూ సంపాదించు కొనేందుకు అవసరమైన సహాయం అందచేయాలి.

పశు పోషణను విస్తరింప జేసేందుకు గల అవకాశాలను కొన్ని రిపబ్లిక్కు

ల్లోనూ, మండలాల్లోనూ యిప్పటికీ, సంపూర్ణంగా వినియోగింకోవటం లేదని చెప్పవలసి వుంది. మాల్దేవియా, ఆర్మీనియా, జార్జియా, తుర్క్‌మేనియా యూనియన్ రిపబ్లిక్కులకూ, రష్యన్ సమాఖ్యలోని వొరొనెజ్, ఓమ్స్క్, చెల్యాబిన్స్క్, కొస్త్రొమా మండలాలకూ, ఉక్రైన్ లోని ఒడెస్సా మండలానికీ, కజక్‌స్తాన్ లోని కారగండా, పావ్లొదార్ మండలాలకూ, మరికొన్ని యితరవాటికీ యిది వర్తిస్తూ వుంది. స్థానిక అధికారులు దీన్నుంచి తగు నిర్ధారణలకు రాగలరని ఆశిస్తున్నాం.

ధాన్యం ఉత్పత్తిని పెంచటమూ, పశుపోషణను అభివృద్ధి పరచటమూతో బాటు, పారిశ్రామిక పంటలతో సహా యితర క్షేత్రోత్పత్తులను విస్తరింప జేయటానికి గొప్ప ఆర్థిక ప్రాముఖ్యం వుంది. మధ్య ఆసియాలో, ముఖ్యంగా, ఉజ్బెకిస్తాన్‌లో మెరుగు పరచిన భూమి విస్తీర్ణాన్ని పెంచటమూ, పంట మార్పిడి పద్ధతిని ప్రవేశ పెట్టడమూ, ఎంతో విలువైనటువంటి, దేశానికి ఎంతో అవసరమైనటువంటి పత్తి పంటను పెంచేందుకు సాయపడగలదు.

కామ్రేడ్స్, మన ప్రణాళికలు ఈ ఐదేళ్ళ కాలానికి సంబంధించిన వర్తమాన సమస్యల పరిష్కారాన్ని, వ్యవసాయాభివృద్ధికి సంబంధించిన మౌలిక, దీర్ఘకాలిక ధోరణులతో సన్నిహితంగా జతపరుస్తున్నవి. ఈ సమస్యను పరిష్కరించే మార్గాలను పార్టీ నిర్వచించింది. ప్రప్రధానంగా యిది, వ్యవసాయ రంగానికి మరింతగా సాధన సామగ్రిని సమకూర్చేందుకు, *యాంత్రికీకరణకు, రసాయనీకరణకు,* భారీ ఎత్తున *భూమి బాగు* సేతకు సంబంధించిన విషయం.

వ్యవసాయరంగం జయప్రదంగా అభివృద్ధి చెందేందుకు దేశం యొక్క సార్వత్రిక ఆర్థిక శక్తిస్తోమతలను నానాటికీ మరింత విస్తారంగా వుపయోగించటం అవసరమని దీని అర్థం. అందుకనే, పార్టీ, వ్యవసాయ రంగానికి అవసరమైన ఉత్పత్తి సాధనాలనూ, క్షేత్రోత్పత్తుల శుద్ధికి, రవాణాకు, నిలువకు, అమ్మకానికి ఉపకరించే యంత్రాలనూ, సాధనాలనూ తయారుచేసే పారిశ్రామిక శాఖల సత్వరాభివృద్ధి గురించిన కర్తవ్యాన్ని అంతతక్షణమైందిగా నిర్ణయించింది.

ఈ విధంగా, వ్యవసాయాభివృద్ధి సమిష్టి వ్యవసాయక్షేత్రాల రైతులు, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రాల కార్మికులపైననే గాక, అనేక విషయాల్లో, పారిశ్రామిక, శాస్త్ర, సాంకేతిక రంగాల్లో పని చేసేవారి కృషి పైన గూడా ఆధారపడి వుంది. ఈ బ్రహ్మాండమైన, నిజంగా దేశ వ్యాపితమయిన, జాతీయ లక్ష్య సాధనకు గౌరవప్రదమైన దోహదం చేయవలసిందిగా పార్టీ వారిని కోరుతూ వుంది.

రానున్న సంవత్సరాలలో వ్యవసాయంపై కేంద్రీకరణమూ, మాంసం, పాలు మొదలైనవాటిని పారిశ్రామిక పద్ధతుల్లో ఉత్పత్తి చేయటాన్నీ మరింతగా అభివృద్ధి పరచటం జరుగుతుంది. ఇది సహజమే. ఎందుకంటే, దీర్ఘకాలిక దృష్ట్యా మన వ్యవ

సాయం యొక్క భవిష్యత్తును తీర్చిదిద్దేవి ఈ క్రమాలే. అయితే, బృహత్తరమైన, ముఖ్యమైన ఈ పనిలో తప్పులు జరగకుండా, తాహతుకు మించిన పనులు తలపెట్టకుండా జాగ్రత్త పడటం మన కర్తవ్యం. ప్రత్యేక కేంద్రీకరణకూ, పారిశ్రామిక పద్ధతులకు మారడానికీ ఆర్థికమైన ఆధారాలు ఉండేలా చూడాలి; ప్రతి ఒక్క నిర్దిష్ట సందర్భంలోనూ సమగ్రమైన సన్నాహం జరగాలి.

వ్యవసాయ రంగ సత్వరాభివృద్ధి, అంతర్ సమిష్టి వ్యవసాయక్షేత్ర, ప్రభుత్వ - సమిష్టి వ్యవసాయక్షేత్ర సంయుక్త ఉత్పత్తి సంస్థలు నానాటికీ మరింత ఎక్కువగా వ్యాప్తి చెందేందుకూ, వ్యావసాయిక - పారిశ్రామిక సముదాయాల స్థాపనకూ దారి తీస్తుంది. ఇవి యంత్రాలను, పెట్టుబళ్ళను, మనుష్య సంపదనూ మరింత ఫలప్రదంగా, పారిశ్రామిక పద్ధతులను మరింత విస్తారంగా వుపయోగించుకో గలుగుతున్నవి. గ్రామసీమలో ఉత్పత్తిని వ్యవస్థీకరించే యిలాంటి రూపాలను పార్టీ సమర్థించు తుంది.

కామ్రేడ్స్, క్షేత్రోత్పత్తులకు సంబంధించిన కర్తవ్యాలను నెరవేర్చేందుకు చాలా కష్టపడి పని చేయవలసి వుంటుంది. వ్యవసాయాభివృద్ధిలో గ్రామీణ పార్టీ సంస్థలు, ప్రభుత్వ అధికారులు, వ్యవసాయ అధికారులూ, ప్రభుత్వ, సమిష్టి వ్యవసాయక్షేత్రాల మేనేజర్లు ఒక గొప్ప పాత్ర వహించవలసి వుంది. పార్టీ వారి స్వార్థరహిత కృషిని ఎంతో హర్షిస్తూ వుంది.

సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల, ప్రభుత్వ వ్యవసాయక్షేత్ర కార్మికుల వ్యవసాయ ప్రవీణుల కృషి గొప్ప నూతన విజయాలను చూరగొన గలదనే నమ్మకాన్ని మహాసభ పక్షాన వ్యక్తం చేసేందుకు అనుమతించ వలసిందిగా కోరుతున్నాను.

## పారిశ్రామిక వాడకం సరకుల ఉత్పత్తిని విస్తరింప జేసేందుకు

కామ్రేడ్స్, మనము యిదివరకే పేర్కొన్నట్లు, గడచిన ఐదేళ్ళ కాలంలో పారిశ్రామిక వాడకం సరకుల ఉత్పత్తీ, అమ్మకమూ గణనీయంగా పెరిగాయి. అయినా చాలా సరకుల ఉత్పత్తి యిప్పటికీ అవసరాల కంటే తక్కువగానే వుంది. ప్రజల నగదు ఆదాయాలు ప్రణాళికా బద్ధంగా పెరిగినందువల్ల వీటికి గిరాకీ మరింత ఎక్కు వవుతుంది; సరకు నాణ్యత సమస్య మరింత నిశితరూపం ధరిస్తుంది.

జీవన ప్రమాణాలను మరింతగా మెరుగు పరచే పంథాను పార్టీ అనుసరించు తున్నందువల్ల ఏర్పడుతున్న నూతన అవసరాలను తీర్చేందుకు మన పారిశ్రామిక రంగం సిద్ధంగా వుందా?

భౌతిక వనరులదృష్ట్యా, యిందు కది సిద్ధంగానే వుందనేది నిర్వివాదం. దేశ పారిశ్రామిక శక్తి స్తోమతలు వాడకం సరకుల ఉత్పత్తిని గణనీయంగా పెంచేందుకూ, వాటి నాణ్యతను మెరుగు పరచేందుకూ సరిపడేటంత విస్తారంగా వున్నవి. పెరిగిన ఆర్థిక అవ

కాశాలు ఈ రంగంలో మరింత పెద్ద మొత్తాలను పెట్టుబడి పెట్టేందుకు వీలు కలిగి స్తున్నవి. మనం చేస్తున్నది సరిగ్గా అదే.

కాని అన్ని పనుల్లో వలెనే విజయం, కేవలం భౌతిక పరిస్థితులపైన మాత్రమే ఆధారపడి వుండదు. ఎందుకంటే స్వీయాత్మక అంశాలకు గూడా అపారమైన చెల్లుబాటు వుంది. అందుకని వాడకం సరకుల ఉత్పత్తి పట్ల వైఖరిని సమూలంగా మార్చుకోవలసిన అవసరాన్ని ప్రణాళికా రచనా, ఆర్థిక అధికార సంస్థల దృష్టికీ, పార్టీ, ప్రభుత్వ, ట్రేడ్ యూనియన్ సంస్థల దృష్టికీ తేవటం అవసరమని కేంద్రకమిటీ భావిస్తున్నది.

కామ్రేడ్స్, మనకు అనేక సంవత్సరాల వీరోచితమైన చరిత్ర వుంది. లక్షలాది మంది కమ్యూనిస్టులూ, కమ్యూనిస్టులు కానివారూ చైతన్యంతో బాధలనూ, యిబ్బందులనూ అనుభవించారు. కనీస జీవితావసరాలతో సంతృప్తి పడ్డారు. ప్రత్యేక సదుపాయాలు కోరే హక్కును తమంతకు తాముగానే వదులుకున్నారు. వినిమయ వస్తువుల ఉత్పత్తీ, నాణ్యతా, వైవిధ్యాల పట్ల వీరి వైఖరిని ఈ పరిస్థితి తప్పనిసరిగా ప్రభావితం చేసింది. అయితే, యితర కర్తవ్యాలూ, బాధ్యతలూ ప్రాధాన్యం వహించినప్పుడు, గతంలో సమర్థనీయమూ, సహజమూ అయినది, ప్రస్తుత పరిస్థితుల్లో ఆమోదయోగ్యం కాదు. కొందరు కామ్రేడ్స్‌లో ఈ విషయాన్ని నిర్లక్ష్యం చేసే ధోరణి వుంది. జీవన ప్రమాణాలు స్థిరంగా పెరగటం లక్ష్యంగాగల పార్టీ విధాన సారాంశాన్ని అర్థం చేసుకోవటంలో విఫలం కావటం నుంచీ, లేదా, తమ నిష్క్రియత్వాన్ని సమర్థించుకో జూచే ప్రయత్నం నుంచీ, వారి ఈ వైఖరి ఉత్పన్న మవుతున్నట్లు భావించే హక్కు పార్టీకి వుంది. ఈ విషయాన్ని సూటిగా, నిర్మొహమాటంగా చెప్పటం అవసరమని కేంద్రకమిటీ అభిప్రాయ పడుతూ వుంది.

లోపాలతో ఏదో విధంగా, "శాంతియుత సహజీవనం సాగించే" టటువంటి, కొన్ని వాడకం సరకుల నాణ్యత తక్కువగా వున్నా చూచీ చూడకుండా వూరుకోవటానికి అలవాటు పడినటువంటి, వాడకం సరకుల ఉత్పత్తి అభివృద్ధిని క్షమించ వీల్లేనంత మందకొడిగా సాగిస్తున్నటువంటి అధికారులు యిప్పటికీ వున్నారు. అలాంటివారు స్థానిక సంస్థల్లోనే గాక, కేంద్రంలోనూ వున్నారు. అవసరమైన కొన్ని సరకుల ఉత్పత్తిని కోత పెట్టడం, లేదా నిలిపివేయడం వరకు, కాలం చెల్లిపోయిన సరకుల స్థానంలో కొత్తవాటిని ప్రవేశపెట్టడమనే సాకుతో, చౌకవే అయినప్పటికీ ప్రజలకు అత్యవసరమైన కొన్ని సరకుల ఉత్పత్తిని నిలిపివేయడం వరకు, వెళ్లేవారున్నారు. తరచు "చిల్లర మల్లర వస్తువులు" అని చెప్పుకునే వాటి విషయంలో మధ్య మధ్య కొరత ఏర్పడుతూ వున్నది ఈ విధంగానే. కాని నిత్యం అవసరమయ్యే వస్తువులను తీసుకుంటే వాటిలో చిల్లర మల్లర అనదగిన వేవీ లేవు.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో వాడకం వస్తువుల సరఫరాను గణనీయంగా పెంచగల శక్తి మనకు వుంది. వస్త్రాల, దుస్తుల, పాదరక్షల, అల్లిక వస్తువుల

ఉత్పత్తిని గణనీయంగా పెంచాలని ప్రణాళికలో తలపెట్టారు. టెలివిజన్ సెట్లు, యిండ్లలో వాడుకునే రెఫ్రిజరేటర్లు, రేడియోలు, బట్టలువుతికే యంత్రాలు మొదలయిన స్థిరోపయోగ వస్తువుల విషయంలో ప్రజల అవసరాలను దాదాపు పూర్తిగా తీర్చగల నిజమైన అవకాశం వుంది. మోటారుకార్ల అమ్మకం పెద్దగా పెరుగుతుంది; 1975 లో కార్ల ఉత్పత్తి 1970 నాటికంటే దాదాపు 4 రెట్లు ఎక్కువ అవుతుంది.

మనమిప్పుడు ఈ కర్తవ్యాలను నిర్వర్తించగల స్థితికి వచ్చామనేది నిర్వివాదం. కావలసిందల్లా లభ్యమవుతున్న మూలవనరులనూ, అవకాశాలనూ పూర్తిగా వినియోగించుకోవటమే. అన్ని మంత్రిత్వ శాఖలకు, అన్ని రిపబ్లిక్కులకు, మండలాలకు, అన్ని నగరాలకు, అన్ని పరిశ్రమాది సంస్థలకు యివి అందుబాటులో వున్నవి.

కొత్త పంచవర్ష ప్రణాళికలో తేలికరకం పరిశ్రమల అభివృద్ధికి, క్రితం పంచవర్ష ప్రణాళిక కంటే దాదాపు రెట్టింపు, అంటే 8.7 వేల మిలియన్ రూబుళ్ళ మొత్తాన్నీ, ఆహారం, మాంసం, పాడి, మత్స్య పరిశ్రమలకు దాదాపు 14 వేల మిలియన్ రూబుళ్లనూ కేటాయించారు. పరిశ్రమలను త్వరత్వరగా నిర్మించేందుకు, పునర్నిర్మించేందుకు, వాటికి అధునాతన యంత్రాలను సమకూర్చేందుకు ఈ మొత్తాలను సరయిన విధంగా, నిర్ణీత గడువులో వినియోగించాలి. ఇందుకు మన యింజినీయరింగు పరిశ్రమా, మన పరిశోధకులూ, రూపకల్పనా వేత్తలూ గొప్ప బాధ్యతాయుత కర్తవ్యాలను నెరవేర్చవలసి వుంటుంది. పార్టీ సంస్థల, ఆర్థిక సంస్థల నిరంతర నియంత్రణ కూడా చాలా అవసరం.

ప్రభుత్వం నిర్ణయించిన చిల్లర ధరలు నిలకడగా వుండేలా చూస్తూ, వాడకం సరకులతో మార్కెట్‌ను ముంచెత్తే బ్రహ్మాండమైన, జటిలమైన కర్తవ్యాన్ని నిర్వహించాలి. అంతమాత్రమే గాక, ఆర్థికంగా అవసరమైన పరిస్థితులు సృష్టించబడినప్పుడు కొన్ని వాడకం వస్తువుల ధరల తగ్గింపు కూడా జరగాలి. ధరలను కృత్రిమంగా పెంచటం జరిగిన సందర్భాలను దృఢంగా ఎదుర్కోవాలి. చిల్లర ధరల, సేవా సౌకర్యాలకై వసూలుచేసే రుసుముల నిర్ణయంపై నియంత్రణను కట్టుదిట్టం చేయాలి. నిర్ణీత కార్యవిధానాన్ని దాటవేయ ప్రయత్నించే పరిశ్రమల ఆర్థిక సంస్థల అధిపతులపై చర్యలు తీసుకోవాలి.

వాడకం సరకుల గిరాకీని తీర్చడానికి గొప్ప ప్రాముఖ్య మిస్తూన్న కేంద్రకమిటీ, అన్ని పారిశ్రామిక శాఖల్లోనూ వాడకం సరకుల ఉత్పత్తిని పెంచేందుకు ఒక విస్తృత కార్యక్రమాన్ని త్వరలో రూపొందించటం అవసరమని భావిస్తున్నది. ఆ కార్యక్రమాన్ని నెరవేర్చటం సోవియట్ ప్రజల జీవన ప్రమాణాభివృద్ధి మెరుగు కావటానికి గొప్ప దోహదకారి కాగలదు.

## వర్తకాభివృద్ధికోసం, సాముదాయిక సేవలను మెరుగు పరచేందుకోసం

జీవన ప్రమాణాన్ని మరింతగా పెంచేందుకు వర్తకమూ, వివిధ సేవలకు సంబంధించిన రంగమూ మరింత పెద్ద బాధ్యతలను స్వీకరించవలసి వుంటుంది. ఈ శాఖలను అభివృద్ధి పరచేందుకు యిటీవలి సంవత్సరాల్లో చాలా కృషి చేశాం.

పట్టణాల్లోనూ, గ్రామ ప్రాంతాల్లోనూ, కొత్త దుకాణాలను, డిపార్టుమెంటు స్టోర్లనూ, యితర వర్తక సంస్థలనూ, వేలకొలది ఏర్పాటు చేయటం జరిగింది. అయినా వర్తక, సేవా రంగాలలో యిప్పటికీ ఎన్నో లోపాలున్నవి. శోచనీయమైన విషయం ఏమంటే, ఈ రంగాలకు సంబంధించిన కొందరు ఈ లోపాలను చూచీ చూడనట్లు వూరుకోవడానికీ, వాటిని ఆచరణలో సర్వ సాధారణమైనవిగా పరిగణించేందుకూ అలవాటు పడ్డారు. చాలా సందర్భాల్లో, వర్తక సంస్థలు త్వరత్వరగా పనులు జరగటానికి వీలుగా లేవు; మార్కెట్ అవసరాలను సరిగా అధ్యయనం చేయటం నేర్చుకోలేదు. దీని ఫలితంగా, సరకులు అకాలంగా దుకాణాలకు చేరటమూ, అవసరమైన చోట్లకు గాకుండా, మరెక్కడకో సరఫరా కావటమూ జరుగుతూ వుంది. కొన్ని సరకులకు అవసరమైన దానికంటే మరీ తక్కువ పరిమాణాల్లో ఆర్డర్లివ్వటం కూడా తరచుగా జరిగింది. దీని ఫలితంగా ఆ సరకుల ఉత్పత్తిని తగ్గించటమూ, వాటికి తీవ్రమైన కొరతలు ఏర్పడటమూ జరిగింది. ఒక్కోసారి, ఇండ్లలో వుపయోగించే కుట్టు మిషన్ల విషయంలోనూ, ఒక్కోసారి యిస్త్రీ పెట్టెలు మొదలయిన వస్తువుల విషయంలోనూ జరిగింది యిదే. చాలా సందర్భాలలో దుకాణాల్లోని సర్వీసింగ్ సదుపాయాలు కూడా తగినంత సంతృప్తికరంగా లేవు.

వర్తక రంగంలోని వారి కృషి సోవియట్ ప్రజల, పార్టీ గౌరవాన్ని చూరగొంది. కాని, వారిని ఉద్దేశించినప్పుడు ముఖ్యంగా వర్తకరంగ అధికారుల నుద్దేశించినప్పుడు, పని ప్రమాణాన్నీ, వర్తక వ్యవస్థీకరణనూ బాగా మెరుగు పరచటమూ, ఆధునికమైన వర్తక పద్ధతులను ప్రవేశపెట్టటమూ ప్రస్తుత కర్తవ్యమని చెప్ప గోరుతున్నాం.

భోజనశాలల విషయమై మనదేశంలో చాలా శ్రద్ధ తీసుకుంటున్నాం. భోజన శాలలు, అల్పాహార శాలలూ పెద్ద సంఖ్యలో నిర్మిస్తున్నాం, యింకా నిర్మించుతాం. అయితే ఈ రంగంలో, ముఖ్యంగా పరిశ్రమల్లోని, కార్యాలయాల్లోని, విద్యాసంస్థల్లోని, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోని భోజనశాలల వ్యవస్థీకరణలో చాలా లోపాలున్నవి. వీటిలోని వసతులు తరచు అవసరానికి సరిపడా వుండటంలేదు. భోజన పదార్థాలూ అంత రుచిగా వుండటం లేదు. ఈ పరిస్థితిని సహించరాదు. ఈ లోపాల విషయంలో, మంత్రిత్వ శాఖలపైనా, స్థానిక అధికారులపైనా, సంస్థల అధిపతులపైనా మరింత గట్టి చర్య తీసుకోవాలి. ట్రేడ్ యూనియన్‌లు కూడా ఒక ముఖ్యపాత్ర వహించాలి; అవి పరిశ్రమాది సంస్థలలోని భోజన సదుపాయాలపై నిరంతరమైన, స్థిరమైన నియంత్రణ అమలు జరపాలి.

కామ్రేడ్స్, భోజన శాలలు, కుట్టుపని, దుస్తుల తయారీ, మరమ్మతులు, క్రీడా, వినోద సౌకర్యాలు—ఈ సేవలన్నిటినీ మనం గణనీయంగా మెరుగు పరచాలి. అవి కేవలం ప్రణాళికా లక్ష్యాలను పూర్తి చేయవలసిన పరిశ్రమలు కావు: అవి ప్రజలతో, వారి విభిన్న అభిరుచులతో, మనోభావాలతో ప్రత్యక్షంగా వ్యవహరించ వలసిన సేవా రంగాలు. వాటి కృషిని కేవలం ప్రణాళికా లక్ష్యాలకు సంబంధించిన శాతాలను సాధించ టానికీ, లాభాలకూ దిగజార్చివేసే సమస్యే లేదు.

సేవా సౌకర్యాల విషయంలో ప్రజల అవసరాలు స్థిరంగా పెరుగుతున్నవి. ఈ అవసరాలను మరింత పూర్తిగా తీర్చేందుకు, డబ్బు చెల్లించే పద్ధతిమీద ప్రజలకు సమ కూర్చే సేవల పరిమాణాన్ని కనీసం రెట్టింపు చేయాలని కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో తలపెడుతున్నాం.

ఈ విషయంలో కూడా మనం, శక్తి స్తోమతలను వుపయోగించుకోవటం గురించి ఆలోచించాలి. స్థానిక సోవియట్ల చొరవతో సహా, స్థానిక చొరవమీద చాలా ఆధారపడి వుంది. ఇతర వాటితో పాటు మనం మరో సమస్య గురించి కూడా పరిశీలించాలి. పింఛన్ దారులు, గృహిణులు, అశక్తులు, తమపై మోయలేని భారం వేసుకోకుండానే, తమ యిండ్ల వద్దనే వుంటూ, వ్యక్తిగతమైన యేర్పాటుతో, లేదా సహకార సంఘాల నేర్పాటు చేసు కోవటం ద్వారా, తమకూ, సమాజానికీ గూడా లాభదాయకంగా వుండేలా సేవా పరిశ్రమలో కొంత పని చేయటం అన్నది ఈ సమస్య. దీనికోసం, యిలాటి కార్యకలాపాల గురించిన చట్ట సంబంధమైన అంశాలను సవరించి, దానికి అవసరమైన మద్దతు కల్పించాల్సి వుంటుంది.

క్లుప్తంగా చెప్పాలంటే, సేవా పరిశ్రమల అభివృద్ధికి కేటాయింపుల విషయం లోనూ, వాటి సిబ్బందిని మెరుగుపరచి, ఆ పరిశ్రమల్లో పని చేస్తున్నవారి సామాజిక హోదాను పెంచేందుకూ కూడా గట్టి శ్రద్ధ అవసర మవుతూ వుంది.

* * *

కామ్రేడ్స్, శ్రామికప్రజల జీవన ప్రమాణాన్ని పెంచేందుకు ఉద్దేశించిన మన కార్యకలాపాల ప్రధాన ధోరణులు యివీ. ఈ విషయంలో కొత్త పంచవర్ష ప్రణాళిక ఒక పెద్ద ముందంజ వేయాలి. అదేసమయంలో అది, భవిష్యత్తులో మరింత గణనీయ మైన విజయాలకు పునాది వేయాలి.

ఈ కర్తవ్యాలను సాధించాలంటే ఆర్థిక, ప్రభుత్వ, ట్రేడ్ యూనియన్, పార్టీ రంగాలలోని మన కేంద్ర, స్థానిక కార్యకర్తలు అత్యంత ముఖ్యమైన ప్రభుత్వ విధుల నిర్వహణ విషయంలో ఎంత నిష్కర్షగానూ, విచక్షణా దృష్టి గల వారుగానూ వుంటున్నారో, ప్రజల జీవన పరిస్థితులను మెరుగు పరచేందుకు సంబంధించిన అన్ని

విషయాల్లో కూడా అంతే నిష్కర్షగానూ, విచక్షణా దృష్టి కలవారుగానూ వుండాలి. వారు అటువంటి వైఖరి నవలంబిస్తారని పార్టీ ఆశిస్తూ వుంది.

## 3. శాస్త్ర, సాంకేతిక ప్రగతినీ, అన్ని శక్తిస్తోమతుల పూర్తి వినియోగాన్నీ ఆధారం చేసుకొని సామాజికోత్పత్తి ఫలదాయకతను పెంచేందుకు

కామ్రేడ్స్, మన ఆర్థికవిధానం యొక్క రెండవ మౌలిక సమస్యను, అంటే మన కర్తవ్యాలను నెరవేర్చేందుకు సమీకరించవలసిన వనరుల సమస్యను ఎత్తుకొనేందుకు అనుమతించండి. ఈ వనరులను, ముఖ్యంగా మనం నొక్కి చెబుతున్న శాఖల సత్వరాభివృద్ధికి అవసరమైన సాధనాలను, మనం ఎక్కడ నుంచి సంపాదించగలం?

ఒక శాఖలోని వనరులను మరో శాఖకు మార్చటం ద్వారా కొంత సాధించవచ్చు. కాని, ఈ వనరు సహజంగానే పరిమితమైంది. ఆర్థిక పెరుగుదలకు సంబంధించిన విస్తృతాంశాలు అని పిలిచేవి కూడా, చాలా పరిమితమై పోతున్నవి; గత పంచవర్ష ప్రణాళికా కాలంతో పోల్చి చూస్తే, 1971-1975 లో అదనపు మానవబలగం తగ్గిపోతుంది. పెట్టుబడుల పెరుగుదల వేగాలకు కూడా హద్దులున్నవి.

పర్యవసానం ఏమంటే, ఉత్పత్తి ఫలదాయకతను పెంచటంపైనే మనం ప్రధానంగా ఆధారపడాలి. మరింత తేలిక మాటల్లో చెప్పాలంటే, శ్రమ, పాదార్థిక, ద్రవ్య పెట్టుబడుల ప్రామాణిక పరిమాణం ఒక్కొక్క దానివల్ల లభించే ఉత్పత్తినీ, జాతీయాదాయాన్నీ గణనీయంగా పెంచాలన్నదే అసలు సమస్య. చివరకంటా చూస్తే సామాజిక శ్రమ యొక్క ఉత్పాదకశక్తిని పెంచటమంటే యిదే.

వచ్చే ఐదేళ్ళలో అధిక శ్రామిక ఉత్పాదకశక్తి ద్వారా లభించే ఫలితం జాతీయాదాయం పెరుగుదలలో కనీసం 80 శాతం, పారిశ్రామికోత్పత్తి పెరుగుదలలో 87-90 శాతం, నిర్మాణము, కూర్పుల పెరుగుదలలో 95 శాతం, రైళ్ళద్వారా సరకు రవాణా పెరుగుదలలో నూటికి నూరు శాతం వుండాలి. క్షేత్రోత్పత్తుల విషయంలో తలపెట్టిన పెరుగుదలను యావత్తూ శ్రామిక ఉత్పాదకశక్తిని పెంచటం ద్వారానే సాధించాలి.

సరిగ్గా ఈ దృక్పథంతోనే, శ్రామిక ఉత్పాదకశక్తి పెరుగుదలను వేగిర పరచవలసిన అవసరాన్ని మనస్సులో పెట్టుకొని మనం ఆర్థికాభివృద్ధికి సంబంధించిన ప్రధాన సమస్యలను పరిశీలించాలి. ఈ విధంగా చేసేటప్పుడు, ప్రస్తుత కర్తవ్యాల దృష్ట్యానూ, దీర్ఘకాలిక దృష్ట్యానూ కూడా శాస్త్ర, సాంకేతిక రంగ సత్వర ప్రగతి ప్రథమ స్థానాన్ని అలంకరిస్తుంది.

### శాస్త్ర, సాంకేతిక విప్లవం. విజ్ఞానశాస్త్ర, ఉత్పత్తి రంగాల సంలీనం

గడచిన ఐదేళ్ళ కాలంలో సోవియట్ విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలు వేగంగా

అభివృద్ధి చెందాయి. అవి సాధించిన విజయాలను చూచి మనం గర్వించటం సరైనదే. అయినప్పటికీ, సత్వర శాస్త్ర, సాంకేతిక ప్రగతి యింకా ఒక ప్రధాన కర్తవ్యంగానే వుంది. ఒక ప్రత్యక్ష ఉత్పాదక శక్తిగా విజ్ఞానశాస్త్రం పాత్ర పెరుగుతూ వున్నప్పుడు విడి విడి శాస్త్రీయ విజయాలు, అవెంత ఉజ్వలమైన వైనప్పటికీ యిక నేమాత్రం కీలకమైనవి కావు. కీలకమైన దేమిటీ అంటే ఉత్పత్తిలో మొత్తంగా ఉన్నతమైన శాస్త్ర, సాంకేతిక స్థాయి.

ఇందువల్ల మన విజ్ఞానశాస్త్ర రంగం మరింత బాధ్యతాయుత మయిన కర్తవ్యాలను నెరవేర్చవలసి వుంది. ఇందుకు అది మరింత ఎక్కువ ఫలదాయకంగా వుండటమూ, మౌలిక పరిశోధన మరింత విస్తరించటమూ, శాస్త్రవేత్తలు తమ శక్తినీ, శ్రద్ధనూ, శాస్త్ర, సాంకేతిక ప్రగతిలోని అన్నిటికన్నా ముఖ్యమైన, ఆశాజనకమైన, దీర్ఘకాలిక ధోరణులపై కేంద్రీకరించడమూ అవసరం అవుతుంది. పరిశోధనా, రూపకల్పనా సంస్థలూ, ప్రాయోగిక సంస్థలూ, ఆర్థికవ్యవస్థలో ప్రవేశ పెట్టేందుకోసం, నూతన యంత్రాలనూ, నూతన ఉత్పత్తి ప్రక్రియలనూ నిర్దుష్ట పరచేందుకు యింకా ఎక్కువ కష్టపడి పనిచేయాలి. శాస్త్ర, సాంకేతిక విషయాల ప్రభుత్వ కమిటీ ముందు, విజ్ఞానశాస్త్రాల అకాడెమీ ముందు, మంత్రిత్వ శాఖలముందు వున్న కర్తవ్యాలు పెరుగుతున్నవి.

విజ్ఞాన శాస్త్రాన్ని ఉత్పత్తి రంగంతో బంధిస్తున్న జటిలమైన గొలుసులోని లింకులన్నిటినీ పరిశీలిస్తే మనకు ఒక విషయం తేలిగ్గా బోధపడుతుంది. అదేమంటే, విజ్ఞానశాస్త్ర రంగంలో సాధించిన ఫలితాలను ఆచరణలో పెట్టేందుకూ, భారీ ఎత్తున జరిగే ఉత్పత్తికి వాటిని వర్తింప జేసేందుకూ సంబంధించినవి, పై లింకుల్లోకెల్లా బలహీనమైనవి. ఈ రంగంలో మనం ఎన్నో సత్ఫలితాలు సాధించామన్న మాట యథార్థమే. పాటన్ ఎలక్ట్రికల్ వెల్డింగ్ యిన్‌స్టిట్యూట్ పనిని లేదా ఐసోప్రీన్ రబ్బరును రూపొందించే కృషిని ఉదహరిస్తే చాలు. అయితే దురదృష్టవశాత్తు అన్ని సందర్భాలలోను యిలా జరగటంలేదు.

ఇప్పుడున్న చిక్కులను తొలగించేందుకు అతి ముఖ్యమైన ఉత్పత్తి సమస్య పట్ల ఆయా విజ్ఞానశాస్త్ర సంస్థల దృక్పథంలో మరింత పెద్ద మార్పు తేవాలి; మరో వైపున ఫ్యాక్టరీలు సరికొత్త రకం సరకులు ఉత్పత్తి చేయక తప్పని పరిస్థితులను కల్పించాలి. అలంకారరీతిలో చెప్పాలంటే మంత్రోదకాలకు దయ్యాలు ఎడంగా పోయినట్లు, నూతన శాస్త్ర, సాంకేతిక విషయాలకు ఎడంగా వుండటం గాక, అవి అక్షరాలా వాటి వెంట పడి పరుగులు తీసేలా చేయాలి. యంత్రాలను, ఉత్పత్తి ప్రక్రియలను ఆధునికీకరించేందుకు, సరికొత్త అవసరాలను తీర్చే సరకులను ఉత్పత్తి చేసేందుకు నిజంగా కృషిచేసే సమిష్టి సంస్థలకు మరింత ఉన్నత స్థానాన్ని యివ్వాలి.

జాతీయార్థిక ప్రణాళిక, శాస్త్ర, సాంకేతిక ప్రగతికి ఒక శక్తివంతమైన సాధనం

కావాలి. ఇంతవరకు మన ప్రణాళికలు, శాస్త్ర, సాంకేతిక రంగాల ఫలితాలను ఆర్థిక వ్యవస్థలో వుపయోగించేందుకు తగినంత కృషి చేయలేదు. అంతేకాదు. చాలా మంత్రిత్వ శాఖలు నిర్ణీత లక్ష్యాలకు వెనుకబడుతూ వచ్చాయి. మరికొన్నిటితో బాటు, కలప, దారు పరిశ్రమ మంత్రిత్వశాఖకు, ట్రాక్టర్ల, వ్యావసాయిక యంత్రాల యింజినియరింగ్ మంత్రిత్వశాఖకు యిది వర్తిస్తుంది. ఈ వైఖరి మారాలి. యంత్రాలను, సాంకేతిక రీతులను మరింతగా అభివృద్ధిపరచే సమగ్ర కార్యక్రమం అవసరం. అది ప్రణాళికలోని అన్ని విభాగాలను, దాని ప్రధాన సూచికలను లెక్కలోకి తీసుకునేదిగా వుండాలి. ఈ వైఖరి ముసాయిదా ఆదేశాల్లో యిప్పటికే ప్రతిబింబించింది.

పరిశ్రమల రంగాన్ని వ్యవస్థీకరించే రూపాలను మెరుగుపరచి, నేటి అవసరాలకు సరితూగగల రకపు ఉత్పత్తి రూపాల్ని సాధించటం, శాస్త్ర, సాంకేతిక రగాల ప్రగతిని త్వరితం చేసేందుకు ముఖ్యం. పరిశ్రమల్లోనే పరిశోధనను, అధ్యయనాలను గణనీయంగా విస్తరింప జేయటం, ఫ్యాక్టరీలలో రూపకల్పనా విభాగాలను, చక్కని వనరులుగల ప్రయోగ ప్రాతిపదికను నెలకొల్పటం, పరిశోధకులు పెద్ద సంఖ్యలో పరిశ్రమల్లోకి వచ్చి చేరటం, యిందులో గర్భితం. సహజంగానే పెద్ద పరిశ్రమ సముదాయాలూ, ఉమ్మడి పరిశ్రమలూ మాత్రమే యిది సాధించగలవు. ఇందువల్ల వాటిని నిర్మించటం ప్రత్యేకించి అవసరం. పరిశోధనా సంస్థలను, ఫ్యాక్టరీలతో విలీనం చేసినందువల్ల శక్తివంతమైన శాస్త్ర - ఉత్పత్తి సముదాయాలను నెలకొల్పినందువల్ల, చాలా సందర్భాల్లో చక్కని ఫలితాలు లభించవచ్చు. శాస్త్ర, సాంకేతిక సమాచారాన్ని మెరుగుపరచటం, ఫలప్రదమైన నియంత్రణా పద్ధతులను రూపొందించటం, స్వతంత్రమైన, అనధికార ప్రవీణుల కమిటీలు—వీటికి సంబంధించిన సమస్యలు సందర్భోచితమైనవి. ఇవి, అత్యాధునిక అవసరాలకు సరిపడని యంత్రాలను, సాధనాలను, ఉత్పత్తి ప్రక్రియలను రూపొందించే అవకాశం లేకుండా చేస్తాయి.

కామ్రేడ్స్, మన ప్రణాళికా సంస్థలూ, ఆర్థిక సంస్థలూ మాత్రమే గాక పార్టీ కార్యకర్తలు యావన్మందీ కూడా శాస్త్ర, సాంకేతిక ప్రగతిని త్వరితం చేసేందుకు పూర్తి శ్రద్ధ చూపడం అవసరం. వర్తమాన ఆర్థిక ఆచరణ యొక్క అవసరాలు, భవిష్యత్ అవసరాలు రెంటి నుంచీ కూడా దీనికి ప్రాముఖ్యత ఏర్పడుతున్నది. కమ్యూనిజానికి పాదార్థిక, సాంకేతిక ప్రాతిపదిక నిర్మాణానికి, శాస్త్ర, సాంకేతిక ప్రగతి ప్రధానమైన సాధనం. అందుకని శాస్త్ర, సాంకేతికాభివృద్ధిని సాధించటం అంతటి ముఖ్య విషయంలో మనం దీర్ఘకాలిక అవకాశాలను, స్పష్టంగా గమనించాలి, ఆచరణ పూర్వక కృషిలో వాటిని లెక్కలోకి తీసుకోవాలి.

శాస్త్ర, సాంకేతిక రంగాల్లో కొత్తగా కనిపెట్టిన విషయాలతో ఉత్పత్తి శక్తుల అభివృద్ధిలో ప్రారంభమైన విప్లవం, అధికాధికంగా ప్రముఖమూ, ప్రగాఢమూ అయే అవకాశా లున్నాయి. కామ్రేడ్స్, మనముందున్న కర్తవ్యం చారిత్రక

ప్రాముఖ్యం కలది. ఆ కర్తవ్యం యిదీ: శాస్త్ర, సాంకేతిక విప్లవ ఫలితాలను సోషలిస్టు అర్థికవ్యవస్థ యొక్క లాభాలతో అంగాంగికంగా మేళవించటమూ, విజ్ఞానశాస్త్ర, ఉత్పత్తి రంగాలను సంలీనం చేసేందుకు సంబంధించిన మన స్వంత, సహజ సిద్ధంగా సోషలిస్టు స్వభావం కల రూపాలను మరింత విస్తారంగా వృద్ధి పరచటమూను.

శాస్త్ర సాంకేతిక ప్రగతిని వేగిరపరచేందుకు చర్యలు తీసుకొనేటప్పుడు మనం ఒక విషయం జాగ్రత్త వహించాలి. ఈ ప్రగతి సహజ వనరుల హేతుబద్ధమైన వినియోగంతో జతపడాలి; గాలినీ, నీటినీ ప్రమాదకరంగా కలుషితం కానీయరాదు; భూసారాన్ని హరించుకు పోనీయరాదు. కొత్త ఫ్యాక్టరీలకు రూపకల్పన చేసేటప్పుడు, వాటిని నిర్మించేటప్పుడు, లేదా యిప్పుడున్నవాటి పనిని మెరుగు పరచేటప్పుడు, ప్రణాళికా సంస్థలూ, ఆర్థిక, రూపకల్పనా సంస్థలూ, మన కార్యకర్తలు యావన్మందీ ప్రకృతిని సంరక్షించే సమస్యను దృష్టిలో వుంచుకోవాలని పార్టీ గట్టిగా కోరుతూ వుంది. మనం మాత్రమే గాక, ముందు తరాలవారు కూడా, మన దేశం యొక్క అద్భుతమైన నైసర్గిక పరిసరాలు ప్రసాదించే అన్ని సంపదలనూ అనుభవించ గలగాలి. ప్రకృతి రక్షణకూ, ప్రకృతి వనరుల హేతుబద్ధ వినియోగానికీ సంబంధించిన సమిష్టి, అంతర్జాతీయ పథకాల్లో పాల్గొనేందుకు కూడా మనం సిద్ధమే.

## పారిశ్రామికోత్పత్తి స్వరూపాన్ని మెరుగుపరచేందుకోసం, దాని ఫలదాయకతను పెంచేందుకోసం

కామ్రేడ్స్, ఉత్పత్తి యొక్క ఫలదాయకతను పెంచే విధానం, ఆర్థిక శాఖలమధ్య అత్యంత ఫలప్రదమైన నిష్పత్తులను సాధించేందుకు ఉద్దేశించిన అనేక ముఖ్యమైన, జటిలమైన కర్తవ్యాలను ముందుకు తెస్తున్నది.

ఆర్థిక పెరుగుదల వేగాలు, ఆర్థికాభివృద్ధికీ, జీవన ప్రమాణాన్ని పెంచేందుకూ అవసరమైన నిధులు పోగుపడే అవకాశమూ, వ్యవస్థా నిర్మాణ సమస్యలనుసరిగా పరిష్కరించటంపై అనేక విధాల ఆధారపడి వున్నవి. పెట్టుబడి పెట్టిన ప్రతి ఒక్క రూబుల్ ఫలితం, కొన్ని శాఖల్లో కంటే మరికొన్ని యితర శాఖల్లో ఎక్కువగా వుంటుందనీ, పెట్టుబడి కొన్ని శాఖల్లో యితర వాటికంటే త్వరగా తిరిగి వస్తుందనీ, అందరూ ఎరుగుదురు. ఏ ఆర్థిక వ్యవస్థలో నైనాసరే, మన ఆర్థిక వ్యవస్థ లాంటి భారీ ఆర్థిక వ్యవస్థలో మరింతగా ఈ విషయాన్ని మనస్సులో పెట్టుకోవాలి.

వ్యవసాయము, వాడకం వస్తువులను తయారుచేసే పరిశ్రమలు, సేవా పరిశ్రమలు —వీటి సత్వరాభివృద్ధి ప్రజలకు పాదార్థిక లాభాలను పెంచటం మాత్రమే కాదు; మన ఆర్థికవ్యవస్థలోని నిష్పత్తులను మెరుగు పరచేందుకు, ఆర్థికవ్యవస్థలో సమతూకాన్ని

ఏర్పరచేందుకు, జాతీయాదాయమూ, నిధులు పోగుకావటం పెరిగేందుకు గల వనరులను విస్తరింప జేసేందుకూ, డబ్బు చెలామణిని పెంచేందుకూ కూడా యిది తోడ్పడుతుంది.

భారీ పరిశ్రమల వ్యవస్థా నిర్మాణం మెరుగు అయినందువల్ల ఉత్పత్తి యొక్క ఫలదాయకతను పెంచేందుకు గణనీయమైన శక్తి స్తోమతలు లభ్యమవుతాయి. ఉత్పత్తి ఖర్చులను తగ్గించే, తుది రూపంలోని సరకుల ఉత్పత్తిని అధికంచేసే, భారీ పరిశ్రమల్లోనూ, యితర పరిశ్రమల్లోనూ శ్రామిక ఉత్పాదకశక్తిని ఎక్కువచేసే వివిధ పారిశ్రామిక శాఖల సత్వరాభివృద్ధి యిందులో గర్భితం.

రానున్న సంవత్సరాల్లో పారిశ్రామిక ఉత్పత్తి రంగ ఫలదాయకతను పెంచే కృషి అనేక మౌలికమైన దిశల్లో ముందుకు సాగాలి. ఉత్పత్తి యొక్క ప్రామాణిక పరిమాణం ఒక్కింటికి ఖర్చు అయ్యే పదార్థాలను తగ్గించటం, ముడి పదార్థాలూ మొదలయిన వాటిని పొదుపు చేయటం యిందులో ఒకటి. ఇది నిజంగా జాతీయ ప్రాముఖ్యం గల విషయం.

జాతీయార్థిక వ్యవస్థ అభివృద్ధివల్ల, వివిధ రకాల ముడి పదార్థాల అవసరం వేగంగా పెరుగుతుంది. ఈ అవసరాన్ని తీర్చేందుకు గని పరిశ్రమలను అధిక వేగంతో విస్తరింపజేయటం కొనసాగించాలి. ఈ సందర్భంలో ఈ గనులు మరింత ఫలదాయకంగా పనిచేసేలాగా, ముడి పదార్థాలను శుద్ధి చేయడం మరింత పూర్తిగా జరిగేలాగా, నాణ్యతను పెంచేలాగా, దుబారాను తగ్గించేలాగా కృషి చేయడం ముఖ్యం. అయితే, ఒక సంగతి మనస్సులో పెట్టుకోవాలి. అదేమంటే సరకులను తయారుచేసే పరిశ్రమల్లో కంటే, గని పరిశ్రమల్లో ఉత్పత్తి ప్రామాణిక పరిమాణం ఒక్కింటికి ఎక్కువ పెట్టుబడీ, ఎక్కువ శ్రమా అవసరం.

పర్యవసానం ఏమంటే, సరకులను ఉత్పత్తిచేసే పరిశ్రమల్లో ఉత్పత్తిని నిర్దుష్టం చేయటంద్వారా, ముడి సరకులను పొదుపుచేయటం, అదనంగా ఆ మేరకు ముడి సరకులను ఉత్పత్తి చేయటంకంటే, జాతీయార్థిక వ్యవస్థ దృష్ట్యా చాలా ఎక్కువ లాభదాయకంగా వుంటుంది. దేశ వ్యాపిత స్థాయిలో ఉత్పత్తి ప్రామాణిక పరిమాణం ఒక్కింటికి ముడి పదార్థాల వాడకాన్ని, కేవలం ఒక శాతం తగ్గించినా, అందువల్ల జాతీయాదాయం అదనంగా 3-4 వేల మిలియన్ రూబుళ్ళ మొత్తం పెరుగుతుంది.

శ్రామిక బలగం వనరులను మరింత హేతుబద్ధంగా వుపయోగించటం, ముఖ్యంగా కాయకష్టాన్నీ, శారీరకంగా కష్టమైన పనులనూ తగ్గించటం ద్వారా, శ్రమ వినియోగాన్ని తగ్గించటం, ఉత్పత్తిని మరింత ఫలదాయకం చేసే మరో మార్గం. ఉత్పత్తి క్రమాలనూ, ఫ్యాక్టరీలలో శ్రమ వ్యవస్థీకరణనూ మెరుగుపరచడమే గాక, కాలం చెల్లిన యంత్రాలను మార్చే, వాటి స్థానంలో కొత్తవాటిని ప్రవేశపెట్టే వేగాన్ని ముమ్మరంచేసే పరిశ్రమల సర్వతోముఖ అభివృద్ధి కూడా అవసరం. అధిక ఉత్పత్తి దాయకమైన కొత్త

యంత్రాలను, వివిధ పనులను సమగ్రమైన యాంత్రికీకృతం చేయడానికీ, స్వయంచలిత ఉత్పత్తి ప్రక్రియలకూ వీలు కలిగించే సంపూర్ణ యంత్ర వ్యవస్థలను తయారుచేసే పరిశ్రమలకు యిది వర్తిస్తుంది. పరిశ్రమలకు సాంకేతిక సేవలను సమకూర్చే శాఖలను విస్తరింప జేయటమూ, అనుబంధ పనులను యాంత్రికీకృతం చేయటమూ కూడా చాలా ముఖ్యం.

సరకుల నాణ్యాన్ని మెరుగుపరచటమూ, అందుకు అనుగుణంగా ఈ సమస్యను పరిష్కరించేందుకు తోడ్పడగల ఉత్పత్తి రంగాలను అభివృద్ధి పరచటమూ మూడో మార్గం. యావత్తు జాతీయార్థిక రంగంపైనీ దాని ప్రభావాన్ని దృష్టిలో పెట్టుకొని చూస్తే, నేటి పరిస్థితుల్లో మేలైనది, అంటే దాదాపు ఎల్లప్పుడూ అధికమైనది అని కూడా అర్థం. నిర్ణీతఉత్పత్తి కార్యక్రమాన్ని దానంతకదే నెరవేర్చగల ఒక అధునాతన యంత్ర సాధనం పాత నమూనా యంత్రాలు పదింటికి సమానం; అధిక వాహకశక్తి గల ఒక లారీ ఎన్నో మామూలు లారీలకు సమానం; దీర్ఘకాలం పని చేయగల ఒక విమానం యింజను రెండు లేదా మూడు పాతవాటికి సమానం అవుతున్నవి.

పారిశ్రామికోత్పత్తి యొక్క ఫలదాయకతను పెంచేందుకూ, దాని వ్యవస్థా నిర్మాణాన్ని మెరుగు పరచేందుకూ, అంతస్సంబంధం గల పరిశ్రమల సముదాయాలను మెరుగుపరచే పంథాను చేపడుతున్నాం. వీటిఅభివృద్ధి ఒక నిర్దిష్ట కార్యక్రమాన్ని అనుసరించి సాగుతుంది.

ఇంధన, విద్యుచ్ఛక్తి పరిశ్రమలను తక్కిన వాటికన్నా అధిక ప్రాధాన్యమిచ్చి ఫలప్రదంగా అభివృద్ధిపరచటం, వచ్చే ఐదేళ్ళలోని మరో కీలక లక్ష్యం. అందుకు సంబంధించిన శాఖల వ్యవస్థా నిర్మాణాన్ని మెరుగుపరచటం ద్వారానూ, అన్నిటికంటే ఆశాజనకమైనవీ, ఆర్థికంగా ఫలదాయకమైనవీ అయినవాటి పెరుగుదలను వేగిర పరచటం ద్వారానూ మన మీ లక్ష్యాన్ని సాధించాలి. ప్రప్రధానంగా దీని అర్థం ఏమంటే, దేశంలోని యింధనాల్లో నూనె, గ్యాసు వాటాను పెంచాలి; బొగ్గు పరిశ్రమకు కొత్త సాంకేతిక సాధన సామగ్రిని సమకూర్చాలి; బాగా పొదుపయిన జలవిద్యుత్ థర్మల్, విద్యుత్కేంద్రాలను ప్రారంభించాలి; మరిన్ని అణువిద్యుత్ కేంద్రాలను నిర్మించాలి: విద్యుత్ కేంద్రాల ఆర్థిక ఫలదాయకతను పెంచాలి.

లోహకార, యింజినియరింగ్ పరిశ్రమలు బాధ్యతాయుతమైన కర్తవ్యాలను నెరవేర్చవలసి వుంది. వీటి విషయంలో కూడా ఉత్పత్తి అధిక ఫలదాయకంగా వుండేలా చేసే అంశాలకు ప్రథమస్థానం యివ్వటం జరుగుతూ వుంది.

ఇందుకు ఉత్పత్తి ప్రక్రియలను మెరుగు పరచడం, లోహకార ఫ్యాక్టరీలను ఆధునికీకరించడం, వివిధ లోహాల నాణ్యతనూ, గ్రేడ్లలో పై విధ్యాన్నీ మెరుగు పరచే, సున్నిత

మైన ఆకారాల్లో వుండే వస్తువుల, అవసరమైన పరిమాణాల్లో వుండే లోహపు ముక్కల ఉత్పత్తిని అధికంచేసే పరిశ్రమ రంగాలను విస్తరింప జేయటమూ అవసరం.

ఇంజనియరింగ్ పరిశ్రమలు కూడా ఈ పద్ధతుల్లోనే అభివృద్ధి చెందాలి. ఎక్కువ శక్తివంతమైన, ఎక్కువ పొదుపైన, ఎక్కువ సున్నితమైన, నమ్మకోదగిన యంత్రాల, సాధనాల ఉత్పత్తిని పెంచేందుకు అవి శ్రద్ధ వహించాలి. ఫోర్జి, ప్రెస్, ఫౌండ్రీ, కూర్పు యంత్రాల వాటాను పెంచాలనీ, నిర్ణీత కార్యక్రమాన్ని వాటంతకవే నేరవేర్చగల యంత్ర సాధనాల, స్వయంచలిత, అర్ధ స్వయంచలిత ట్రాన్స్‌ఫర్ లైన్ల ఉత్పత్తిని విస్తరింప జేయాలనీ ప్రణాళికలో తలపెట్టారు.

ఎలక్ట్రానిక్స్, రేడియో పరిశ్రమ, పని ముట్ల తయారీ, అంటే ఉత్పత్తినీ, మేనేజిమెంటునూ స్వయంచాలనం చేసేందుకు సాంకేతిక ప్రాతిపదికను సమకూర్చే పరిశ్రమల సముదాయం యావత్తూ వేగంగా అభివృద్ధి చెందుతూనే వుంటుంది. ఈ సముదాయాన్ని శాస్త్ర, సాంకేతిక ప్రగతిని వేగిరపరచే శక్తిగా అభివర్ణించటం సరిగానే వుండవచ్చు. వచ్చే ఐదేళ్ళలో సున్నితమైన ఎలక్ట్రానిక్ కంప్యూటర్ల భారీ ఉత్పత్తికి ప్రత్యేక ప్రాముఖ్యం వుంటుంది.

కొత్త పంచవర్ష ప్రణాళికా కాలంలో, రసాయన, పెట్రో రసాయన పరిశ్రమాభివృద్ధి గురించి చాలా శ్రద్ధ తీసుకుంటున్నాము.

ఆర్థిక రంగ రసాయనికీకరణ సామాజిక ఉత్పత్తి ఫలదాయకతను పెంచేందుకు ఒక శక్తివంతమైన సాధనం. ఆర్థిక వ్యవస్థయొక్క చాలా శాఖల్లో రసాయనాలను ఎన్నో విధాలుగా, ఖరీదయిన సహజ ముడి పదార్థాలకు బదులుగా, సరకుల నాణ్యతను మెరుగు పరచేందుకు, శ్రామిక ఉత్పాదకశక్తిని పెంచేందుకు వుపయోగించవచ్చు.

కలప, వడ్రంగం, కాగితం గుజ్జు, కాగితం పరిశ్రమల్లో ఉత్పత్తి వ్యవస్థీకరణను సమూలంగా మార్చేందుకు యిటీవలి సంవత్సరాల్లో కృషి ప్రారంభించారు. కలప కొట్టడాన్ని పెద్దగా విస్తరింప జేయకుండానే:కలప, కలపగుజ్జు, కాగితం అట్టలు, ఫర్నిచర్, ఫైబర్ బోర్డు—ఈ పరిశ్రమల నుంచి తుది రూపంలో లభించే ఉత్పత్తులను, గణనీయంగా పెంచ వలసి వుంది.

ఆర్థికాభివృద్ధి ప్రస్తుత దశలో, ఉత్పత్తి ప్రక్రియలకు తోడ్పడే జాతీయార్థిక వ్యవస్థ శాఖల పాత్ర పెరుగుతూ వుంది. రవాణా, వార్తా ప్రసారాలు, పాదార్థిక సాంకేతిక సరఫరాలు మొదలయిన వాటికి సంబంధించిన పరిశ్రమలు వీటిలో కొన్ని. మన ప్రజల్లో దాదాపు 16 మిలియన్‌ల మంది పని చేస్తున్న ఈ శాఖల కృషి మీద ఆర్థిక వ్యవస్థ ఫలదాయకత చాలవరకు ఆధారపడి వుంది. ఈ రంగంలో గణనీయమైన విజయాలు సాధించబడి నప్పటికీ, దాన్ని నిరంతరం మెరుగుపరచ వలసి వుంది. దాని

అభివృద్ధిని, పెరుగుతున్న ఉత్పత్తి పరిమాణానికీ, జటిలతకూ సరితూగేలా చేయవలసి వుంది.

ఉదాహరణకు రవాణా పరిశ్రమలోని పని నేటి అవసరాలను తీర్చలేకుండా, అడ్డంకిగా తయారైంది. ఇందుకు గల కారణాల్లో ఒకటి స్పష్టం. అది, గడచిన అయిదు సంవత్సరాలలో రవాణా పరిశ్రమాభివృద్ధికి తగినంతగా నిధులను కేటాయించక పోవటం.

ఈ పరిస్థితిని చక్కదిద్దేందుకు 9 వ పంచవర్ష ప్రణాళికా కాలంలో చర్యలు తలపెట్టారు. కొత్త రైల్వే ట్రంకు లైన్లను, స్టేషన్లలోని అనుబంధ లైన్లను నిర్మించాలనీ, వాటిపై రైళ్ళ రాకపోకలను పెంచాలనీ, ప్రణాళికలో తలపెట్టారు. కొత్త మోటారు రోడ్లనూ, పైపు లైన్లనూ నిర్మించాలనీ, సముద్ర, నదీ వర్తక నౌకాదళాలను విస్తరింపజేయాలనీ కూడా తలపెట్టారు. కామానదిపై,సంవత్సరానికి 150 వేల భారీ వాహక శక్తిగల లారీలను ఉత్పత్తి చేయగల ఒక పెద్ద కర్మాగారం నిర్మాణం ఆరంభమైంది; మరో మోటారు వాహనాల కర్మాగారాన్ని కూడా నిర్మించుతారు; అబకాన్‌లో రైలు పెట్టెలను నిర్మించే ఒక పెద్ద ఫ్యాక్టరీ నిర్మాణస్థలంలో పని ప్రారంభమైంది. మన దేశం చాలా విశాలమైంది. ఆ కారణంగా విమాన రవాణాను మరింతగా అభివృద్ధిపరచడం యొక్క ప్రాధాన్యత నిరంతరం పెరుగుతూ వుంది. బాగా పొదుపైన, వసతయిన కొత్తరకం విమానాలను పనిలో పెట్టాలి; విమానాశ్రయాలలోని భూతల సదుపాయాలను మెరుగు పరచాలి. "ఏరో ఫ్లోట్" యిప్పటికే ప్రపంచంలో కెల్లా పెద్ద విమానయాన సంస్థగా వుంది. కొత్త పంచవర్ష ప్రణాళికాకాలంలో అది 500 మిలియన్ ప్రయాణీకులనూ, 11 మిలియన్ టన్నుల సరకునూ చేరవేస్తుంది. మన పౌర విమానాలు వ్యవసాయానికీ, ఆరోగ్య సౌకర్యాలకూ, అటవీ సంరక్షణకూ సాయపడుతున్నవి; భూగర్భ సర్వేలో పాల్గొంటున్నవి. వాటి యిలాంటి కార్యకలాపాల ప్రాధాన్యం మరింత పెరుగుతుంది. అన్ని రకాల రవాణా సాధనాలనూ మరింత అభివృద్ధి పరచటంతో బాటు, వాటిని మరింత సమన్వయీకృతంగా పని చేయించవలసిన అవసరమూ, దేశాని కంతటికీ ఒకే ఒక, అత్యంత సమర్థమైన రవాణా వ్యవస్థను ఏర్పరచవలసిన అవసరమూ కూడా వుంది.

సరికొత్త శాస్త్ర, సాంకేతిక విజయాలను ఆధారం చేసుకొని రేడియో, టెలివిజన్ మొదలయిన అన్ని రకాల వార్తా ప్రసార సాధనాలను అభివృద్ధి పరచాలి.

విదేశాలతో ఆర్థిక సంబంధాల వ్యవస్థను మెరుగు పరచి నందువల్ల ఆర్థికవ్యవస్థ ఫలదాయకతను పెంచేందుకు గణనీయంగా అవకాశం లభిస్తుంది. సోషలిస్టు దేశాల కుటుంబం ఆర్థిక పటిష్టతకూ, వివిధ రాజ్యాల శాంతియుత సహజీవనం యొక్క ఆర్థిక ప్రాతిపదికను బలపరచేందుకూ సంబంధించిన రాజకీయ అంశాలను బట్టీ, ఆర్థిక వ్యవస్థ యొక్క అవసరాల నుంచీ ఉత్పన్న మవుతున్న అంశాలను బట్టీ, అన్ని పారిశ్రామిక రంగాల్లోనూ ఎగుమతి సరకుల ఉత్పత్తిని పెంచటం ముఖ్య మవుతూ వుంది. అవసరమైన సర

కుల దిగుమతిని పెంచేందుకు కూడ యిది సహాయపడుతుంది. అంతర్జాతీయ ఆదాన ప్రదానాల విస్తరణ, మన పరిశ్రమ అంతటినీ మెరుగుపరచే కృషిమీద సత్ ప్రభావం కలిగించగల దనటంలో సందేహం లేదు.

ఇతర దేశాలతో ఆర్థిక, శాస్త్ర, సాంకేతిక సంబంధాల పాత్ర పెరుగుదలకు కొన్ని చర్యలు అవసరమనేది నిశ్చయం. విదేశాలతో ఆర్థిక కార్యకలాపాలన్నిటి నిర్వహణను మెరుగు పరచటం, ముఖ్యమైన ఈ రంగంలో సంకుచిత ప్రాంతీయ దృష్టిని నిర్మూలించటం ఈ చర్యల లక్ష్యంగా వుండాలి. ఉత్పత్తినీ, వాణిజ్య విధులనూ జోడించటం మీద విదేశ ఆర్థిక కార్యకలాపాలు అధికాధికంగా ఆధారపడాలి. ప్రపంచ మార్కెట్ అవసరాలకూ, అవకాశాలకూ వెంటనే ప్రతిస్పందించేందుకూ, మన ఆర్థికాభివృద్ధి ప్రయోజనాలకై వాటిని సాధ్యమైనంత ఎక్కువగా వినియోగించుకునేందుకూ యిది అవసరం.

## ఉత్పత్తి ఆస్తుల, పెట్టుబడుల వినియోగాన్ని మెరుగుపరచేందుకు

కామ్రేడ్స్, సోవియట్ యూనియన్‌కు యిప్పుడు అపారమైన ఆర్థికశక్తి స్తోమతలున్నవి; ఈ శక్తిస్తోమతలను, అన్నిటికన్నా ముఖ్యంగా యిప్పుడు పనిలో వున్న ఉత్పత్తి ఆస్తులను ఎలా వుపయోగించుతామనే విషయంపైనే మన ఆర్థిక వ్యవస్థయొక్క ఫలదాయకత అధికాధికంగా ఆధారపడుతూ వుంది. ఈ ఆస్తుల వినియోగాన్ని మెరుగు పరచడమూ, ఉత్పత్తికీ, ఆస్తికీ మధ్యవుండే నిష్పత్తిని పెంచడమూ, గత ఐదేళ్ళలో మన పరిశ్రమలు ఈ విషయంలో కొంత అభివృద్ధి సాధించినప్పటికీ, ఈనాటికీ ఒక ముఖ్య కర్తవ్యంగానే వుంది.

పారిశ్రామిక సంస్థల్లో షిఫ్టుపద్ధతివల్ల చేకూరే అదనపు లాభాలు తక్కువగా వుండటం అన్న ఒక్క సమస్యను మాత్రమే ఈ సందర్భంలో మీ దృష్టికి తేగోరుతున్నాను. ఈ విషయాన్ని పార్టీ 23 వ మహాసభలోనూ, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ యొక్క అనేక విస్తృత సమావేశాల్లోనూ చర్చించడం జరిగింది. కాని, యిందుకు సంబంధించిన పరిస్థితి, ముఖ్యంగా యింజినియరింగ్ పరిశ్రమలో బొత్తిగా మెరుగు కాలేదు. కొన్ని ఆర్థిక సంస్థలు, షిఫ్టుల సంఖ్యను పెంచటానికి బదులు, కొత్త ఫ్యాక్టరీలను అధికాధికంగా నిర్మించ గోరుతున్నవి. షిఫ్టుల సంఖ్యను పెంచటమన్న సమస్యను తెచ్చినప్పుడు మానవ బలగం కొరతను ప్రస్తావించి, అడ్డు చెప్పటం జరుగుతూ వుంది. అయితే, కొత్త ఫ్యాక్టరీల్లో పని చేసేది ప్రజలా, దేవతలా అని మనం ప్రశ్నించవచ్చు. కామ్రేడ్స్, ఇది సరికాదు. మనం ఈ సమస్యను మరింత కచ్చితంగా పరిష్కరించాలి. యంత్రాలను మరింత పూర్తిగా వినియోగించుకొనేలా కొన్ని చర్యలను రూపొందించాలి, అమలు పరచాలి. ఆయా ఫాక్టరీల్లోని పార్టీ కమిటీలు, నగర, మండల పార్టీ కమిటీలు ఈ విషయంపై నిరంతర నియంత్రణ అమలు జరిపేలా చేయాలి.

మన ఆర్థికవ్యవస్థకు సంబంధించిన ఒక అత్యవసర సమస్యను, అంటే పరిశ్రమాదుల నిర్మాణానికి సంబంధించిన సమస్యను పరిష్కరించేందుకు యిది మనకు సాయపడుతుంది.

పాదార్థిక ఉత్పత్తి రంగంలో, మన మిప్పుడు ప్రపంచంలోని మరే దేశంలోనూ లేనంతగా నిర్మాణం సాగిస్తూ వున్నాం. ద్నీపర్ జల విద్యుత్కేంద్రం, మాగ్నితో గొర్స్క్ యినుము, ఉక్కు ఫ్యాక్టరీ, వోల్గోగ్రాద్, ఖార్కొవ్‌లలోని ట్రాక్టర్ ఫ్యాక్టరీలు —వీటిని పనిలో పెట్టడం, మన చరిత్రలో ఎంత ముఖ్య ఘటనలో వయోవృద్ధులకు గుర్తు వుంటుంది. అంతకంటే పెద్దవీ, సాంకేతికంగా మరింత పురోగామిశీలమైనవీ అయిన ఫ్యాక్టరీలనూ, ప్రాజెక్టులనూ ఎన్నిటినో ఇప్పుడు, ఏటేటా పనిలోపెడుతున్నాం. ప్రపంచంలో కెల్లా పెద్దదయిన క్రాస్నొయార్స్క్ జల విద్యుత్కేంద్రం; అద్వితీయమైన కొనకొవొ, బుర్‌ష్తిన్, క్రివొయ్ రాగ్ థర్మల్ విద్యుత్కేంద్రాలు; పశ్చిమ సైబీరియా, కారగండాల్లోని బ్రహ్మాండమయిన యినుము, ఉక్కు ఫ్యాక్టరీలు; త్యుమెన్ మండలంలోని, పశ్చిమ కజక్‌స్తాన్ లోని నూనె పరిశ్రమ సముదాయాలు; వోల్గా కార్ల ఫ్యాక్టరీ, పావ్లొదార్ ట్రాక్టర్ల ఫ్యాక్టరీ; బ్రహ్మాండమయిన రసాయన పరిశ్రమ సముదాయాలు, ఫ్యాక్టరీలు, బ్రాత్‌స్క్, సిక్తివ్కర్ కలప పరిశ్రమ సముదాయాలు—ఇటీవలి సంవత్సరాల్లో పూర్తి అయిన ప్రధాన ప్రాజెక్టుల్లో యివి కొన్ని. చెర్నొగొర్స్క్ ఉన్ని దారం మిల్లు, కుర్‌స్క్ అల్లిక దుస్తుల ఫ్యాక్టరీ నిర్మాణమూ, తేలిక రకం, ఆహార పరిశ్రమల రంగానికి చెందిన మరికొన్ని భారీ ఫ్యాక్టరీల నిర్మాణమూ పూర్తి అయింది.

అయినప్పటికీ, పరిశ్రమాదుల నిర్మాణం విషయంలో పరిస్థితి సంతృప్తికరంగా వున్నట్లు భావించ వీల్లేదు. క్లుప్తంగా చెప్పాలంటే సమస్య ఏమంటే, విస్తారమైన మొత్తాలను ఖర్చు పెడుతున్నాం. లాభాలు వేగంగా రావటం లేదు; వచ్చిన లాభాలు కూడా వుండవలసిన దానికంటే తక్కువగా వుంటున్నవి. ఇందుకు ఎన్నో కారణాలు వున్నవి.

ఈ కారణాల్లో ఒకటి యిది; ప్రణాళికలను తయారు చేసినప్పుడు పరిశ్రమాదుల నిర్మాణం విషయంలో విపరీతమైన పెద్ద పరిమాణాలనూ, వాస్తవంగా వున్న అవకాశాలను లెక్కలోకి తీసుకోకుండా విపరీతమైన పెద్ద సంఖ్యలో ప్రాజెక్టులనూ తలపెట్టటం జరుగుతూ వుంది. ఫలితంగా నిధులు చెల్లాచెదు రవుతున్నవి, అసంపూర్ణంగా వున్న ప్రాజెక్టుల సంఖ్య పెరుగుతూ వుంది, విస్తారమైన వనరులు వుపయోగపడకుండా స్తంభించి పోతున్నవి.

ప్రభుత్వ ప్రణాళికలను పరిశీలించినప్పుడల్లా, వివిధ మంత్రిత్వశాఖల, యూనియన్ రిపబ్లిక్కుల అభ్యర్థనల్లో కోత పెట్టడం అవసర మవుతూ వుంది. కాని, ఈ ప్రణాళికలు కూడా అంతా పూర్తి కావటం లేదు. అయినప్పటికీ చాలమంది కామ్రేడ్స్ అతిశయోక్తి

లతో కూడిన అభ్యర్థనలను సమర్పిస్తూనే వున్నారు. ఈ పద్ధతిని అంతం చేయాల్సిన సమయం వచ్చింది. మనకు వున్న సాధన సంపత్తినిబట్టి నిర్మాణం సాగించాలి, జీవించాలి.

పెట్టుబడుల్లో గణనీయమైన భాగాన్ని హేతుబద్ధం కాని విధంగా పంపిణీ చేయటం, చిక్కులకు మరో కారణం. ఫ్యాక్టరీలను పునర్నిర్మించటం, వాటిని సాంకేతికంగా ఆధునికీకరించటం ద్వారా ఉత్పత్తి పెరిగేలా చేయటం సర్వసాధారణంగా ఆర్థికంగా ఎక్కువ లాభదాయక మైనదని అనుభవం నిరూపిస్తూ వుంది. కాని యిప్పటికీ గూడా, నిధుల్లో చాలా ఎక్కువ భాగాన్ని కొత్త ప్రాజెక్టులకోసం వెచ్చించటమూ, ఉత్పత్తిని ఆధునికీకరించేందుకూ, కొత్త యంత్రాలను అమర్చేందుకూ బొత్తిగా తక్కువ భాగాన్ని వుపయోగించటమూ జరుగుతూ వుంది. ఫలితంగా చాలా ఫ్యాక్టరీల పునర్నిర్మాణం సహించ రానంతగా ఈడిగిలపడుతూ వుంది. ఇప్పుడు పని చేస్తున్న ఫ్యాక్టరీల విస్తరణకూ, పునర్నిర్మాణానికీ, వచ్చే ఐదేళ్ళ కాలంలో ప్రాధాన్యమివ్వాలి.

చివరి విషయం. అసలు నిర్మాణంలోనే ప్రధాన లోపాలున్నవి. ప్రణాళికా, ద్రవ్య క్రమశిక్షణలను కొన్ని సందర్భాల్లో ఉల్లంఘించటం జరుగుతూ వుంది. కొత్త, ఫలదాయక మైన వస్తువులనూ, నిర్మాణ సామగ్రినీ తగినంతగా వుపయోగించటం లేదు. నిర్మాణంలో నాణ్యత లోపిస్తున్నది. ప్లాన్లు, అంచనాలూ లేకుండా, ఆర్థిక కార్య నిర్వహణాధికారులెవరూ కొత్త ప్రాజెక్టుల నిర్మాణం ప్రారంభించ రాదన్నది ఒక నియమంగా అమలు జరగాలి.

పరిశ్రమాదుల నిర్మాణానికి సంబంధించిన వ్యవహారాలను, పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ మంత్రిమండలీ, యిటీవలి సంవత్సరాల్లో సవివరంగా, సమగ్రంగా వివేచించి, కొన్ని నిర్ణయాలు చేశాయి. ఇవి నిర్మాతల కృషిని అంచనా కట్టేందుకు సంబంధించిన సూత్రాన్నే మార్చివేస్తున్నాయి. తుదిరూపంలో లభించే ఫలితాలు, కొత్త ఫ్యాక్టరీలను పనిలో పెట్టడం, వివిధ మధ్యంతర దశలను గాక యావత్తు నిర్మాణ పరిమాణాన్నీ పూర్తి చేయడం—వీటిపై ఆ అంచనా ఆధారపడాలి.

అయినప్పటికీ, పరిశ్రమాదుల నిర్మాణానికి సంబంధించిన పరిస్థితిని సమూలంగా మెరుగు పరచేందుకు, జాతీయార్థిక వ్యవస్థలోని ఈ ముఖ్య రంగంతో సంబంధం కలిగి వున్న పార్టీ సంస్థలూ, స్వయంగా నిర్మాతలూ చేయవలసింది ఎంతో వుంది.

* * *

కామ్రేడ్స్, ఉత్పత్తిని మరింత సమర్థవంతంగా నిర్వహించేందుకూ, ఆర్థికాభివృద్ధిని త్వరితంచేసేందుకూ, మనకు మూలనిధులు వున్నవనీ, అవి చాల గణనీయమైనవి కూడా ననీ, మన జాతీయార్థిక వ్యవస్థకు గల అవకాశాల గురించిన వివేచన నిరూపిస్తూ వుంది. ఇదివరకే చెప్పినట్లు, శాస్త్ర, సాంకేతిక ప్రగతి, జాతీయార్థిక వ్యవస్థా నిర్మాణాన్ని మెరుగు పరచటం, ఉత్పత్తి ఆస్తులను మరింత సంపూర్ణంగా వుపయోగించటం, పరిశ్రమాదుల

నిర్మాణాన్ని మెరుగు పరచటం అన్నవి ఈ నిధులు. ఇవి అంతటితోనే పూర్తి కాలేదు. ప్రతి ఒక్క ఫ్యాక్టరీలోనూ, ప్రతి ఒక్క సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయక్షేత్రంలోనూ అవి వున్నవి.

నా మనస్సులో వున్నది ఏమిటీ అంటే, పని గంటల నష్టాన్ని తొలగించాలి; సిబ్బంది నిలకడగా వుండక పోవటాన్ని తగ్గించాలి; పనిలో క్రమబద్ధత లేకపోవడాన్నీ, యంత్రాలు ఖాళీగా పడివుండటాన్నీ నివారించాలి. ముడి పదార్థాలు మొదలయిన వాటినీ, యింధనాన్నీ, విద్యుచ్ఛక్తినీ పొదుపుచేయటం, యంత్రాలను, యంత్ర పరికరాలను, ట్రాక్టర్లను, నూర్పిడి యంత్రాలను, మోటారు వాహనాలను జాగ్రత్తగా పని చేయించటం —ఈ విషయాలకు చాలా ప్రాముఖ్యం వుంది. ఈ నాడు మన దేశంలో వివిధ యంత్రాలు ఎంతగా వున్నవంటే వాటిని సమర్థతతో వుపయోగించకపోతే, పూర్తిగా వుపయోగించక పోతే మనం ఈ యంత్ర సముదాయం పని చేసే కాలాన్ని తగ్గించే ధోరణికి పాల్పడగలము. ఇది అసమర్థనీయం. ఇందువల్ల ప్రజల ప్రయోజనాలకు చాలా నష్టం వాటిల్లుతుంది. విడి విడిగా ఒక్కొక్క ఫ్యాక్టరీనీ, లేదా సమిష్టి వ్యవసాయ క్షేత్రాన్నీ తీసుకుంటే, పొదుపు సాధించేందుకు చేసే ప్రయత్నంవల్ల లభించేది కొన్ని వందల, వేల రూబుళ్ళు కావచ్చు. కాని మొత్తం జాతీయ ఆర్థిక వ్యవస్థను తీసుకుంటే, యిది అనేకవందల, వేల, మిలియన్ల రూబుళ్ళు అవుతుంది.

ఉత్పత్తికి సంబంధించిన మూలనిధులను మెరుగుపరచటం, జాతీయార్థిక వ్యవస్థలో పొదుపు సాధించే కృషిని ముమ్మరం గావించటం గురించి ఒక సంవత్సరం క్రితం సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, సోవియట్ యూనియన్ మంత్రిమండలి, ట్రేడ్ యూనియన్ల అఖిల యూనియన్ కేంద్ర సమితి, అఖిల యూనియన్ లెనినిస్టు యువజన సంఘ కేంద్రకమిటీ సోవియట్ ప్రజల నుద్దేశించి ఒక లేఖను ప్రచురించాయి. ఈ లేఖ ఆధారంగా పెద్ద పెట్టున, బ్రహ్మాండమైన కృషి సాగింది. చక్కటి ఫలితాలు లభించాయి. కాని మూల నిధు లన్నిటినీ వుపయోగంలోకి తేవటానికి, పొదుపు కృషిని పెంచటానికి, మేనేజిమెంటులోని అవక తవకలను, దుబారాను, వృథా ఖర్చులను ఎదుర్కోవటానికి, ఒక స్వల్పకాలిక ఉద్యమం సరిపోదు. పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక, ట్రేడ్ యూనియన్, కమ్యూనిస్టు యువజన సంస్థలు తమ రోజువారీ కార్యకలాపాల్లో అనుసరించవలసిన ముఖ్యమైన పంథాల్లో యిది ఒకటి. ఈ దిశలో కృషిని సాగించేందుకు మన శక్తినంతా ధారపోయాలి.

కొత్త పంచవర్ష ప్రణాళికలోని కర్తవ్యాలు జయప్రదంగా పూర్తి కావాలంటే, ఆర్థిక సమస్యలపట్ల మన కార్యకర్తల వైఖరిలో ఖచ్చితమైన మార్పు రావడమూ, వారికి అలవాటైపోయిన కొన్ని భావనలను మార్చుకోవడమూ ముఖ్యమని నొక్కి చెప్పడం అవసరమని కేంద్రకమిటీ భావిస్తూంది.

చారిత్రక కారణాలవల్లనూ, మనం వుండిన పరిస్థితులను బట్టీ, పరిమాణాత్మకమైన అంచనాలకే ప్రాధాన్యం యిచ్చేలాగా అంతా పరిణమిస్తూ వచ్చింది. ఇన్ని టన్నుల ఉక్కు, ఇన్ని టన్నుల నూనె, ఇన్ని టన్నుల ధాన్యం, ఇన్ని ట్రాక్టర్లు ఉత్పత్తి చేయడం అన్నదే అసలు విషయంగా వుంటూ వచ్చింది. పరిమాణాత్మకమైన అంశం, మనకు ఈనాటికీ ప్రధానమైనదిగానే వుందన్న మాట నిజమే. కాని సరకుల నాణ్యతనూ, పారిశ్రామిక కార్యకలాపాల్లోని ఆర్థిక అంశాలనూ ప్రాభావితం చేసే సూచికలు మరింత పూర్తిగానూ, నికరంగానూ దీనికి తోడై వుండాలి. ఉదాహరణకు, ఒక నిర్వహణాధికారి ఉత్పత్తిని గురించి నివేదికను సమర్పించినప్పుడు, ఆ ఉత్పత్తికి అయిన ఖర్చును తేల్చినప్పుడు మాత్రమే, దానిని చక్కని ఆధారాలతో బేరీజు వేయడం సాధ్యమవుతుంది. ఖర్చు మరీ ఎక్కువగా వున్నా, ఆ అధికారి తనకు సంబంధించినంతవరకు ప్రణాళికను పూర్తి చేసి, ఫ్యాక్టరీలమధ్య సరఫరాలకు సంబంధించిన బాధ్యతల్లో విఫలుడై, తక్కిన పరిశ్రమలకు అన్యాయంచేసినా, ఒక విభాగంలో విజయం సాధించిన ఫలితంగా మరొక విభాగంలో ఉత్పత్తి బాగా పడిపోవడం జరిగినా, అటువంటి అధికారి విమర్శలకు పాత్రుడేకాని, ప్రశంసలకు అర్హుడుకాడు. పొరపాట్లు చేసినప్పుడూ, ఏదోఒక నేరం చేసినప్పుడూ మన నిర్వహణాధికారులను మనం విమర్శిస్తున్నాము. ఇది సరియయినదే. ఎందువల్లనంటే, నిష్కర్షగా వుండడంలో మన ప్రమాణాలను పెంచి తీరాలి. అయితే, పొరపాట్లను చేసినవారిని మాత్రమే కాకుండా, ఉత్పత్తిని పెంచేందుకు గల అవకాశా లన్నిటినీ వుపయోగించుకోలేక పోతున్న వారినీ, చొరవ చూపలేక పోతూన్నవారినీ, చేతులు ముడుచుకు కూర్చుంటున్న వారినికూడా విమర్శించాలని మనం భావిస్తున్నాము.

మన మందరమూ మన పనుల విషయంలోనూ, ఇతరుల పనుల విషయంలోనూ చూపే నిష్కర్షత ప్రమాణం ఎంత ఉన్నతమైనదిగా వుంటే, ప్రస్తుత పంచవర్ష కాలానికి పార్టీ ప్రతిపాదించిన ప్రణాళికను పూర్తిచేయడంలో అంత ఎక్కువ విజయం లభిస్తుంది.

## 4. ఆర్థిక మేనేజిమెంటు వ్యవస్థను మరింత మెరుగుపరచేందుకు

కామ్రేడ్స్, ఆర్థికరంగ మేనేజిమెంటు వ్యవస్థను మరింత మెరుగు పరచడం, పార్టీ యొక్క ఆర్థికవిధానానికి సంబంధించిన మూడవ కీలక సమస్య. ఆర్థిక, సామాజికాభివృద్ధి వేగాన్ని పెంచడంలోనూ, వున్న అవకాశాలు పూర్తిగా వినియోగమయేలా చూడడంలోనూ, పార్టీ విధానం యొక్క ప్రధాన లక్ష్యాల వెనుక లక్షలకొలది సమిష్టి సంస్థలనూ, కోట్లాది శ్రామిక ప్రజలనూ మరింత సన్నిహితంగా సంఘటిత పరచడంలోనూ సమాజం యొక్క కార్యకలాపాలను ఎంత చక్కగా సంఘటిత పరచాలి అన్నదే ఈ విషయం. అందుచేత, మేనేజిమెంటుకు సంబంధించిన సమస్యలు, కేవలం నిర్వహణాధికారుల చిన్న సముదాయాన్ని మాత్రమే కాకుండా, పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక సంస్థల నన్నిటినీ,

శ్రామిక ప్రజం సమిష్టి సంస్థల నన్నిటినీ ప్రాభావితం చేసే సమస్య. అంటే అర్థం, మేనేజిమెంటును అభివృద్ధి పరచడం అన్నది, ఆర్థిక రంగానికి సారథ్యం వహించడంలో పార్టీ యొక్క కార్యకలాపా లన్నిటిలోనూ ఒక ముఖ్యమైన అంతర్భాగ మన్న మాట. పార్టీ కేంద్రకమిటీ డిసెంబరు (1969) విస్తృత సమావేశం అవలంబించిన దృక్పథం అచ్చంగా యిదే.

మేనేజిమెంటుకు సంబంధించిన సమస్య లిప్పుడు ప్రత్యేకంగా అత్యవసరమైనవి కావడానికి కారణ మేమిటి?

ఇదివరకే తెలియజేసినట్లు, మన ఆర్థికరంగ స్థాయి నానాటికి పెరుగుతూ ఉండడం వల్లనూ, అందులో గుణాత్మకమైన మార్పులు రావడం వల్లనూ, మేనేజిమెంటు కొత్తవీ, మరింత ఉన్నతమైనవీ అయిన బాధ్యతలను నిర్వర్తించవలసిన అవసరం ఏర్పడడమూ, ఇప్పుడున్న మేనేజిమెంటు రూపాలూ, పద్ధతులూ, గతంలో బాగా ఉపకరించినవి అయినా కూడా, వాటితో తృప్తిపడి కూర్చోడానికి వీల్లేకపోవడమూ యిందుకు ముఖ్య కారణం.

మేనేజిమెంటును మరింత మెరుగు పరచేందుకు గల అవకాశాలు యిటీవలి కాలంలో బాగా పెరిగాయన్నది మనసులో ఉంచుకోవలసిన మరొక విషయం. మన కార్య కర్తల యొక్క, శ్రామిక ప్రజా బాహుళ్యం యొక్క జ్ఞానమూ, వృత్తి శిక్షణా మరింత ఉన్నతస్థాయిలో ఉండడమూ, మేనేజిమెంటు శాస్త్రమూ, ఎలక్ట్రానిక్ కంప్యూటర్ పద్ధతులూ వేగంగా అభివృద్ధి పొందడమూ యిందుకు కారణం.

ఇందుకు సంబంధించిన రాజకీయ అంశం కూడా చాలా ముఖ్యమయినదే. ఆర్థిక యంత్రాంగం అవిచ్ఛిన్నంగా పనిచేయడం, దేశంలో మంచి వ్యవహారసరళి వాతావరణాన్ని సృష్టించేందుకు తోడ్పడుతుంది. విశాల ప్రజానీకంలో శ్రామిక ఉత్సాహాన్ని పెంపొందింప జేస్తుంది. శ్రామిక ప్రజల చొరవ పెరిగేందుకు దారితీస్తుంది. ఎందువల్లనంటే, తమ శ్రమ ఆశించిన ఫలితాలను చేకూర్చుతుందనీ, ఆ ఫలితాలు ప్రజలకూ, యావత్తు సమాజానికీ లాభకరంగా వున్నాయనీ, అటువంటి పరిస్థితిలో ప్రజలు గ్రహిస్తారు. అనాలోచితమైన నిర్ణయాలూ, అవకతవక పనులూ, లేదా నిరంకుశ పద్ధతులూ ప్రజల ఉత్సాహాన్ని అణచివేసేటంతగా మరేదీ అణచి వేయజాలదు. వీటివల్ల శ్రామికశక్తి, సామాజిక వనరులు, సృష్టించుకున్న విలువలూ దండగవుతాయి.

ఇప్పుడు సమీక్షిస్తున్న కాలంలో, ఆర్థిక యంత్రాంగాన్ని మరింత మెరుగుపరచే విషయంలో ఎంతో కృషి జరిగింది. రంగాలవారీ మేనేజిమెంటు పద్ధతిని పునరుద్ధరించిన మీదట, జాతీయ ఆర్థికరంగం యొక్క కేంద్రీకృత సారథ్యం స్థాయి గణనీయంగా పెరిగింది. పార్టీ నిర్ణయాల ననుసరించి పారిశ్రామిక రంగాన్ని కొత్త ప్రణాళికా రచనా పద్ధతికి, ఆర్థిక ప్రోత్సాహకాలను కల్పించే పద్ధతికి మళ్లించడం జరిగింది. దీనివల్ల ఆర్థిక రంగంలో కొన్ని అవాంఛనీయ ధోరణులను అరికట్టడం సాధ్యమయింది. ఈ ధోరణుల

జాడలు యింతకు క్రితం సంవత్సరాల్లో కనుపించాయి. ఉత్పత్తిరంగ మేనేజిమెంటులో శ్రామిక ప్రజలను మరింత విస్తృతంగా భాగస్వాములను చేయడంలోనూ, రిపబ్లిక్కుల, మండలాల, ఆర్థిక, అధికారాలను విస్తృతం చేయటంలోనూ, పరిశ్రమలు మరింత ఎక్కువ స్వతంత్రంగా పని చేసేలా చేయడంలోనూ, ప్రజాతంత్ర సూత్రాలను మరింత అభివృద్ధి పరచడం ప్రతిబింబిత మయింది.

అదే సమయంలో, ఇప్పటికి సాధించినవాటితో మనం తృప్తిపడి కూర్చోజాలమని జీవితమూ, ఆచరణా స్పష్టం చేస్తున్నాయి. అందరినీ మించిన ఉపదేశకులు యివే. మేనేజి మెంటు వ్యవస్థను మరింత మెరుగుపరచడం ఏదో తాత్కాలిక చర్య కాదు. జీవితంలో తలెత్తిన సమస్యలను పరిష్కరించే ఒక శక్తివంతమయిన క్రమం అది. భవిష్యత్తులో కూడా మనం ఈ సమస్యలపై మన దృష్టిని కేంద్రీకరిస్తూనే వుండాలి.

చాలా ముఖ్యమైనవని పార్టీ కేంద్రకమిటీ భావిస్తున్న కొన్ని విషయాల గురించి క్లుప్తంగా ప్రస్తావించడం ఈ సందర్భంలో సముచితంగానే వుంటుంది.

*ప్రణాళికా రచన విషయం.* సోషలిస్టు వ్యవస్థలో ప్రణాళికా రచన, జాతీయ ఆర్థిక రంగ సారథ్యంలో కీలక అంశం; వెన్నెముక లాంటిది. ఈ రంగంలో మన దేశం ఘన విజయాలను సాధించింది; అందుకు న్యాయంగానే గర్వపడుతుంది. అయితే మనం చేతులు ముడుచుకుని కూర్చోజాలము. జాతీయ, ఆర్థిక ప్రణాళికా రచనా సూత్రీకర ణలనూ, ఆచరణనూ మరింత మెరుగు పరచేందుకు గట్టిగా కృషి చేస్తూనే ఉండాలి.

దీని శాస్త్రీయ స్థాయిని మరింత పెంచడం అతి ముఖ్యమైన కర్తవ్యంగా పరిణ మిస్తూంది. మన ప్రణాళికా రచనా పద్ధతులను మరింత మెరుగు పరచడం అత్యవసరం. సామాజిక అవసరాలను ఇంకా ఖచ్చితంగా అధ్యయనం చేయడం, మనకు గల ఆర్థిక అవకాశాలను శాస్త్రీయంగా ముందుగానే ఊహించడం, నిర్ణయాల రూపాంతరాలనూ, వాటి తక్షణ, దీర్ఘ కాల పర్యవసానాలనూ అన్ని దృక్కోణాల నుండి వివేచన చేయడం, అంచనా కట్టడం—ప్రణాళికా రచన వీటిపైనే ఆధారపడాలి. బాధ్యతాయుతమూ, జటిలమూ అయిన ఈ కర్తవ్యాన్ని నెరవేర్చాలి అంటే ఆర్థిక ప్రణాళికా రచనా పరిధులను విస్తృతం చేయడం అవసరం.

అన్నిటికన్నా ముఖ్యమైన ఆర్థిక, సామాజిక-రాజకీయ కర్తవ్యాలను నెరవేర్చా లంటే, అయిదేళ్ళ కన్నా చాలా ఎక్కువ గడువు అవసరం అన్న విషయం, నానాటికీ మరింత తరచుగా మనకు ఎదురవుతూంది. దేశ జనాభా పెరుగుదలను గురించి ముందు గానే వేసుకున్న అంచనాలను, జాతీయ ఆర్థిక రంగ అవసరాలను, శాస్త్ర సాంకేతిక ప్రగతిని ఆధారం చేసుకుని జాతీయ ఆర్థిక అభివృద్ధిని గురించి దీర్ఘకాలిక ప్రణాళికను రూపొందించే సమస్య దీనితో ఉత్పన్న మవుతుంది. దీర్ఘకాలిక ప్రణాళికలను, పంచ వర్ష, సాంవత్సరిక ప్రణాళికలతో సమన్వయపరచే ఈ వైఖరి, మన అభివృద్ధికి సంబం

ధించిన మౌలిక సమస్యలను మరింత సమర్థవంతంగా పరిష్కరించేందుకు తోడ్పడ గలదు.

ప్రణాళికా రచనల పట్ల సమగ్ర వైఖరిని అవలంబించడం, జాతీయ ఆర్థిక రంగానికి సంబంధించిన ముఖ్యమైన నిర్ణయాలను చేయడం, మునుపటి కన్నా ఎక్కువ ప్రాధాన్యాన్ని సంతరించుకుంటాయి. మన ముందున్న కర్తవ్యాలు ఎటువంటివంటే, వాటిని నిర్వర్తించేందుకు, అనేక శాఖలూ, ఆర్థిక రంగాలూ కేంద్రీకృతంగా కృషి చేయడం సర్వ సాధారణంగా అవసర మవుతుంది; విభిన్న చర్యల వ్యవస్థకు వ్యవస్థనే అమలు జరపవలసి ఉంటుంది.

ఈ రంగంలో మనకు మంచి అనుభవం ఏమైనా ఉందా? ముమ్మాటికీ ఉంది. గత కొద్ది సంవత్సరాలను మాత్రమే తీసుకుంటే, వ్యవసాయ రంగాన్ని ముమ్మరంగా అభివృద్ధి పరచే కార్యక్రమం, పశ్చిమ సైబీరియాలో అపారమైన నూనె నిక్షేపాలున్న మండలాన్ని అభివృద్ధిచేసే కార్యక్రమం, రోదసీ పరిశోధనా కార్యక్రమం మొదలైనవి ఉన్నాయి. ఇంకా అనేక దీర్ఘ కాలిక కార్యక్రమాలను బాగా లోతుకుపోయి రూపొందించే కర్తవ్యమూ, మొత్తం దేశ ఆర్థికాభివృద్ధి ప్రణాళికలతో వీటిని సమన్వయపరచే కర్తవ్యమూ ఇప్పుడు మన ముందున్నాయి.

ప్రణాళికా రచనలో, స్థానిక ప్రత్యేకతలను మరింత పూర్తిగా దృష్టిలోకి తీసుకోవాలి. విభిన్న పరిస్థితులుగల మన సువిశాల దేశంలో ఈ కర్తవ్యం ఎంతో ప్రాధాన్యం కలది. ఉత్పత్తి రంగాలను ఆయా ప్రాంతాల్లో నెలకొల్పే పనిని అంతకంతకు మరింత మెరుగు పరచడాన్ని మనం కొనసాగించాలి.

ప్రణాళికా రచనకు సంబంధించిన సైద్ధాంతిక ఆయుధాగారాన్ని విజ్ఞానశాస్త్రం పరిపుష్టం చేసింది. రూపకల్పన, విధానాలు, పరిశీలన మొదలైన వాటిలో ఆర్థిక-గణితశాస్త్రబద్ధమైన పద్ధతులను ప్రసాదించడం ద్వారా ఈ పరిపుష్టిని చేకూర్చింది. ఈ పద్ధతులను మరింత విస్తృతంగా ఉపయోగించుకోవాలి. రంగాలవారీ స్వయంచాలన మేనేజిమెంటు వ్యవస్థలను మరింత త్వరగా ఏర్పరచాలి. సమాచారాన్ని సేకరించేందుకూ, వివేచన చేసేందుకూ దేశ వ్యాపితమైన స్వయంచాలన వ్యవస్థను భవిష్యత్తులో మనం నిర్మించవలసి ఉంటుంది కాబట్టి ఇది అవసరం. కావలసిన యంత్ర సామగ్రిని నిర్మించడం మాత్రమే కాకుండా, నిపుణులైన సిబ్బందిని పెద్ద సంఖ్యలో తరిఫీదు చేయడం కూడా ఇందుకు అవసరం.

కామ్రేడ్స్, మన సోషలిస్టు ఆర్థిక వ్యవస్థ సాధించిన విజయాలన్నీ కూడా, ఆర్థిక ప్రణాళికా రచనతో ముడిపడి ఉన్నాయి. భవిష్యత్తులో మనం సాధించే విజయాలు కూడా, ప్రణాళికా రచన నాణ్యతపై చాలవరకు ఆధారపడి ఉంటాయి. అందువల్లనే, దానిని

మరింత మెరుగు పరచడంపై మనం ఇకముందు కూడా దృష్టిని లగ్నం చేయాలి. ప్రభుత్వ ప్రణాళికలనూ, లక్ష్యాలనూ పూర్తి చేయడం విషయంలోనూ, జాతీయ ఆర్థిక యంత్రాంగంలో ప్రతి ఒక్క విభాగంలోనూ ప్రణాళికా పరమైన క్రమశిక్షణను మరింత పటిష్ఠం చేయడం పట్లా, మన సిబ్బందికి గల బాధ్యతను నికరంగా పెంచేందుకు మనం కృషి చేయాలి.

*మేనేజిమెంటు వ్యవస్థా నిర్మాణాన్ని మరింత మెరుగు పరచడం విషయం.* జీవితం, అంటే ఉత్పాదక శక్తులు అభివృద్ధి కావడం, ఆర్థిక రంగ మేనేజి మెంటు వ్యవస్థా నిర్మాణాన్ని మరింత మెరుగు పరచడానికీ, ఆయా అధికార సంస్థల విధులను నిర్దిష్టం చేయడానికీ సంబంధించిన సమస్యలను ముందుకు తెచ్చింది.

నిర్దిష్టంగా చెప్పాలంటే దీని అర్థం ఏమిటి?

ముఖ్యంగా, ప్రభుత్వ ప్రణాళికా రచనా సంఘం యొక్క, ఇతర అఖిల యూని యన్ ప్రభుత్వ సంస్థల యొక్క పాత్రను పెంచడమూ, వాటి పనిని మరింత మెరుగు పరచడమూ అవసర మన్నమాట. ఇది జరగాలంటే, జాతీయార్థికాభివృద్ధికి సంబంధించిన ప్రధాన సమస్యలపై అవి తమ దృష్టిని కేంద్రీకరించడానికి వీలుగా, నిత్య వ్యవహారంగా జరిగే పనులు చాలవరకు వాటికి లేకుండా చేయాలి. మంత్రిత్వ శాఖల, డిపార్టుమెంటుల పాత్రను పెంచడమూ, వాటి స్వతంత్ర కృషిని విస్తరింప జేయడమూ మరొక అత్యవసర సమస్య. వీటి విధులను కొంత నిర్దిష్టం చేయడం ఇందుకు అవసరం.

ఉత్పత్తిని మరింతగా కేంద్రీకరించవలసిన అవసరం ఉంది. అర్హతలు గల ప్రవీ ణులను తగిన సంఖ్యలో కేంద్రీకరించడం, సాంకేతిక ప్రగతిని వేగంగా సాధించడం, వనరులన్నిటినీ మరింత చక్కగా, పూర్తిగా వినియోగించడం అనే కర్తవ్యాన్ని నిర్వర్తిం చడం, పెద్ద పెద్ద అసోసియేషన్లకు మాత్రమే సాధ్యమని, ఇంతవరకు మనం సంపాదించిన అనుభవం తెలియజేస్తూంది. సంయుక్త పరిశ్రమలను, కంబైన్లను ఏర్పరిచే పంథాను మరింత ధైర్యంగా అనుసరించాలి: చివరకు ఇవే, లాభనష్టాల ప్రాతిపదికపై సామాజి కోత్పత్తిని సాగించే ప్రధాన సంస్థలుగా రూపొందాలి. ఇటువంటి అసోసియేషన్లను ఏర్పరిచేటప్పుడు, పరిపాలనా నిర్వహణ హద్దులూ, ఫ్యాక్టరీలు ఆయా శాఖలకు లోబడి ఉండడమూ, మరింత సమర్థవంతమైన మేనేజిమెంటు రూపాలను ప్రవేశ పెట్టడానికి అవ రోధంగా ఉండకూడదు. కేంద్రీకరణ ప్రక్రియను వ్యవసాయ రంగంలో కూడా అభివృద్ధి పరచాలి.

మేనేజిమెంటు వ్యవస్థా నిర్మాణాన్ని మెరుగు పరచడంలో, అప్పగించిన పనులకు వ్యక్తిగత బాధ్యత అనే లెనినిస్టు సూత్రాన్ని నికరంగా అమలు జరపడం ముఖ్యమని పార్టీ భావిస్తూంది. ఒక నిర్ణయం జరిగినప్పుడు దానికి బాధ్యత ఎవరిదో స్పష్టం చేయాలి.

అదే విధంగా, ఆచరణలో పెట్టడానికి సిద్ధంగా ఉన్న నిర్ణయం అమలు జరగకుండా పోవడానికీ, లేదా అమలు జరగడం ఆలస్యం కావడానికీ బాధ్యత ఎవరిదో కూడా స్పష్టం చేయాలి. మేనేజిమెంటులోని ప్రతి దశలోనూ అధికారాల, బాధ్యతల పరిమాణాన్నీ, వాటి మధ్య సమతూకాన్నీ నిర్ణయించడం ముఖ్యం. అధికారాలు ఎక్కువగానూ, బాధ్యతలు తక్కువగానూ ఉంటే, పరిపాలనా నిర్వహణలో నిరంకుశ చర్యలకూ, ఆశ్రిత పక్షపాతానికీ, ఆత్మాశ్రయతకూ, అనాలోచిత నిర్ణయాలకూ అవకాశాలేర్పడతాయి. కాని, ఎక్కువ బాధ్యతలూ, తక్కువ అధికారాలూ ఉండడం కూడా ఇంతకన్నా మెరుగేమీ కాదు. అటువంటి పరిస్థితుల్లో, ఎంతో చైతన్యవంతుడైన పనివాడు కూడా, తరుచు ఏమీ చేయలేని స్థితిలో పడిపోతాడు; అతడు, తనకు అప్పగించిన పనికి పూర్తి బాధ్యత వహించేలా చేయడం కష్టమైపోతుంది.

మేనేజిమెంటులో అనేక అంచెలు లేకుండా చేయడంకోసం, అధిక సంఖ్యాక సమస్యలను ఒక అంచెనుండి మరొక అంచెకు రవాణా చేయకుండా, వాటిపై ఒకేసారి నిర్ణయాలు జరిగేలాగా చూడాలి. మేనేజిమెంటు వ్యవస్థలోని ప్రతి ఒక్క విభాగమూ తన పని నది చేసుకుపోతూ ఉండాలి. మేనేజిమెంటులో ఉన్నత స్థాయిలోని వారి దృష్టిని ప్రధాన సమస్యల నుండి మళ్ళించేలాగా చిల్లర మల్లర విషయాలను వారిపై కురిపించకుండా ఉండడానికీ, తమ అధికార పరిధిలోకి వచ్చే విషయాలను, కింది స్థాయిలోని వారు సమర్థవంతంగా నిర్వహించగల అవకాశాలు కలిగించడానికీ ఇది అవసరం. ఇలా జరగడం మంచిదనిపిస్తుంది.

మేనేజిమెంటు వ్యవస్థా నిర్మాణం మరింత మెరుగు కావాలంటే, సంకుచితమైన డిపార్టుమెంటు దృష్టినీ, ప్రాంతీయ దృక్పథాన్నీ ఎదుర్కొని ఏకరీతిగా పోరాటం సాగించడం అవసరం.

ఆర్థిక ప్రోత్సాహకాలను పెంచడం విషయం. జాతీయ ఆర్థిక రంగానికి తన సారథ్యాన్ని మరింత మెరుగు పరచేందుకు సాగిస్తూన్న కృషిలో, కేంద్ర అధికార సంస్థలు కర్తవ్యాలను ఆదేశించడాన్ని, ఉత్పత్తిని ప్రభావితం చేసేందుకు ఆర్థిక సాధనాలను ఉపయోగించడంతో సరిగా జోడించే పంథాను పార్టీ అచంచలంగా అనుసరిస్తూ వచ్చింది. ఖర్చుల మదింపు, ధరలు, లాభాలు, పరపతి, పాదార్థిక ప్రోత్సాహకాల రూపాలు మొదలైనవి ఈ సాధనాలు. ఉత్పత్తిని సాగించే సమిష్టి సంస్థల, లక్షలాది శ్రామిక ప్రజల కార్యకలాపాలు జయప్రదంగా సాగేందుకు దోహదకరమైన ఆర్థిక పరిస్థితులను కల్పించేందుకూ, ఈ కార్యకలాపాల ఫలితాలకు గట్టి ఆధారాలపై విలువలు కట్టేందుకూ ఉద్దేశించిన వివి. శ్రమ పరిమాణాన్నీ, వాడకం పరిమాణాన్నీ, ఖచ్చితంగా నిర్ణయించాలంటే ఈ సాధనాల నన్నిటినీ చాకచక్యంతో ఉపయోగించడమూ, అమ్మకం సరకు-ద్రవ్య సంబంధాలను మెరుగు పరచడమూ అవసరం.

"పారిశ్రామిక రంగ మేనేజిమెంటును మెరుగుపరచడం, పారిశ్రామికోత్పత్తిలో ఆర్థిక ప్రోత్సాహకాలను పెంచడం గురించి" 1965 సెప్టెంబరు విస్తృత సమావేశంలో పార్టీ కేంద్రకమిటీ చేసిన నిర్ణయాల ప్రకారం, ఈ పంథాల ననుసరించి కొన్ని చర్యలను తీసుకోవడం జరిగిందని ఈ మహాసభ ప్రతినిధులకు తెలుసు. ఆర్థిక సంస్కరణను ప్రారంభించిన మీదట పార్టీ, పరిస్థితులను సరిగా అంచనా వేసి, జాతీయ ఆర్థిక రంగ మేనేజిమెంటును మెరుగు పరచడంలో సరియయిన మార్గాన్ని అనుసరించిందని అనేందుకు, గత సంవత్సరాల అనుభవం మనకు తగు ఆధారాలను ప్రసాదించింది. అయితే, అన్ని సమస్యలూ ఇంకా పరిష్కారం కాలేదు.

ఇంతవరకు సంపాదించిన అనుభవం, ఎక్కడ కేంద్రీకృతంగా కృషి జరగాలో మరింత ప్రస్ఫుటం చేసింది. ఒకటి—గరిష్ట బాధ్యతలను స్వీకరించేలాగా, అంటే గరిష్ట స్థాయి ప్రణాళికలను చేపట్టేలాగా, ద్రవ్య పెట్టుబడులనూ, శ్రామిక వనరులనూ మరింత హేతుబద్ధంగా ఉపయోగించుకునేలాగా ఫ్యాక్టరీలను ప్రోత్సహించడం; రెండు—శాస్త్ర, సాంకేతిక రంగాల ప్రగతి, శ్రామిక ఉత్పాదక శక్తి పెరుగుదలా అత్యధిక వేగంగా సాగేలా చేయడం; మూడు—ఉత్పత్తిలో మరింత ఎక్కువ నాణ్యతను సాధించేందుకై నికరమైన కృషి సాగించడం పైనే ఇలా కేంద్రీకరించాలి.

లాభ నష్టాల ప్రాతిపదికపై పనిచేసే సూత్రాలను నికరంగా అమలు జరపడం, ఫ్యాక్టరీల్లోనూ, సమిష్టి, ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాల్లోనూ, మరింత ఉన్నతమైన ఆర్థిక స్థాయిల్లోనూ అత్యవసరమైన కర్తవ్యంగానే ఉంది. ఆర్థిక కాంట్రాక్టుల పాత్రనూ, ఆ కాంట్రాక్టులను పూర్తి చేయడం విషయంలో గల బాధ్యతలనూ పెంచాలి. సంయుక్త పరిశ్రమలకూ, ఫ్యాక్టరీలకూ కొన్ని సంవత్సరాల వరకు సరిపడేలాగా స్థిరమైన ప్రణాళికా లక్ష్యాలనూ, ఆర్థిక ప్రమాణాలనూ రూపొందించాలి.

చేసిన పనికి చెల్లింపుల విధానాన్ని మరింత మెరుగు పరచడం, ఆర్థిక కార్యకలాపాల్లో ఒక ప్రధానాంశం. ఉత్పత్తి సామర్థ్యం చాలవరకు దీనిపై ఆధారపడి ఉంది. చైతన్య పూర్వకమూ, అధిక ఫలప్రదమూ అయిన పనిని ప్రోత్సహించాలి. మరింత ఎక్కువ ప్రతిఫలం చేకూర్చాలి. ఉత్పత్తి పెరుగుదలకు అందరికన్నా ఎక్కువ దోహదం కూర్చి, వృత్తులను జోడించి, సామాజిక సంపద తమ సొత్తుగా భావించి, పొదుపరితనం ప్రదర్శించే కార్మికులకూ, కార్మికుల సమిష్టి సంస్థలకూ ప్రోత్సాహకాలను సమకూర్చేందుకు ఫ్యాక్టరీలకు గల అవకాశాలను పెంచడం అవసరం. ష్చెకినో రసాయనిక ఫ్యాక్టరీ అనుభవం ఈ విషయాన్ని నిరూపిస్తుంది. పాదార్థిక ప్రోత్సాహకాల పెరుగుదల, పని విషయంలో నైతిక ప్రోత్సాహకాలను పెంచడంతో పాటుగానే జరగాలి.

కామ్రేడ్స్, క్లుప్తంగా చెప్పాలంటే, పార్టీ సంస్థలూ, మన ఆర్థిక సంస్థలూ, కార్మి

కుల సమిష్టిసంస్థలూ, ఆర్థిక మేనేజిమెంటు పద్ధతులను మెరుగు పరచేందుకు గట్టిగా కృషి చేయాలి.

సోవియట్ ఆర్థిక శాస్త్రంపై పడుతూన్న బాధ్యతలను గురించి ఈ సందర్భంలో ఒక మాట చెప్పవలసి ఉంది. ఇటీవలి సంవత్సరాల్లో ఈ శాస్త్రం కొన్ని విజయాలను సాధించింది. అయితే జాతీయార్థిక రంగం వేగంగా అభివృద్ధి చెందడంవల్లనూ, దాని ముందున్న కొత్త కర్తవ్యాలను బట్టీ, జటిలమైన అనేక సైద్ధాంతిక, ఆచరణ పూర్వక సమస్యలు ముందుకు వస్తున్నాయి. వీటి పరిష్కారం పట్ల ఆర్థిక సంస్థలూ, శాస్త్రవేత్తలూ నిరంతరం శ్రద్ధ వహించడం అవసరం.

*ఆర్థిక మేనేజిమెంటులో ప్రజలు మరింత విస్తృతంగా పాల్గొనడం విషయం.* ఉత్పత్తిరంగ మేనేజిమెంటులో శ్రామిక ప్రజాబాహుళ్యాన్ని అంతకంతకు మరింత విస్తృత స్థాయిలో భాగస్వాములను చేయడం, పార్టీ ముందున్న కీలక కర్తవ్యాల్లో ఒకటి. "తన ఫ్యాక్టరీకి తాను యజమానిని అని మాత్రమే కాకుండా, దేశానికి తాను ప్రతినిధినని కూడా" (*కలెక్టెడ్ వర్క్స్*, సం. 27, పుట 403) ప్రతి ఒక్క శ్రామికుడూ, రాజకీయ చైతన్యం గల ప్రతి ఒక్క కార్మికుడూ భావించాలి అని లెనిన్ నొక్కి చెప్పారు. మనం దీనిని సాధించాలి.

ఇందుకు మనకు అపారమైన అవకాశాలున్నాయి. ఆర్థిక మేనేజిమెంటులో ప్రజల భాగస్వామ్యం, ఆయా ఉత్పాదక సంస్థల్లో ఎదురయే ఆర్థిక కర్తవ్యాలను నెరవేర్చడానికి మాత్రమే పరిమితం కాదు. ఆర్థిక మేనేజిమెంటులో మన పార్టీ, సోవియట్ ప్రభుత్వమూ నిర్వహిస్తూన్న పాత్ర దృష్ట్యా, ఈ విషయంలో మరింత విశాలమైన దృక్పథాన్ని అవలంబించాలి. ఇవి అనుసరిస్తూన్న విధానాన్ని, వీటి ఆర్థిక విధానాన్ని కూడా నిర్ణయిస్తున్నది, శ్రామిక ప్రజల మౌలిక ప్రయోజనాలే. ఎన్నికల ద్వారా ఏర్పడిన సంస్థల్లోని శ్రామిక ప్రజాప్రతినిధులు ఈ విధాన్ని రూపొందిస్తున్నారు; ముఖ్యమైన ప్రణాళికలను గురించీ, నిర్ణయాలను గురించీ జరిగే చర్చల్లో ప్రజాబాహుళ్యం విస్తృతంగా పాల్గొంటూంది. ఈ నిర్ణయాలు పూర్తిగా అమలు జరిగేలా అజమాయిషీ చేయడంలో కూడా శ్రామిక ప్రజలు చురుకుగా పాల్గొంటున్నారు. సోషలిస్టు ప్రజాస్వామ్యం యొక్క ఈ రూపాలన్నిటినీ పార్టీ ఇకముందు కూడా అభివృద్ధి పరుస్తూనే ఉంటుంది.

లక్షలకొలది కార్మికులు, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులు, ఆఫీసు పనివారు సభ్యులుగా ఉన్న ప్రాథమిక పార్టీ సంస్థలు, ఆర్థిక మేనేజిమెంటులో పెద్ద పాత్రను నిర్వహిస్తున్నాయి. ఆయా సంస్థల ఆర్థిక కార్యకలాపాలను నియంత్రించేందుకు తమకు గల అధికారాన్ని వినియోగించుకొని, ఉత్పత్తికి సంబంధించిన విషయాల నివి సమర్థవంతంగా ప్రభావితం చేస్తున్నాయి. ఆర్థిక సమస్యలను పరిష్కరించడంలోనూ, సోషలిస్టు పోటీనీ,

కొత్త సాంకేతిక పద్ధతులను పెద్ద ఎత్తున కనిపెట్టడాన్ని పెంపొందించడంలోనూ, శ్రామిక క్రమశిక్షణను పటిష్ఠం చేయడంలోనూ ట్రేడ్ యూనియన్లు పెద్ద పాత్రను నిర్వహిస్తున్నాయి.

ఇక్కడ సమీక్షిస్తూన్న కాలంలో ఉత్పత్తి సమావేశాల, శ్రామిక సమావేశాల, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల సాధారణ సమావేశాల కార్యకలాపాల్లో గణనీయమైన వెల్లువ వచ్చింది. ఈ సమావేశాలకు అధికారాన్ని మరింత పెంచడంపట్లా, పారిశ్రామికాది సంస్థల వ్యవహారాలకు సంబంధించిన కీలక సమస్యలను వాటి ముందు చర్చకు తేవడం పట్లా శ్రద్ధ వహించాలి. సంయుక్త పరిశ్రమల, .ఫ్యాక్టరీల అధిపతులూ, మంత్రిత్వశాఖల ఉన్నతాధికారులూ, తమ పనిని గురించి క్రమబద్ధంగా కార్మికులకు నేరుగా సంజాయిషీ చెప్పుకొనే ఆచారాన్ని ప్రోత్సహించడం అవసరం.

ఉత్పత్తికి సంబంధించిన సమస్యలతోపాటు, శ్రామికుల రక్షణ, దైనందిన పరిస్థితులను మరింత మెరుగు పరచడం సమస్యలను గురించి కూడా వివిధ సమిష్టి సంస్థలు, సహజంగానే శ్రద్ధ వహించాలి. సమిష్టి సంస్థల సామాజిక అభివృద్ధికై పథకాలను రూపొందించే ఆచారం ప్రోత్సహించ తగినది. ఉమ్మడి ఒప్పందాలను కుదుర్చుకొని, అవి సరిగా అమలు జరిగేలా అజమాయిషీ చేసే పద్ధతిని మరింత మెరుగు పరచాలి.

లెనిన్ ఆదేశాలను మరింత పూర్తిగా ఆచరణలో పెట్టి, కార్మికులూ, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులు, బుద్ధిజీవులు అందరినీ, పార్టీ ఆర్థిక విధానాన్ని అమలు జరపడంలో చైతన్య పూర్వకంగా పాల్గొనే యోధులుగానూ, రాజ్యాంగ వ్యవహర్తలుగా వ్యవహరించే లాగానూ, తమ శక్తిసామర్థ్యాలనూ, చొరవనూ, ఆర్థిక సామర్థ్యాన్నీ పూర్తిగా ప్రదర్శించే లాగానూ చేయడం మన విధ్యుక్త ధర్మం.

* * *

కామ్రేడ్స్, ఆర్థికాభివృద్ధి కొరకూ, ప్రజల జీవన ప్రమాణాలను పెంచేందుకూ పార్టీ రూపొందించే ప్రణాళికల విజయం, చివరకు ప్రజలపైనే ఆధారపడి ఉంటుంది. కార్మికులూ, రైతులూ, మేధావులూ, మన పార్టీ, ప్రభుత్వ, ట్రేడ్ యూనియన్, ఆర్థిక రంగాల్లోని కార్యకర్తలూ చైతన్య పూర్వకంగా, పూనికతో సాగించే శ్రమే, కమ్యూనిస్టు నిర్మాణంలో అధికతర విజయాలను సాధిస్తామనేందుకు హామీ.

అందుచేతనే, పార్టీ నిర్మాణ, రాజకీయ, సైద్ధాంతిక, విద్యాబోధనా రంగాల్లో విస్తృతమైన కృషిద్వారా, మన ఆర్థిక కార్యక్రమానికి బలం చేకూర్చడం అవసరం. ఈ కృషి, సోషలిస్టు వ్యవస్థలోనూ, అద్భుతమైన యోధ, శ్రామిక, స్రష్ట లక్షణాలను తనలో

సమ్మిళితం చేసుకున్న సోవియట్ మానవునిలోనూ, స్వతస్సిద్ధంగా ఉన్న బ్రహ్మాండమైన శక్తులన్నిటినీ రంగంలోకి తేగలదు.

సోవియట్ ప్రజల జీవితాన్ని ఇంకా మెరుగు పరచడం, మరింత ఆకర్షవంతమూ, ఇంకా ఎక్కువ సుఖప్రదమూ చేయడమే మన లక్ష్యం. మన సృజనశీల శక్తుల నన్నిటినీ పూర్తిగా అర్పణచేసి, అనేక సంవత్సరాల పాటు స్వార్థరహితంగానూ, ఉత్తేజంతోనూ శ్రమించేందుకు మనం ముందుకు సాగిపోతున్నాము. సంక్షేమానికీ, సౌఖ్యానికీ, మహోజ్వలమైన కమ్యూనిస్టు భవిష్యత్తుకూ మనకు మార్గం ఇదొక్కటే.

III

# సోవియట్ సమాజం యొక్క సామాజిక-రాజకీయ అభివృద్ధి, పార్టీ కర్తవ్యాలు

కామ్రేడ్స్, గడచిన ఐదేళ్ళ కాలంలోనూ, సోవియట్ సమాజం యొక్క, సాంఘిక-రాజకీయ, సాంస్కృతికాభివృద్ధి గురించి కేంద్ర కమిటీ గణనీయమైన శ్రద్ధ వహించింది. ఈ రంగంలో చేసిన కృషి గురించి నివేదించేందుకు నన్ను అనుమతించండి.

## 1. సమాజం యొక్క సాంఘిక వ్యవస్థా నిర్మాణంలో మార్పులు. సోవియట్ ప్రజల ఐక్యత యింతోధికంగా పటిష్టం కావటం.

మన రాజకీయ వ్యవస్థ మరింతగా అభివృద్ధి చెందేందుకు సంబంధించిన సమస్యలనూ, సైద్ధాంతిక స్వభావం గల ప్రశ్నలనూ లేవనెత్తడంలోనూ, వాటిని పరిష్కరించటంలోనూ కేంద్రకమిటీ కొత్త వైఖరి ఏమంటే, యావన్మంది ప్రజల ప్రయోజనాలనూ, వివిధ వర్గాల, సామాజిక బృందాల ప్రయోజనాలనూ లెక్కలోకి తీసుకొని, వాటిని ఒకే ఒక ఉమ్మడి మార్గంలో నడిపినప్పుడే పార్టీ విధానం సరైన ఫలితాలనిస్తుంది.

కార్మిక వర్గాన్నీ, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతాంగాన్నీ, మేధావులనూ పరస్పరం దగ్గరికి తేవటమూ, పట్టణాలకూ గ్రామ సీమలకూ, మానసిక శ్రమకూ శారీరక శ్రమకూ మధ్యనున్న ప్రధాన వ్యత్యాసాలను క్రమేణా రూపు మాపడమూ, పార్టీ విధాన లక్ష్యం. ఇది వర్గరహిత, కమ్యూనిస్టు సమాజ నిర్మాణానికి సంబంధించిన ఒక కీలక రంగం.

అన్ని వర్గాలను, సామాజిక బృందాలను పరస్పరం దగ్గరకు తేవటం, సోవియట్ ప్రజలను నైతికంగా, రాజకీయంగా వృద్ధిలోకి తేవటం, వారి సామాజిక ఐక్యతను పటిష్టం చేయటం—వీటిని మనదేశంలో, కార్మికవర్గం యొక్క సోషలిస్టు ప్రయోజనాలనూ, కమ్యూనిస్టు ఆదర్శాలనూ వ్యక్తం చేసే మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతం ఆధారంగా సాధించటం జరుగుతూ వుంది.

మన సమాజంలో కార్మిక వర్గం అన్నిటికంటే ఎక్కువ సంఖ్యాబలం కలది. గడచిన ఐదేళ్ళ కాలంలో మన దేశంలో వీరి సంఖ్య దాదాపు 8 మిలియన్‌లు పెరిగింది. ప్రభుత్వ వ్యవసాయక్షేత్ర కార్మికుల మూలంగా కార్మికవర్గ సంఖ్యాబలం గణనీయంగా పెరిగింది. వివిధ రకాల ఉద్యోగాలు చేస్తున్న జనాభాలో, కార్మికులు 55 శాతం పైగా వున్నారు. కాని, సోషలిస్టు సమాజంలో కార్మికవర్గ స్థానం దాని సంఖ్యాబలాన్ని బట్టి మాత్రమే నిర్ధారణ కాదు. ఈ సంఖ్యాబలం ఆర్థికాభివృద్ధిని బట్టి, శాస్త్ర, సాంకేతిక

విప్లవ వేగాన్ని బట్టి మారవచ్చు. కార్మికవర్గం సమాజం యొక్క ప్రధాన ఉత్పాదక శక్తిగా యిదివరకూ వుంది, ఈ నాడూ అలానే వుంది. దాని విప్లవ తత్వము, క్రమశిక్షణా, నిర్మాణము, సమిష్టి తత్వమూ సోషలిస్టు సామాజిక సంబంధాల వ్యవస్థలో దాని నాయకత్వ స్థానాన్ని నిర్ణయిస్తూ వున్నవి.

కమ్యూనిజం నిర్మాతగా కార్మికవర్గ నాయకత్వ పాత్ర, దాని సాధారణ సాంస్కృతిక, విద్యాస్థాయీ, రాజకీయ కార్యకలాపాల పెరుగుదల వల్ల పటిష్ట మవుతాయి. కార్మికవర్గ సాంస్కృతిక స్థాయి పెరిగిందనే విషయం ముఖ్యంగా, లోగడ సేకరించిన రెండు జనాభా లెక్కలద్వారా స్పష్టంగా నిరూపితమైంది. 1959 లో దేశజనాభా ప్రతి వేయిమందిలోనూ ఉన్నత విద్య, లేదా సెకండరీ విద్య కల కార్మికులు 386 మంది వుండేవారు. ఈనాడీ సంఖ్య 550 కి పైబడింది.

తమ వృత్తిలో పూర్తిగా నిష్ణాతులైనటువంటి, సెకండరీ విద్యను పూర్తిచేసి, పైచదువులు కొనసాగిస్తూ శాస్త్ర, సాంస్కృతిక రంగాల్లోని పురోగామి విజయాలను ఆకళింపుకుంటున్నటు వంటి కార్మికుల సంఖ్య స్థిరంగా పెరుగుతూ వుంది. ఈ కార్మికులు సర్వసాధారణంగా రాజకీయంగా క్రియాశీలురు. వారు తమ ఫ్యాక్టరీ ప్రయోజనాలనూ, యావత్తు దేశప్రయోజనాలనూ తమ స్వంత ప్రయోజనాలుగానే పరిగణిస్తారు. సోవియట్ శ్రామిక ప్రజాబాహుళ్యం యావత్తూ, ఈ కార్మికులను ఆదర్శంగా పెట్టుకొంటూ వుంది. ఇటీవలి సంవత్సరాలలో కమ్యూనిస్టు పార్టీలో కార్మికుల తరగతి స్థిరంగా పెరుగుతూ వుంది; శ్రామిక ప్రజాప్రతినిధుల సోవియట్లలోనూ, మన పౌర సంస్థల్లోనూ కార్మికవర్గ ప్రతినిధుల సంఖ్య పెరుగుతూ వుంది. ఇది సహజమే.

మన సమాజ జీవితం యొక్క అన్ని రంగాలపైనా కార్మికవర్గ ప్రభావాన్ని పెంచేందుకూ, పటిష్టం చేసేందుకూ, దాని కార్యకలాపాలనూ, చొరవనూ మరింత ఫలదాయకం చేసేందుకూ పార్టీ తన కృషిని కొనసాగిస్తుంది.

కార్మికవర్గ, రైతాంగ బాంధవ్యం మన సమాజానికి రాజకీయ పునాది. పార్టీ విధానమూ, పరిశ్రమలనూ, వ్యవసాయాన్నీ అభివృద్ధి చేసేందుకు తీసుకున్న ఆచరణ పూర్వకచర్యలూ, ఈ మహత్తర బాంధవ్యం మరింత పటిష్టమయేలా చేశాయి.

వ్యవసాయ రంగంలోని ఉత్పాదక శక్తుల పెరుగుదలా, వ్యవసాయ రంగంలోని శ్రమ క్రమక్రమేణా ఒక రకం పారిశ్రామిక కృషిగా మార్పు చెందటం, గ్రామసీమలో సాంస్కృతిక వెల్లువ, గ్రామీణ జీవిత పునర్ వ్యవస్థీకరణ—యివి రైతు సామాజిక స్వరూపంలోనూ, ఆలోచనా ధోరణిలోనూ మార్పులకు తోవతీశాయి. రైతులకూ, కార్మికునికీ యిప్పుడు అధికాధికంగా సమాన లక్షణాలు వుంటున్నాయి. యంత్రాలతోనూ, యంత్ర వ్యవస్థలతోనూ ప్రత్యక్ష సంబంధంగల పని చేస్తూన్న సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల సంఖ్య స్థిరంగా పెరుగుతూ వుంది. సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతాంగం విద్యాస్థాయి పెరు

గుతూ వుంది. దేశభక్త మహాయుద్ధానికి ముందు గ్రామసీమలోని శ్రామిక ప్రజల్లో నూటికి 6 మంది మాత్రమే, ఉన్నతవిద్య, లేదా సెకండరీవిద్య కలవారు. 1970 సంవత్సరాంతపు లెక్కలను బట్టి గ్రామీణ జనాభాలో సగానికి పైగా సెకండరీ విద్యనో, ఉన్నత విద్యా సంస్థల్లో చదువునో పూర్తి చేసినవారు వున్నారు. ఇది మన సమాజానికి ఒక గొప్ప విజయం!

అంతర్ సమిష్టి వ్యవసాయక్షేత్ర, మిశ్రమ ప్రభుత్వ-సమిష్టి వ్యవసాయక్షేత్ర సంఘాలూ, ఫ్యాక్టరీలు నానాటికి మరింత పెద్ద సంఖ్యలో ఆవిర్భవించటం గణనీయమైన సామాజిక మార్పులకు తోవతీస్తూ వుంది.

గ్రామసీమలకు కొత్త, మరింత జటిలమైన యంత్రాలు—శక్తివంతమైన ట్రాక్టర్లు, నూర్పిడి యంత్రాలు, లారీలు సరఫరా అయాయి; రైతుల జీవన ప్రమాణం పెరిగింది; వారి సాంస్కృతిక పరిస్థితులూ, నిత్యజీవిత పరిస్థితులూ మెరుగయాయి. వీటన్నిటివల్ల వ్యవసాయరంగంలో శ్రమ, ముఖ్యంగా యువజనులకు మరింత ఆకర్షణీయమూ, ఆసక్తి దాయకమూ అవుతూ వుంది, ఉన్నత అర్హతలు సంపాదించుకొనేందుకు వారికి అవకాశాలు కల్పిస్తూ వుంది. ఫలితంగా గ్రామీణ యువజనులు విద్యాసంస్థల్లో చదువు పూర్తి చేశాక, యిప్పుడు పని చేసేందుకు గ్రామాల్లోనే ఉండిపోవడానికి మరింతగా యిష్టపడుతున్నారు. ఇది ఒక మంచి పరిణామం; ముఖ్యంగా, వ్యవసాయోత్పత్తిని అభివృద్ధి పరచేందుకు, గ్రామసీమలో నిపుణులయిన సిబ్బంది మరింత ఎక్కువ మందిని తరిఫీదు చేయవలసి వున్నందువల్ల యిది అన్ని విధాలా మనం తోడ్పడదగిన పరిణామం.

సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల అఖిల యూనియన్ తృతీయ మహాసభ, సమిష్టి వ్యవసాయక్షేత్రాల ఆదర్శ నిబంధనావళిని రూపొందించిన విషయం మీకు గుర్తు వుంటుంది. సమిష్టి వ్యవసాయ క్షేత్రాల అఖిల యూనియన్ కౌన్సిల్‌నూ, జిల్లా, మండల, ప్రాంతీయ, రిపబ్లిక్ స్థాయి సమిష్టి వ్యవసాయక్షేత్ర సమితులనూ ఎన్నుకున్నారు. ఇవి రైతుల ప్రయో జనాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నవి. గ్రామసీమ జీవితానికీ, సమిష్టి వ్యవసాయక్షేత్ర ప్రజా స్వామ్యం అభివృద్ధికీ యిదంతా కీలక ప్రాముఖ్యం గల విషయం.

కామ్రేడ్స్, గ్రామసీమలో సంస్కృతిని అభివృద్ధి పరచేందుకు, నిత్యజీవితాన్ని మెరుగు పరచేందుకు, ప్రత్యేకించి నొక్కి చెప్పవలసిన విషయం—గ్రామసీమలో నిర్మాణ కార్యకలాపాల విషయమై, చేయవలసింది చాలా వుందని సహజంగానే పార్టీ ఎరుగును. ఈ విషయంలో ఎంతో ముందుకు సాగవలసి వుంది. కాని యిప్పటికే సాధించిన దాన్ని గురించి తక్కువ అంచనా వేసేందుకు ఎలాంటి కారణమూ లేదు.

కార్మికవర్గమూ, రైతాంగమూ, మేధావులూ పరస్పరం సన్నిహితులు కావటం మన సమాజంలోని సాంఘిక మార్పుల్లోకెల్లా ప్రధానమైంది. ఈ క్రమం యిప్పుడు నానాటికి మరింతగా ప్రస్ఫుటమవుతూంది.

తమ సృజనాత్మకశక్తిని ప్రజల ఆశయాని కోసం, కమ్యూనిస్టు సమాజ నిర్మాణ ఆశయాని కోసం ధారపోయటం తమ కర్తవ్యంగా సోవియట్ మేధావులు భావిస్తున్నారు. సంఖ్యరీత్యా, మేధావి తరగతి పెరుగుదల వేగంగా సాగుతూ వుంది. విజ్ఞానశాస్త్ర కార్య కర్తల, యింజినియర్ల, సాంకేతిక నిపుణుల, వ్యవసాయ శాస్త్రజ్ఞుల, ఉపాధ్యాయుల, వైద్యుల సంఖ్య పెరుగుతూ వుంది. సోవియట్ యూనియన్‌లో, యిటీవలి సంవత్సరాల్లో శాస్త్ర, సాంకేతిక మేధావుల సంఖ్య పెరుగుదల, యితర సామాజిక సముదాయాల పెరుగు దల కంటే వేగంగా జరుగుతూ వుంది. ఇది సహజమైన క్రమం. శాస్త్ర సాంకేతిక ప్రగతిని సాధ్యమైనంత త్వరితంచేసే, ప్రజల సాంస్కృతిక, విద్యాప్రమాణాలను మరింతగా పెంచే పార్టీ విధాన ఫలితమిది.

మన మేధావి తరగతిని, ముఖ్యంగా శాస్త్ర, సాంకేతిక మేధావి తరగతిని, కార్మిక, కర్షక శ్రేణుల్లోనుంచి వచ్చినవారు భారీ ఎత్తున పూరిస్తున్నారు. ఈ దిగుపనిస్తున్నది మచ్చు తునకలాంటి ఉదాహరణ. ప్రివోరాల్‌స్క్ పైపుల ఫ్యాక్టరీలో పనిచేస్తున్న యింజ నియర్లు, సాంకేతిక నిపుణుల్లో 42 శాతం కార్మిక వర్గాన్నుంచి, 32 శాతం రైతాంగం నుంచి, 26 శాతం ఆఫీసు ఉద్యోగుల కుటుంబాల నుంచి వచ్చినవారు. మన దేశంలోని యితర పారిశ్రామిక సంస్థల్లోనూ దాదాపు యిదే పరిస్థితి వుంది.

కామ్రేడ్స్, మనపార్టీ తన విధానంలో యువజనులు, మహిళలు, పింఛన్‌దారుల వంటి విస్తారమైన సామాజిక సముదాయాలను యిదివరకూ దృష్టిలో పెట్టుకొంది, యిక ముందూ దృష్టిలో పెట్టుకొంటుంది.

లెనిన్ కమ్యూనిస్టు యువజన సంఘకార్యకలాపాల విషయం చెప్పే సందర్భంలో, యువజనుల గురించి, వారి మధ్య పార్టీ కార్యకలాపాల గురించీ నేను తెలియజేస్తాను. ఇక్కడ నేను ఒక్క సంగతి మాత్రమే నొక్కి చెబుతాను. అదేమంటే, యువజనుల సమస్యల గురించీ, వారిని ఆందోళనపరచే విషయాల గురించీ, వారి ప్రయోజనాల గురించీ పార్టీ శ్రద్ధ వహిస్తూనే వచ్చింది. ఇకముందూ శ్రద్ధ వహిస్తూనే వుంటుంది. మన దేశ జనాభాలో సగానికి పైగా 30 ఏళ్ళ లోపు యువజనులు. వారు మన భవిష్యత్తు; మన స్థానాలను భర్తీ చేయవలసిన వారు.

మహిళల పని పరిస్థితులను మెరుగు పరిచేందుకూ, అదే సమయంలో వారి గృహ కృత్యాల భారాన్ని తగ్గించేందుకూ, గడచిన ఐదేళ్ళలో పార్టీ చొరవపై అనేక ముఖ్యమైన చర్యలు తీసుకున్నాం. ప్రసూతి సెలవులకు సంబంధించిన పద్ధతులను సమిష్టి వ్యవసాయ క్షేత్రాల్లోని రైతు మహిళలకు గూడా వర్తింప జేయటమూ, మరిన్ని శిశుసంరక్షణాలయా లనూ, శిశుపాఠశాలలనూ, నిత్యజీవితానికి సంబంధించిన సేవా సంస్థలనూ ఏర్పాటు చేయ టమూ జరిగిందన్న విషయాన్నయినా కనీసం గుర్తు చేయగోరుతున్నాను. కామ్రేడ్స్, వచ్చే

ఐదేళ్ళ కాలంలో, ఈ దిశలో మరిన్ని చర్యలను ప్రణాళిక తలపెడుతూ వుందని మీకందరికీ తెలుసు.

తమ బిడ్డల పెంపకానికి, సామాజిక జీవితంలో మరింత పెద్దగా పాల్గొనేందుకు, విద్యా వినోదాలకూ సోవియట్ మహిళలకు మరింత అవకాశాలు వుండాలి, సంస్కృతి ప్రసాదించే సత్ఫలితాలు వారికి మరింత అందుబాటులో వుండాలి అన్నదే పార్టీ విధాన లక్ష్యం. ఇవన్నీ ముఖ్యమైన కర్తవ్యాలు. వీటిని ఆచరణలో పెట్టటంలో కొత్త పంచవర్ష ప్రణాళిక ఒక ప్రముఖ దశ అవుతుంది.

పించన్‌దారులు, అంటే వృద్ధ శ్రామిక యోధులూ, వృద్ధ సైనికులూ మన సమాజంలో ఒక పెద్ద సముదాయంగా వున్నారు. పించన్‌పై ఉద్యోగ విరమణచేసే పౌరులు శ్రామిక కార్యకలాపాల్లో పాల్గొనేందుకు యిటీవలి సంవత్సరాల్లో విస్తృత అవకాశాలు కల్పించిన సంగతి ఈ మహాసభ ప్రతినిధులకు తెలుసు. అనేక పార్టీ సంస్థలు పింఛనుదారుల పనికి సంబంధించిన లాభదాయకమయిన రూపాలను సృష్టిస్తున్నవి. కాని, మన యోధుల అనుభవాన్నీ, శక్తినీ, సామాజిక, శ్రామిక కార్యకలాపాల కోసం మరింత శక్తివంతంగా వినియోగించేందుకు చర్యలు తీసుకున్నట్లయితేనే మనం చేసేపని సరిగా వుంటుంది.

కామ్రేడ్స్, లెనినిస్టు జాతుల విధానాన్ని ఆచరణ పూర్వకంగా అమల్లో పెట్టటమన్నదిసోషలిజం సాధించిన అతి గొప్ప విజయాల్లో ఒకటి. ఇది జాతుల సరిసమానత్వాన్నీ, స్నేహాన్నీ పెంపొందించే విధానం.

చాలా సోదర రిపబ్లిక్కులు ఈ మధ్యనే తమ యాభయ్యవ వార్షికోత్సవాలు జరుపుకున్నాయి. సోషలిస్టు జాతుల వికాసాన్నీ, మన దేశంలోని సమస్త జాతుల ఏకశిలా సదృశ ఐక్యతనూ యిది ఉజ్వలంగా ప్రదర్శించింది. సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య 50వ వార్షికోత్సవాన్ని వచ్చే సంవత్సరం జరుపుకుంటాం. సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య ఏర్పాటు, దాని రాజకీయ ప్రాధాన్యం రీత్యానూ, సామాజిక ఆర్థిక పర్యవసానాల రీత్యానూ, మన దేశ చరిత్రలో ప్రముఖ స్థానాన్ని అలంకరిస్తూ వుంది.

మన దేశంలోని అన్ని జాతులూ, ఉపజాతులూ, ముఖ్యంగా రష్యన్ మహా జాతి, సోషలిస్టు పథాన్ని చేపట్టిన సరిసమాన జాతుల శక్తివంతమైన సమాఖ్యను నిర్మించటంలోనూ, పటిష్టం గావించటంలోనూ, అభివృద్ధి పరచటంలోనూ తమ పాత్రను నిర్వహించాయి. రష్యన్ జాతి విప్లవశక్తి, దీక్ష, శ్రమశీలత, ప్రగాఢ అంతర్జాతీయతా భావమూ, వారికి మన సోషలిస్టు మాతృభూమిలోని అన్ని యితర జాతుల మనఃపూర్వకమైన గౌరవాన్ని ఆర్జించి పెట్టడం పూర్తిగా న్యాయమైనదే.

ప్రతి ఒక్క సోదర సోవియట్ రిపబ్లిక్కు సర్వతోముఖంగా అభివృద్ధి చెందే మార్గంలో, మన దేశంలోని అన్నిజాతులూ, ఉపజాతులూ పరస్పరం మరింత సన్నిహితమయ్యే మార్గంలో గడచిన కొలది సంవత్సరాల్లో, పార్టీ నాయకత్వాన మరింత పురోగ

మించటం జరిగింది. జాతీయ లక్షణాల విషయంలోనూ, సోషలిస్టు జాతీయ సంస్కృతుల అభివృద్ధి విషయంలోనూ అత్యంత శ్రద్ధ వహించుతూ వున్న పరిస్థితుల్లో వివిధ జాతులు, పరస్పరం సన్నిహితం అవుతూ వున్నవి. యావత్తు సమాఖ్య యొక్క సార్వత్రిక ప్రయోజనాల పట్ల, అందులో భాగంగా వున్న అన్ని రిపబ్లిక్కుల ప్రయోజనాల పట్ల స్థిర మైన శ్రద్ధ, ఈ విషయంలో పార్టీ విధాన సారాంశం.

సోషలిస్టు జాతుల వికాసాన్ని పెంపొందించే, అవి క్రమంగా ఒకదాని కొకటి సన్ని హితమయేలా చేసే లెనినిస్టు పంథాను స్థిరంగా అనుసరిస్తూ సోవియట్ సోషలిస్టు రిపబ్లి క్కుల సమాఖ్యను పటిష్టం చేయటాన్ని పార్టీ కొనసాగించాలి. పార్టీ, శ్రామిక ప్రజలు యావన్మందికీ, సోషలిస్టు అంతర్జాతీయతా సరళిని బోధించటం కొనసాగించాలి. జాతీయతా వాదం పట్ల, జాతి దురహంకారం పట్ల, జాతీయ సంకుచిత తత్వంపట్ల, అహంభావం పట్ల — అవి ఏ రూపంలో ఉన్నా అసహనాన్ని అలవరచాలి; అన్ని జాతుల, ఉపజాతుల పట్ల ప్రగాఢ గౌరవభావాన్ని వారికి బోధించాలి. సోషలిస్టు నిర్మాణం సాగిన సంవత్సరాల్లో, మన దేశంలో *ఒక నూతన, చారిత్రక ప్రజా కుటుంబం, అంటే సోవియట్ ప్రజ* రూపు దాల్చింది. ఉమ్మడి శ్రమలోనూ, సోషలిజం కోసం సాగిన పోరాటంలోనూ, సోషలిజాన్ని కాపాడేందుకై సాగిన యుద్ధాల్లోనూ, వర్గాల మధ్య, సామాజిక సము దాయాల మధ్య జాతుల, ఉపజాతుల మధ్య, కొత్త, సామరస్య పూర్వకమైన, స్నేహ, సహకార సంబంధాలు రూపొందాయి.

ఉమ్మడి మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతమూ, కమ్యూనిస్టు నిర్మాణ ఉన్నతాశయాలూ మన ప్రజలను పరస్పరం బంధించుతున్నవి. తమ శ్రమ ద్వారానూ, కమ్యూనిస్టు పార్టీ విధానాన్ని ముక్తకంఠంతో ఆమోదించటం ద్వారానూ బహుళజాతి సోవియట్ ప్రజలు తమ ఏకశిలా సదృశమైన ఐక్యతను ప్రదర్శిస్తున్నారు.

గడచిన ఐదేళ్ళ కాలంలో మన సమాజ ఐక్యత మరింత పటిష్టమైంది. మన దేశంలోని అన్ని వర్గాలు, సామాజిక సముదాయాలు పరస్పరం సన్నిహితమయే క్రమాన్ని పెంపొందించేందుకై, వారి ఉమ్మడి ప్రయోజనాలను పటిష్టం చేసేందుకు మనం చేయ వలసినదంతా చేస్తూనే వుంటాం.

## 2. సోవియట్ రాజ్యాంగ వ్యవస్థను పటిష్టం చేయటం. సోషలిస్టు ప్రజాస్వామ్య అభివృద్ధి

కామ్రేడ్స్, ఇప్పుడు సమీక్షిస్తున్న కాలంలో సోవియట్ రాజ్యాంగ వ్యవస్థను మరింతగా పటిష్టం చేయటంలోనూ, మన సమాజం యొక్క యావత్తు రాజకీయ వ్యవ స్థను నిర్దుష్టం చేయటంలోనూ, మన పార్టీ గణనీయమైన, ఎంతో వైవిధ్యంతో కూడిన

కృషి చేసింది. కమ్యూనిస్టు నిర్మాణ కర్తవ్యాలను అనుసరించి, సోషలిస్టు ప్రజాస్వామ్యాన్ని మరింత అభివృద్ధి పరచటమనేదే ఈ కృషి ప్రధాన గమ్యంగా వుండేది, ఇప్పుడూ వుంటోంది.

శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్లు మనదేశంలో ప్రజాధికార సంస్థలు. అవి సోషలిస్టు రాజ్యాంగ వ్యవస్థకు పునాది; దాని ప్రజాస్వామిక స్వభావం వాటిలో పూర్తిగా మూర్తీభవించి వుంది అన్న విషయం అందరూ ఎరిగినదే. కామ్రేడ్స్, యిది మహాశక్తి. వీటిలో ఈనాడు రెండు మిలియన్ల మందికి పైగా ప్రతినిధులున్నారు. యావన్మంది ప్రజలకూ చెందిన మన రాజ్యాంగ వ్యవస్థ వ్యవహారాలను అన్ని స్థాయిల్లోనూ వీరు నిర్వహిస్తున్నారు. వీరితోబాటు సోవియట్లలో 25 మిలియన్ల మంది క్రియాశీల కార్యకర్తలున్నారు. వీరు తమ కృషికి అంకితులయిన స్వచ్ఛంద సహాయకులు.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 23వ మహాసభ నిర్ణయాలు, సోవియట్ల పాత్రను యినుమడింప జేయవలసిన అవసరాన్ని నొక్కి చెప్పిన విషయాన్ని గుర్తు చేసేందుకు అనుమతించ వలసిందిగా కోరుతున్నాను. దీన్ని సాధించేందుకు గడచిన సంవత్సరాల్లో చాలా కృషి జరిగింది. ఈ లక్ష్యంతో జిల్లా, పట్టణ, గ్రామ, పేట స్థాయిల్లోని సోవియట్ల అధికారాలను ఒక ముఖ్యమైన రంగంలో విస్తరింపజేశారు. తమకు చెందిన ప్రాంతాల్లో వున్న ఫ్యాక్టరీల, ఆర్థిక సంస్థల పనిని తమ అధికారాల పరిధిలో సమన్వయపరచటమన్నది ఈ రంగం. ఈ సోవియట్ల పాదార్థిక, ద్రవ్య వనరులను విస్తృత పరిచారు; సుశిక్షితులయిన సిబ్బందిని ఎక్కువగా సమకూర్చు తున్నారు.

సోవియట్ల కార్యకలాపాలు మొత్తంపైన బాగా క్రియాశీలమూ, బహుముఖమూ అయాయి. సోవియట్ల సభ్యులు యిప్పుడు తమ నియోజక వర్గాలలోని ఓటర్లను మరింత తరచుగా కలుసుకొంటూ, తమ కార్యకలాపాల గురించి వారికి నివేదిస్తున్నారు. మరో ముఖ్యమైన విషయమేమంటే, పత్రికలూ, రేడియో, టెలివిజన్ కేంద్రాలూ సోవియట్ల కార్యకలాపాల గురించి మరింత సమగ్రమయిన సమాచారాన్ని ప్రచారంలో పెట్టడం, క్రమేణా ఒక ఆచారంగా చేసుకుంటున్నవి.

సోవియట్ యూనియన్ సుప్రీం సోవియటూ, వివిధ యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్లూ, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధికి సంబంధించిన కీలక రంగాల్లో మంత్రిత్వ శాఖల, ప్రభుత్వ శాఖల కార్యకలాపాల పైనా, ప్రభుత్వ వ్యవహారాల పైనా అధికమైన నియంత్రణ అమలు జరుపుతున్నవి. స్థాయీ సంఘాల సంఖ్య పెరిగినందువల్ల, వాటి కార్యకలాపాలు మరింత సమర్థవంతమైనందువల్ల సోవియట్ల సభ్యులు మరింతగా చొరవ చూపేందుకూ, కార్యనిర్వాహక సంసల కార్యకలాపాలను మరింత లోతుగా అధ్యయనం చేసేందుకూ, శాసనాలను రూపొందించటంలో మరింత చురుకుగా పాల్గొనేందుకూ వీలు కలుగుతూ వుంది.

సోవియట్ శాసన నిర్మాణాన్ని నిర్దుష్ట పరచడానికి పార్టీ గొప్ప ప్రాముఖ్యం యిస్తూవుంది. ఇప్పుడు సమీక్షించుతున్న కాలంలో, పౌర ఆరోగ్యసదుపాయాలను మెరుగు పరచటం, కుటుంబ సంబంధాలను పటిష్టం చేయటం, కార్మిక సంబంధాలను మరింతగా బాగుపరచటం, ప్రకృతి సంరక్షణకు హామీ కల్పించటం, ప్రకృతి సంపదను హేతుబద్ధంగా వినియోగించటం వంటి విషయాలను శాసనరీత్యా క్రమబద్ధం చేయటాన్ని గురించి శ్రద్ధ వహించారు. కోట్లాది పౌరులు పాల్గొని విస్తారంగా చర్చలు జరిపిన తదుపరి, సోవియట్ యూనియన్ సుప్రీం సోవియటూ, యూనియన్ రిపబ్లిక్కుల సుప్రీం సోవియట్లూ, ఈ సమస్యలకు సంబంధించి తగు చట్టాలు చేశాయి.

కా|మేడ్స్, మరో అంశం. సుప్రీం సోవియట్‌లతో ప్రారంభించి, పేటల సోవియట్‌ల పర్యంతం వాటి సభ్యుల ప్రతిపత్తినీ, అధికారాలనూ, హక్కులనూ, వారి పట్ల అధికారుల విధులనూ నిర్వచించే ఒక ప్రత్యేక చట్టం ఆవశ్యకత ఎంతగానో వుంది. ఇలాంటి చట్టం చేసినందువల్ల సోవియట్‌ల సభ్యుల అధికారమూ, కార్యకలాపాలూ వృద్ధి చెందగలవని నాకు అనిపిస్తూ వుంది.

మనముందున్న కర్తవ్యాలు జయప్రదంగా నెరవేరేందుకు *ప్రభుత్వయంత్రాంగం* పని ఖచ్చితంగానూ, సమర్థవంతంగానూ వుండాలి. అందువల్ల పరిపాలనా యంత్రంపై మరిన్ని బాధ్యతలు పడుతున్నవి. ఇటీవలి సంవత్సరాల్లో ప్రవేశపెట్టడం ఆరంభించిన ఆధునిక పరిపాలనా మార్గాలూ, పద్ధతులూ, పరిపాలనా యంత్రాంగాన్ని మరింత హేతుబద్ధంగా వ్యవస్థీకరించేందుకూ, నిర్వహణ ఖర్చుల్లో కోత పెట్టేందుకూ, సిబ్బందిని తగ్గించేందుకూ తగిన పరిస్థితులను ఏర్పరుస్తాయి. ఈ దిశలో అప్పుడే చర్యలు తీసుకోవటం జరిగింది. వాటిని కొనసాగించాలి.

ప్రభుత్వ యంత్రాంగంలోని ఉద్యోగుల్లో ఎక్కువ మంది ఉన్నత శిక్షణ కలవారూ, చైతన్యవంతులూ, ఆలోచనాపరులూను. వారి కృషి అత్యంత ప్రశంసనీయంగానూ గౌరవనీయంగానూ వుంది. అయినా నిర్లక్ష్యంగా పనిచేసే అధికారులూ, నిరంకుశులూ, మొరటువారూ యిప్పటికీ వున్నారని అంగీకరించక తప్పదు. వారి నడవడి సోవియట్, ప్రజలలో ఆగ్రహాన్ని రేకెత్తించటం సరైనదే. ప్రజల తోడ్పాటును ఆధారం చేసుకొని, పరిపాలనా యంత్రాంగం పనిలో మరింత సామర్థ్యాన్ని సాధించేందుకు పార్టీ దృఢంగా కృషి చేస్తూ వుంది. ఇకముందూ ఆ కృషిని కొనసాగిస్తుంది.

మన దృష్టిలో పరిపాలనా సామర్థ్యం అంటే, శ్రామిక ప్రజల అవసరాలపట్ల శ్రద్ధా, సానుభూతులతో కూడిన వైఖరినీ, వారి సంక్షేమం పట్ల శ్రద్ధనూ, వారి అభ్యర్థనలను, కోర్కెలను వెనువెంటనే పరిశీలించడంతో అంగాంగికంగా జతపరచడ మన్న మాట. ప్రతి సంస్థలోనూ మానవునిపట్ల సద్భావమూ, గౌరవమూ గల చక్కటి వాతావరణం వెల్లివిరియాలి.

సోవియట్ సోషలిస్టు ప్రజాస్వామ్య వ్యవస్థలో, ప్రజల నియంత్రణాధికారానికి సంబంధించిన సంస్థలకు ప్రముఖ స్థానం వుంది. లక్షలాది మంది ఫ్యాక్టరీ కార్మికులూ, ఆఫీసు ఉద్యోగులూ, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులూ యిప్పుడు వీటి కృషిలో పాల్గొంటున్నారు. ప్రజాబాహుళ్యం నిరంతరమైన, ఫలదాయకమైన నియంత్రణ సాగించటం గురించి లెనిన్ చేసిన బోధలు స్థిరంగా అమలు జరిగేలా చేసేందుకు పార్టీ సర్వవిధాలా కృషి సాగిస్తూనే వుంటుంది.

కామ్రేడ్స్, మన దేశంలో శ్రామిక ప్రజలు ప్రభుత్వ సంస్థల ద్వారా మాత్రమే గాక, శాఖోపశాఖలుగా వ్యాపించి వున్న ప్రజాసంఘాల ద్వారా, ముఖ్యంగా ట్రేడ్ యూనియన్‌ల, కమ్యూనిస్టు యువజన సంఘాల ద్వారా కూడా, సమాజ పరిపాలనలో పాల్గొంటున్నారు.

మన ట్రేడ్‌యూనియన్లలో ఈ నాడు 93 మిలియన్లకు పైగా సభ్యులున్నారు. అంటే యించుమించు యావత్తు కార్మికవర్గమూ, మేధావులు యావన్మందీ, గ్రామీణ శ్రామికులు అనేక మంది వీటిలో సభ్యులుగా వున్నారు.

ప్రభుత్వ, సమాజ వ్యవహారాల నిర్వహణలో పాల్గొనేందుకై శ్రామిక ప్రజలను సమీకరించేందుకు, సోషలిస్టు ప్రజాస్వామ్య సార్వత్రిక వ్యవస్థలో ట్రేడ్ యూనియన్‌లు ఒక ముఖ్యమైన విభాగం. ప్రభుత్వ ప్రణాళికలను రూపొందించటంతో ప్రారంభించి, ఒక్కొక్క పరిశ్రమాది సంస్థ నిర్వహణ వరకు, ఆర్థికాభివృద్ధికి సంబంధించిన అనేక సమస్యలను పరిష్కరించటంలో అవి పాల్గొంటున్నవి. అవి ఉత్పత్తిలోనూ ఫ్యాక్టరీల, నిర్మాణ ప్రాజెక్టుల, ఆఫీసుల సిబ్బంది సాగించే సామాజిక కార్యకలాపాల్లోనూ ముఖ్య పాత్ర వహిస్తున్నవి. అవి శ్రమపట్లా, సామాజిక ఆస్తిపట్లా కమ్యూనిస్టు వైఖరిని నూరిపోసేందుకు సాయపడుతున్నవి; శ్రామిక ప్రజల సాంస్కృతిక, నిత్యావసరాలను తీర్చేందుకూ, వారి ఆరోగ్య రక్షణకూ కృషి చేస్తున్నవి.

శ్రామిక ప్రజల న్యాయమయిన ప్రయోజనాలను రక్షించటం ట్రేడ్‌యూనియన్‌ల మౌలిక కర్తవ్యాల్లో ఒకటిగా వుంటూనే వుంది. ఉదాహరణకు, ఒక పద్ధతి ప్రకారం ఓవర్‌టైం పని చేయించే, పనివారికి నిష్కారణంగా శెలవు ల్లేకుండా చేసే ఫ్యాక్టరీలు, అక్కడక్కడా కార్మిక భద్రత సరైన విధంగాలేని ఫ్యాక్టరీలు వున్నవనేది రహస్యమేమీ కాదు. ఈ అసాధారణ పరిస్థితులను నిర్మూలించేందుకు ట్రేడ్‌యూనియన్‌లు చేయగలది ఎంతో వుంది.

ట్రేడ్‌యూనియన్‌ల పాత్రనూ, సామర్థ్యాన్నీ పెంచడాన్ని కొనసాగించటమే పార్టీ పంథా. ట్రేడ్‌యూనియన్‌లపై అల్పబుద్ధితో పెత్తనం చెలాయించేందుకు పూనుకోకుండా పార్టీ సంస్థలు ట్రేడ్‌యూనియన్ల కార్యకలాపాలనూ, చొరవనూ పెంపొందించేందుకు సర్వవిధాలా కృషి చేయాలి; కార్యకర్తలను సమకూర్చి వాటిని బలపరచాలి. ట్రేడ్

యూనియన్‌లలో పని చేసే కమ్యూనిస్టులు మరింత ఎక్కువ బాధ్యతలు వహించి పని చేసేలా చూడాలి.

శ్రామిక ప్రజల అతి పెద్ద సంస్థలుగా వున్న ట్రేడ్‌యూనియన్‌లు, పరిపాలనా నిర్వహణ పాఠశాలలుగా, ఆర్థిక మేనేజిమెంటు పాఠశాలలుగా, కమ్యూనిజం పాఠశాలలుగా తమ పాత్రను మరింత సంపూర్ణంగానూ, జయప్రదంగాను నిర్వహించేలా చేసేందుకు పార్టీ వాటికి స్థిరమైన తోడ్పాటును కొనసాగిస్తూనే వుంటుంది.

లెనిన్ కమ్యూనిస్టు యువజన సంఘానికి దేశ సామాజిక, రాజకీయ జీవితంలో ఒక ముఖ్య స్థానం వుంది. 28 మిలియన్ల మంది యువతీ యువకులు అందులో సభ్యులుగా వున్నారు. కమ్యూనిస్టు యువజన సంఘ సభ్యుల శక్తి, సృజనాత్మక చొరవ, దీక్ష ప్రదర్శితం కాని ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి రంగం ఒక్కటి కూడ లేదు. యువజన సంఘాలు నిర్వహించే ముమ్మర నిర్మాణ ప్రాజెక్టులు, యువ కార్మికుల నైపుణ్యం పోటీలు, విద్యార్థుల నిర్మాణ దళాలు, యువజనుల ఉత్పత్తి బృందాలు, వేసవి శ్రామిక శిబిరాలు, వినోద శిబిరాలు—సోవియట్ యువజనులకు నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టు యువజన సంఘం సాధిస్తున్న నిర్దిష్టమైన, ముఖ్యమైన కర్తవ్యాల్లో యివి కొన్ని.

కమ్యూనిస్టు లక్ష్యాల సరళిలో, సోవియట్ మాతృభూమి పట్ల విధేయతా సరళిలో, అంతర్జాతీయతా సరళిలో యువజనులను వృద్ధిలోకి తీసుకురావటం, మన సమాజం యొక్క సాంస్కృతిక ప్రమాణాలనూ విలువలనూ చురుకుగా ప్రచారం చేయటం—ఇదే లోగడా యిప్పుడూ కూడా కమ్యూనిస్టు యువజవ సంఘం యొక్క, కీలక కర్తవ్యం.

మన యువజనుల్లోని వేరు వేరు సముదాయాలకు—యువ కార్మికులు, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల యువ రైతులు, యువ ప్రవీణులు, విద్యార్థులు, బడిపిల్లలు—తమ తమ స్వంత లక్షణాలు వున్నవి. కమ్యూనిస్టు యువజన సంఘం ఈ సముదాయాల్లోని ప్రతి ఒక్క దానితోనూ కలిసి పని చేయగలిగి వుండాలి. యువతీ యువకులు సరిగ్గానూ, సకాలంలోనూ, ఒక వృత్తి వైపు మొగ్గటమూ, ఫ్యాక్టరీల్లో, క్షేత్రాల్లో, పొలాల్లో జరిగే పని పట్ల ప్రగాఢ గౌరవభావంతో కూడిన సరళిలో వారు విద్యావంతులు కావటమూ ఈ విషయం పైనే చాలావరకు ఆధారపడి వుంటుంది.

యువజనుల శ్రమ, విద్య, వినోదం, నిత్యజీవితం, వీటి విషయంలో కమ్యూనిస్టు యువజన సంఘ కర్తవ్యాల వైవిధ్యం యిటీవలి సంవత్సరాల్లో బాగా పెరిగింది. బాధ్యతాయుతమైన కృషి రంగాలను కమ్యూనిస్టు యువజన సంఘ సభ్యులకు అప్పగించేందుకు పార్టీ సంస్థలు ఎక్కువ పట్టుదల చూప నారంభించాయి. సామాజికంగా, రాజకీయంగా కమ్యూనిస్టు యువజన సంఘం యిప్పుడు మరింత చురుకుగా పనిచేస్తూ వుంది. ప్రభుత్వాధికార సంస్థలకు అంటే, శ్రామిక ప్రజా ప్రతినిధుల సోవియట్లకు, 5 లక్షల మందికి పైగా

యువజనులు ఎన్నిక కావటం యిందుకు ఒక సూచన. సోవియట్ యూనియన్ సుప్రీం సోవియట్ సభ్యుల్లో దాదాపు నూటికి 20 మంది యువజనులు.

కమ్యూనిస్టు యువజన సంఘంలో నుంచి కొత్త శక్తులను, పార్టీ నిరంతరం తనలో చేర్చుకుంటూ వుంది. 23 వ మహాసభ అనంతరం పార్టీలో చేరిన కొత్త సభ్యుల్లో 45 శాతం, లేదా 1,350,000 మంది యువజన సంఘం నుంచి వచ్చినవారే. అదే కాలంలో కమ్యూనిస్టు యువజన సంఘంలో పని చేస్తున్న కమ్యూనిస్టుల సంఖ్య రెట్టింపు అయింది. కమ్యూనిస్టు యువజన సంఘ సంస్థల్లోని పార్టీ బృందాలను బలపరచడం గురించిన 23 వ మహాసభ ఆదేశాలకు యిది అనుగుణంగానే వుంది. పార్టీలో చేర్చుకోబడిన కమ్యూనిస్టు యువజన సంఘసభ్యులు తమ తమ పార్టీ సంస్థలు తమకు యితర బాధ్యతలు యిచ్చేవరకు కమ్యూనిస్టు యువజన సంఘంలోనే క్రియాశీలురుగా పని చేస్తూ వుండాలనే నియమం పెట్టటం బాగుంటుంది.

యువ కమ్యూనిస్టు నిర్మాతలను చూచుకొని పార్టీ గర్వించటం సరైనదే. మన రాజకీయ అనుభవాన్నీ, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి సమస్యలను పరిష్కరించటానికి సంబంధించిన అనుభవాన్నీ వర్ధమానతరానికి అందజేయటమూ, యువజనుల సైద్ధాంతిక వికాసానికి మార్గం చూపటమూ, తమ తండ్రుల ఆశయాన్ని, మహానుభావుడైన లెనిన్ ఆశయాన్ని కొనసాగించేందుకు తగినవారుగా వారిని తీర్చి దిద్దేందుకు సర్వవిధాలా కృషి యచేటమూ మన విధి.

సోషలిస్టు సమాజానికి ప్రాథమిక సంస్థలయిన శ్రామిక సమిష్టి సంస్థల పాత్రను యినుమడింప జేయటం సోషలిస్టు ప్రజాస్వామ్యం అభివృద్ధిలో ఒక ముఖ్య కర్తవ్యం. సోవియట్ ప్రజల శ్రామిక, సామాజిక కార్యకలాపాలను పెంచే పోరాటానికి సంబంధించిన ఒక ప్రధాన రంగం యిది. శ్రామిక ప్రజల నూతన, సోషలిస్టు లక్షణాలూ, స్నేహ, సోదర భావాలతో కూడిన పరస్పర సహకారమూ ఈ సమిష్టి సంస్థల్లో రూపు దాల్చుతాయి. సమిష్టి సంస్థపట్ల ప్రతి ఒక్కరికీ బాధ్యత, వారిలోని ప్రతి ఒక్క సభ్యుని పట్ల సమిష్టి సంస్థకు బాధ్యత—ఇది మన జీవిత విధానం యొక్క తిరుగులేని లక్షణం.

ఇప్పుడు సమీక్షిస్తున్న కాలంలో న్యాయనిర్వహణనూ, శాంతి భద్రతలనూ పటిష్టం చేసేందుకూ, చట్టాలనూ, సోషలిస్టు సామాజిక సంబంధాల నియమాలనూ పాటించడాన్ని ప్రజలకు బోధించేందుకూ, కేంద్రకమిటీ, సోవియట్ ప్రభుత్వమూ చర్యలు తీసుకోటం కొనసాగించాయి. మిలీషియా యొక్క, ప్రాక్యురేటర్ కార్యాలయం యొక్క, న్యాయస్థానాల యొక్క కార్యకలాపాలను మెరుగు పరచటం జరిగింది.

న్యాయనిర్వహణను పటిష్టం చేసే కర్తవ్యం ప్రభుత్వ యంత్రాంగానికి మాత్రమే సంబంధించింది కాదు. చట్టాలు కచ్చితంగా పాటించబడేలా శాయశక్తులా కృషి చేయటమూ, శ్రామిక ప్రజలలో చట్టాల గురించిన పరిజ్ఞానాన్ని పెంపొందించటమూ పార్టీ

సంస్థల, ట్రేడ్ యూనియన్ల, కమ్యూనిస్టు యువజన సంఘ సంస్థల విధ్యుక్త ధర్మం. న్యాయ నిర్వహణ పట్లా, చట్టం పట్లా, గౌరవం ప్రతి ఒక్క వ్యక్తి స్వభావంలో భాగం కావాలి. అధికార స్థానాల్లో వున్న వారి కిది మరింతగా వర్తిస్తుంది. ఉద్దేశ మేదైనా సరే చట్టాలను ఉల్లంఘించేందుకూ, వాటిని దాటవేసేందుకూ జరిగే ప్రయత్నాన్ని సహించరాదు. వ్యక్తుల హక్కులను ఉల్లంఘించటాన్నీ, పౌరుల ఆత్మగౌరవాన్ని భంగపరచటాన్నీ కూడా అనుమతించ జాలం. అత్యుత్తమ మానవతా ఆదర్శాలకై పోరాడే కమ్యూనిస్టుల మైన మనకు యిది ఒక నియమం.

నేరాలను నిరోధించటం చాలా తీవ్రమైన కర్తవ్యం. కొన్ని రకాల నేరాలకు యిటీవల, కఠినమైన శిక్షలు నిర్ణయించారు. న్యాయశాస్త్రాన్ని అనుసరించి శిక్ష విధించడంతో బాటు, నేరాలను నిపత్సాహపరచే, వాటిని నివారించే మార్గాలనూ, సాధనాలనూ కనిపెట్టేం దుకు గొప్ప శ్రద్ధ చూపుతున్నాం.

సామ్రాజ్యవాదులు విద్రోహ కార్యకలాపాలు సాగిస్తూన్న స్థితితో ప్రభుత్వ భద్రతా సంస్థలు ముఖ్యమైన పాత్రను నిర్వహించవలసి వుంది. ఇప్పుడు సమీ క్షిస్తున్న కాలంలో రాజకీయ పరిపక్వత గల సిబ్బందిని సమకూర్చి ఆ సంస్థలకు పుష్టి చేకూర్చాం. లెనినిస్టు సూత్రాల తత్వాన్నీ, సోషలిస్టు న్యాయ నిర్వహణనూ ఖచ్చితంగా పాటించడాన్నీ, శత్రు శక్తుల కార్యకలాపాల నుండి, సామ్రాజ్యవాద గూఢచారి శాఖల కుతంత్రాల నుండి సోవియట్ సమాజాన్ని కాపాడేందుకై చేసే పోరాటంలో అచంచల జాగరూకతనూ ఈ సంస్థలకు పార్టీ నికరంగా అలవరుస్తుంది.

కామ్రేడ్స్, ప్రజలు సృష్టించిన ప్రతి ఒక్కదాన్నీ నమ్మకంగా కాపాడాలి. సోవి యట్ రాజ్యాన్ని పటిష్టం చేయటమంటే, దాని సాయుధ బలాలను పటిష్టం చేయ టమూ, దేశం యొక్క రక్షణశక్తిని సాధ్యమైనంత ఉన్నతస్థాయికి గొనిపోవడమూ అన్న మాట. మనం సంక్షుభిత ప్రపంచంలో వున్నంత కాలం యిది ఒక ముఖ్య కర్తవ్యంగానే వుంటుంది।

సోవియట్ సైన్యం మన ప్రజల్లో భాగం. అది వారి ప్రయోజనాల్లో పాలు పంచు కుంటుంది. మన దేశంలో సైనిక సేవ కేవలం పోరాట నైపుణ్యాన్ని బోధించే పాఠశాల వంటిది మాత్రమే కాదు. అది సైద్ధాంతికంగానూ, శారీరకంగాను కాకలు దీర్చే, క్రమ శిక్షణనూ, నిర్మాణాన్నీ అలవరచే చక్కని పాఠశాల కూడా.

ప్రజల సంకల్పాన్ని నెరవేర్చుతూ, దేశ రక్షణను పటిష్టం చేసేందుకు పార్టీ నిర్వి రామంగా పాటుపడుతూ వుంది. ఇప్పుడు సమీక్షించు కుంటున్న కాలంలో మనం ప్రధా నంగా శ్రద్ధ వహించిన సమస్యల్లో సాయుధబలాల అభివృద్ధికి సంబంధించిన సమస్యలు కూడా వున్నవి. ఇటీవలి సంవత్సరాల్లో తీసుకున్న చర్యల ఫలితంగా, మన సాయుధ బలాల శక్తినీ, పోరాట పటిమనూ, గణనీయంగా పటిష్టం చేయ వీలైంది. రాత్రీ పగలూ,

ఏవేళలోనైనా సరే, ఎటువైపు నుంచీ నైనాసరే వచ్చే శత్రుదాడిని తిప్పి కొట్టేందుకు ఉజ్వలమైన మన సాయుధబలాలు సిద్ధంగా వున్నవని సోవియట్ ప్రజలు నమ్మకోవచ్చు. ఏ దురాక్రమణదారైనా సరే, మన దేశంమీద అణు, రాకెట్ ఆయుధాలతో దాడి చేయ ప్రయత్నించి నట్లయితే, సర్వ నాశనకరమైన ఎదురుదెబ్బ తగులుతుందని అతడికి పూర్తిగా తెలుసు.

ఉజ్వలమైన సోవియట్ సైన్యం గురించి చెప్పేటప్పుడు, మన యుద్ధవీరుల గురించి, దేశభక్త మహా యుద్ధంలో మన దేశ స్వాతంత్ర్యాన్ని రక్షించిన సైనికుల, సైన్యాధిపతుల గురించి కొన్ని ప్రశంసా వాక్యాలు చెప్పుకోవాలి. యుద్ధకాలపు నాటి విపరీతమైన ఉద్రేకాలను గడిచిన తరువాత వారికి విశ్రాంతే చిక్కలేదు; యుద్ధ వీరులు మళ్లీ రంగంలోకి—శ్రామిక రంగంలోకి వచ్చారు. యుద్ధకాలం నాటి మన సహయోధులు చాలామంది యిప్పుడు మనమధ్య లేరు. కాని లక్షలాది మంది యిప్పటికీ రంగంలోనే వున్నారు. కొందరు సైన్యంలోనే వుండి పని చేస్తున్నారు. మరి కొందరేమో ఫ్యాక్టరీల్లో, నిర్మాణ స్థలాల్లో, సమిష్టి వ్యవసాయక్షేత్రాల్లో, వైజ్ఞానిక సంస్థలో, పాఠశాలల్లో తమ జ్ఞానాన్నీ, శ్రమనూ, దేశానికి ధారపోస్తున్నారు. వారికి మంచి ఆరోగ్యమూ, సుఖమూ, కమ్యూనిజం కోసం గావించే కృషిలో సరికొత్త విజయాలూ చేకూరాలని ఆకాంక్షించుదాం!

కామ్రేడ్స్, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థకూ, ప్రపంచ పెట్టుబడిదారీ వ్యవస్థకూ మధ్య సాగుతున్న సిద్ధాంత, రాజకీయ పోరాటంలో యిప్పుడు ప్రజాస్వామ్యానికి సంబంధించిన సమస్యలు ప్రాధాన్యం వహిస్తున్నవని మీ రెరుగుదురు. మనకు ప్రజాస్వామం లేదని ఆరోపిస్తూ, బూర్జువా సిద్ధాంతవేత్తలూ, రివిజనిస్టులూ కపటంతో గగ్గోలు పెడుతున్నారు. సోషలిజాన్ని "మెరుగు పరచటం" గురించి, దాన్ని "ప్రజాస్వామ్యయుతం చేయటం" గురించి, వారు మనకు నానారకాల "సలహాలు" యిస్తున్నారు. వారి శ్రద్ధ సోషలిజం గురించి కాదనేది నిశ్చయం. మనను బూర్జువా అచరణలకు మరల్చాలని వారు కోరుతున్నారు. అందుకని మనపై బూర్జువా ప్రజాస్వామ్యాన్ని రుద్ద జూస్తున్నారు. అది దోపిడీదారుల ప్రజాస్వామ్యం, ప్రజల ప్రయోజనాలకు వ్యతిరేకమైన ప్రజా స్వామ్యం.

వారిది వృథా శ్రమ. సోవియట్ ప్రజలకు స్వంత ప్రజాస్వామ్యం, అంటే సోషలిస్టు ప్రజాస్వామ్యం వుంది. దాన్ని అభివృద్ధి పరచేందుకు వారికి స్వంత సూత్రాలూ, సంప్రదాయాలూ వున్నాయి. సార్వజనిక ప్రజాస్వామ్యం లాంటిది ఏదీ లేనట్లే, సార్వజనిక స్వేచ్ఛ కూడా ఏదీలేదు. ఇది వర్గ భావన. ఈ విషయాన్ని లెనిన్ ప్రతిపాదించిందీ, ఈనాడు పార్టీ ప్రతిపాదిస్తున్నదీ ఈ విధంగానే. ప్రభుత్వ, సామాజిక వ్యవహారాల నిర్వహణలో, ప్రజాబాహుళ్యం అధికాధికంగా పాల్గొనటమే సోషలిస్టు ప్రజాస్వామ్యం యొక్క అర్థమూ, సారాంశమూనని మన అభిప్రాయం. మన దేశంలోని సమాజ రాజ

కీయ వ్యవస్థ, స్థిరంగా పెరుగుతూన్న ప్రజల చొరవా, యివి యావత్తూ కూడా కమ్యూనిజం నిర్మాణానికి తోడ్పడుతున్నవి. ఈ రకమైన ప్రజాస్వామ్యం మనకు ముఖ్యమైనదీ, సోషలిస్టు సామాజిక సంబంధాల అభివృద్ధికీ, పటిష్టతకూ అనివార్యమైనదీను.

మన సోషలిస్టు ప్రజాస్వామ్యం స్థిరంగా అభివృద్ధి చెందాలి; ప్రతిఒక్క పౌరుడూ, ఆ మాటకు గల నిజమైన అర్థంలో తాను పౌరుడననుకోవాలి; అతడు యావత్తు దేశ ఆశయం పట్ల ఆసక్తి గలవాడుగా, అందుకు తనవంతు బాధ్యత వహించే వాడుగా వుండాలి—ఇది మన పార్టీ నిరంతరం శ్రద్ధ వహిస్తున్న ఒక అంశం. పార్టీ ఈ పంథానే స్థిరంగా అమలు పరుస్తూ వుంటుంది.

## 3. నవమానవుణ్ణి తీర్చిదిద్దడం కమ్యూనిస్టు నిర్మాణంలో పార్టీ ప్రధాన కర్తవ్యాల్లో ఒకటి

అన్ని రూపాల్లోనూ సైద్ధాంతిక కార్యకలాపాలను మరింత పెంపొందింప చేయడం, ప్రజా బాహుళ్యానికి రాజకీయ బోధన, ప్రజల సాంస్కృతిక స్థాయిని పెంచడం— ఇక్కడ సమీక్షిస్తున్న కాలంలోని పార్టీ కార్యకలాపాల్లో ఇవి ముఖ్యమైన స్థానం అలంకరించాయి. అసలు మానవుడే పొందికగా అభివృద్ధి చెందకపోతే, కమ్యూనిజం నిర్మాణం అనే మహత్తర యోజన ముందుకు పురోగమించ జాలదు. పాదార్థిక, సాంకేతిక పునాది లేకపోయినట్లయితే కమ్యూనిజం ఎలా అనూహ్యమో, అదే విధంగా ఉన్నతస్థాయి సంస్కృతి, విద్య, పౌరధర్మ తత్పరత, ప్రజల అంతర్ పరిపాకము లేకపోయినా కూడా అది అనూహ్యమే.

యావత్తు సోషలిస్టు జీవిత విధానం, సామాజిక వ్యవహారాల యావత్తు గతిక్రమం, అన్నిటినీ మించి పార్టీ, దాని సంస్థలన్నీ లక్ష్యశుద్ధితోనూ, పట్టు విడవని దీక్షతోనూ సాగిస్తూన్న సైద్ధాంతిక, బోధనా కార్యక్రమం—ఇవి సోవియట్ ప్రజల నైతిక, రాజకీయ స్వరూప స్వభావాలను తీర్చిదిద్దుతున్నాయి.

విశాల ప్రజాబాహుళ్యంలో కమ్యూనిస్టు ప్రపంచ దృక్పథం రూపొందడం, మార్క్సిస్టు-లెనినిస్టు భావాల తత్వాన్ని వారికి బోధించడం—ఇవి పార్టీయొక్క సైద్ధాంతిక, బోధనా కార్యకలాపా లన్నిటి మూలాంశం.

అయితే అన్నిటికన్నా పురోగామి అయిన సిద్ధాంతం కూడా, ప్రజా బాహుళ్యాన్ని తనవైపు తిప్పుకున్న మీదట, వారిని శక్తివంతమైన కార్యక్రమానికి పురికొల్పినప్పుడూ, వారి దైనందిన ప్రవర్తన ప్రమాణాలను నిర్ణయించినప్పుడు మాత్రమే అది ఒక భౌతిక శక్తిగా రూపొందగలదు. సోవియట్ ప్రజల్లో పనిపట్ల కొత్త, కమ్యూనిస్టు వైఖరిని తీర్చిదిద్దడం, పార్టీ సైద్ధాంతిక కార్యకలాపాల అతి ముఖ్య లక్ష్యాల్లో ఒకటి. ఇది

బ్రహ్మాండమైన కర్తవ్యం. "ఒక కొత్త శ్రామిక క్రమశిక్షణనూ, ప్రజలమధ్య కొత్త రూపాల సామాజిక బంధాలనూ, శ్రమపైపు ప్రజలను ఆకర్షించేందుకు కొత్త రూపాలనూ, పద్ధతులనూ సృష్టించడానికి చాలా సంవత్సరాలూ, దశాబ్దాలూ పడుతుంది. ఇది ఎంతో సంతృప్తిని కలిగించగల ఉదాత్తమైన కృషి" (కలెక్టెడ్ వర్క్స్, సం. 30, పుట 518) అని లెనిన్ నొక్కి చెప్పినది సరి అయినదే అని అనుభవం తిరుగులేని విధంగా నిరూపించింది. ఇవి అమోఘమైన మాటలు! వాటి నుండి మనం తగు నిర్ధారణలు చేసు కోవాలి.

మన దేశంలో సోషలిజం విజయవంతం కావడం కనీవినీ ఎరుగనంతగా పెద్ద ఎత్తున శ్రామిక ఉత్సాహాన్ని ప్రతిబింబించే స్తఖనోవ్ ఉద్యమం, పని పట్ల కమ్యూనిస్టు వైఖరిని పెంపొందించే ఉద్యమం మొదలైనవాటికి దారితీసింది. గత అయిదేళ్ళలోనూ ఈ రంగంలో అనేక కొత్త పరిణామాలు వచ్చాయి. శ్రామిక పోటీ నిజంగా దేశ వ్యాపిత పరిమాణాలను అందుకుంది.

పనిపట్ల కమ్యూనిస్టు వైఖరిని పెంపొంద జేసేందుకు సాగుతూన్న ప్రజా ఉద్యమాన్ని బలపరచడం, సోవియట్ ప్రజల సృజనశీలమైన చొరవను అన్ని విధాలా ప్రోత్సహించడం—పార్టీ దృష్టిలో యిదే ప్రస్తుత కర్తవ్యం. అక్టోబర్ మహావిప్లవం 50 వ వార్షికోత్సవం గౌరవార్థమూ, వి. ఐ. లెనిన్ శతజయంతి గౌరవార్థమూ దేశ వ్యాప్తంగా సాగించిన సోషలిస్టు పోటీ ఉద్యమం, దేశ వ్యాపితమైన లెనిన్ సబోత్నిక్ ఉద్యమం—పట్టణాల్లోనూ, పల్లెసీమల్లోనూ ప్రజలు చొరవతో పెద్ద ఎత్తున సాగించే యిటువంటి వాటి నన్నింటిని ప్రోత్సహించడం గురించి, వాటిని విస్తరింప జేయడం గురించి యిటీవలి సంవత్సరాల్లో మనం అనేక తీర్మానాలు చేసిన విషయం మీకు తెలిసినదే. మాస్కో, లెనిన్ గ్రాడ్ నగరాల్లోని కార్మికుల సమిష్టి సంస్థలు ప్రదర్శించిన అద్భుతమైన చొరవను పార్టీ కేంద్రకమిటీ ఆమోదించింది. తమ నగరాల మహత్తర సంప్రదాయాలకు బద్ధులై వున్న ఈ శ్రామిక సమిష్టి సంస్థలు పంచవర్ష ప్రణాళికలను గడువుకన్నా ముందుగానే పూర్తి చేసేందుకు ఒక పోటీ ఉద్యమాన్ని ప్రారంభించాయి. అంతే కాదు, లోహకారులు, నూనె పరిశ్రమ కార్మికులు, గని కార్మికులు, మోటారు కారు నిర్మాతలు, రవాణా కార్మికులు, శ్రామిక ప్రజల్లోని తదితర దళాలు, ఉత్పత్తి విషయంలో తలపెట్టిన నిర్దిష్టమైన కార్యక్రమాలను కేంద్రకమిటీ బలపరిచింది.

తమ దేశంపట్లా, తమ ప్రజలపట్లా, వారి ఘనవిజయాల పట్లా గర్వభావాన్ని, గత కాలపు ముఖ్య విజయాలపట్ల గౌరవభావాన్ని సోవియట్ ప్రజల్లో పెంపొంద జేసేందుకు యిటీవలి సంవత్సరాల్లో ఎంతో కృషి జరిగింది.

కమ్యూనిస్టు యువజన సంఘమూ, సైన్యాన్నీ, విమానబలాన్నీ, నౌకాబలాన్నీ అభివృద్ధిపరచే ఐచ్ఛిక సమాజమూ, తదితర సంస్థలూ, క్రీడా సంస్థలూదేశ రక్షణలో యువ

జనులకు తర్ఫీదు నిచ్చేందుకు సాగిస్తూన్న కృషికి ఎంతో ప్రాధాన్యం వుంది. అనేక సోవియట్ సాహిత్య రచనల్లోనూ, కళా ఖండాల్లోనూ దేశ భక్తి సముచితంగా ప్రతిబింబిత మౌతూంది. విప్లవంలోనూ, సైనిక చరిత్రలోనూ, శ్రామిక కార్య కలాపాల్లోనూ మహోజ్వల ఖ్యాతి గడించిన ప్రదేశాలకు సామూహిక యాత్రలూ మొదలైన కార్య కలాపాల్లో యువజనులు చూపిస్తూన్న గౌరవ మెచ్చుకోదగినది.

దజన్లకొలదీ పట్టణాల్లోనూ, గ్రామాల్లోనూ సైనిక వీరకృత్యాల స్మారక చిహ్నాలను నిర్మించడం జరిగింది. ఓల్గోగ్రాద్, లెనిన్‌గ్రాద్ నగరాల్లోనూ, మాస్కో నగరం చుట్టూ, స్మొలెన్స్క మండలంలోనూ, బైలో రష్యాలోనూ, ఉక్రైన్ లోనూ, బాల్టిక్ రిపబ్లిక్కులోనూ, కాకసస్‌లోనూ, మాతృదేశం కోసం తమ ప్రాణా లర్పించిన వీరుల స్మృతి పట్ల సోవియట్ ప్రజలకు గల అపారమైన గౌరవ భావానికి చిహ్నంగా అద్భుతమైన స్మారక నిర్మాణాలు వున్నాయి.

సోవియట్ ప్రజల దేశభక్తినీ, తమ సోషలిస్టు మాతృదేశ సౌభాగ్యాన్ని పెంపొందజేసేందుకూ, విప్లవం ప్రసాదించిన లాభాలనూ, సోషలిస్టు ఆశయాన్నీ కాపాడేందుకు తమను తాము పూర్తిగా అంకితం చేసుకొనేందుకు వారి సంసిద్ధతనూ అమూల్య మయినవిగా పార్టీ పరిగణిస్తూంది.

కామ్రేడ్స్, సోవియట్ మానవుని నూతన స్వరూప, స్వభావాలు, అతని కమ్యూనిస్టు నీతి, కమ్యూనిస్టు దృక్పథమూ, గతకాలపు అవశేషాలకు వ్యతిరేకంగా నిరంతరం సాగే రాజీ లేని పోరాటంలో పటిష్ఠం అయాయి. ధనాశ, లంచగొండితనం, పరశ్రమోపజీవనం, నిందా ప్రచారం, ఆకాశరామన్న లేఖలను రాయడం, తాగుబోతుతనం మొదలైనవి కమ్యూనిస్టు నీతికి విరుద్ధమైనవి. వీటికి వ్యతిరేకంగా దీక్షతో పోరాటం సాగించనిదే కమ్యూనిస్టు నీతి విజయవంతం కాజాలదు. ప్రజల మనసుల్లోనూ, కార్య కలాపాల్లోనూ మిగిలివున్న గతకాలపు అవశేషాలని మనం అంటున్నవాటికి వ్యతిరేకంగా పోరాటం సాగించడం, పార్టీ, మన సమాజంలోని చైతన్యయుత, పురోగామి శక్తులన్నీ నిరంతరం శ్రద్ధ వహించవలసిన విషయం.

ప్రజలపట్ల శ్రద్ధా గౌరవాలతో కూడిన వైఖరి, నిజాయితీ, తనపట్లా, ఇతరులపట్లా నిష్కర్షతా, ఖచ్చితమైన బాధ్యతా భావంతో సమ్మిళితమైన నమ్మకం, అన్ని సామాజిక జీవిత రంగాలలోనూ, పనిలోనూ, దైనందిన సంబంధాలలోనూ. నిజమైన సహోదరత — వీటిని ఏర్పరచేందుకు తోడ్పడగల నైతిక వాతావరణాన్ని మన సమాజంలో సృష్టించడానికి యిప్పుడు సమీక్షిస్తున్న కాలంలో పార్టీ కేంద్రకమిటీ తగు చర్యలు తీసుకుంది. ఒక్క మాటలో చెప్పాలంటే, తాము మునుపటికన్నా బాగా జీవిస్తున్నాము, బాగా పని చేస్తున్నాము అని మన దేశంలో ప్రతిఒక్కరూ భావించేలా చేయడమే మన, లక్ష్యంగా ఉంటూ వచ్చింది.

ఈ కృషి ఫలితాన్ని అంకెల్లోనూ, గణాంక వివరాల రూపంలోనూ, తెలియ జేయడం కష్టమని వేరే చెప్పనక్కర లేదు. అయినా మన పార్టీలోనూ, సమాజం లోనూ నైతిక వాతావరణం మరింత మెరుగు కావడం ప్రతి ఒక్క సోవియట్ పౌరుని అనుభూతి లోకి వచ్చిన విషయమనేది స్పష్టం. ఈ మార్గాన్నే మనం యింకా ముందుకు పోయి తీరుతాము.

కా(మేడ్స్, కమ్యూనిజానికి పరివర్తన చెందేందుకు ఆర్థిక రంగంలో మాత్రమే కాకుండా, మొత్తం సమాజం యొక్క సంస్కృతీ రంగంలో కూడా ఉన్నత స్థాయిలో అభివృద్ధి సాగించడం అవసరం.

విద్యా, విజ్ఞానశాస్త్రం, కళల రంగాల్లో యిటీవలి సంవత్సరాల్లో పార్టీ సాగించిన కృషిని గురించి, ఆ రంగాల్లోని మొత్తం పరిస్థితిని గురించి మనం చెప్పవలసినది ఏమిటి?

సార్వజనిక సెకండరీ విద్యా విధానానికి పరివర్తన చెందడం, 1970 చివరి నాటి కల్లా పూర్తిచేయాలన్న కర్తవ్యాన్ని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభ ఆదే శాలు నిర్దేశించాయి. ఈ లక్ష్యాన్ని సాధించడం కోసం సాధారణ విద్యా సంస్థల శాఖోప శాఖలను (పగటి పాఠశాలలను, సాయం పాఠశాలలను), ప్రత్యేక సెకండరీ పాఠశాల లను (వృత్తి పాఠశాలలు మొదలైనవాటిని), అదనంగా విస్తరింప జేయడం జరిగింది; తమ తమ విద్యార్థులకు పూర్తి సెకండరీ విద్యను బోధించే యితర వృత్తి పాఠశాలల సంఖ్యను పెంచడం జరిగింది. ఫలితంగా, నిర్ణీత లక్ష్యాన్ని యింకా సాధించలేక పోయి నప్పటికీ, దానికి చాలా దగ్గరగా చేరుకున్నాము: ఈనాడు ఎనిమిదేళ్ళ విద్యను పూర్తి చేసిన విద్యార్థుల్లో దాదాపు 80 శాతం మంది, పూర్తి సెకండరీ విద్యను అభ్యసిస్తున్నారు. సాధారణ విద్యను బోధించే పాఠశాలల నాయక పాత్రను కొనసాగిస్తూనే, సార్వజనిక సెకండరీ విద్యా విధానాన్ని అమలు జరిపేందుకు అత్యుత్తమ మార్గాలలో ఒకటి, సెకండరీ విద్యను బోధించే వృత్తి పాఠశాలలను యింకా ఎక్కువగా నిర్మించడం అని భావి స్తున్నాము.

ఉన్నత విద్యా సంస్థల సంఖ్య పెరుగుతూనే వుంది. తొమ్మిది విశ్వ విద్యాలయా లతో సహా, 60కి పైగా కొత్త ఉన్నత విద్యా సంస్థలను గత ఐదేళ్ళలోను ప్రారంభిం చడం జరిగింది. ఈనాడు ప్రతియొక్క యూనియన్ రిపబ్లిక్‌లోనే కాకుండా, అనేక స్వపరి పాలక రిపబ్లిక్‌లలో కూడా సొంత విశ్వ విద్యాలయా లున్నవి.

మన పాఠశాలలలోను, ఉన్నత విద్యా సంస్థలలోను అధ్యయన క్రమానికి కొత్త విషయ పుష్టి నిచ్చేందుకు కూడా చాలా కృషి జరిగింది. శాస్త్ర, సాంకేతిక ప్రగతి అవ సరాలకు, ఆధునిక శాస్త్ర పరిజ్ఞాన సార్వత్రిక స్థాయికి దానిని మరింత అనుగుణం చేయడం జరుగుతూంది.

పౌర విద్యా వ్యవస్థలోని అన్ని విభాగాలను అభివృద్ధి పరచడం ఫలితంగా, పార్టీ

23 వ మహాసభ ఆదేశాలలో మరొక ముఖ్యమైనది కూడా పూర్తిగా నెరవేరింది. గత ఐదేళ్ళలోనూ ఉన్నత, లేదా సెకండరీ ప్రత్యేక విద్య గల ప్రవీణులు 7 మిలియన్ల మందికి పైగా తర్ఫీదు పొందారు. కమ్యూనిజం నిర్మాతల మహా సైన్యానికి యిది చాల అవసరమైన మంచి అదనపు బలం.

పౌర విద్యా వ్యవస్థ అనేక కొత్త వృత్తులలో శిక్షణ యివ్వడంతో సహా ఒక పెద్ద ప్రవీణుల దళాన్ని కూడా తర్ఫీదు చేయాలి. అన్ని రంగాలు ఈనాడు ఎంత వేగంగా పురోగమిస్తున్నాయంటే, యువజను లభ్యసిస్తున్న విద్య కేవలం ఒక పునాది మాత్రమే; కొత్త పరిజ్ఞానాన్ని దానికి నిరంతరం చేర్చుకుంటూ రావడం అవసరం. దీనివల్ల కార్యకర్తల విద్యార్హతలను క్రమబద్ధంగా అభివృద్ధి పరచడం అతి ముఖ్య మవుతూంది.

సామాజిక, ప్రకృతి శాస్త్రాల రంగా న్నంతటినీ, ఫలప్రదంగా మరింత ముందుకు తీసుకుపోయేందుకు మన పార్టీ సర్వశక్తులా కృషి చేస్తుంది.

విజ్ఞాన శాస్త్ర రంగంలో పని చేస్తూన్నవారి మొత్తం సంఖ్య గత ఐదేళ్ళలోనూ 40 శాతం పెరిగింది. ఈనాడు వీరు దాదాపు 930,000 మంది వున్నారు. ఉరల్స్, సోవియట్ దూరప్రాచ్యం, ఉత్తర కాకసస్‌లలో కొత్త విజ్ఞానశాస్త్ర కేంద్రాల నిర్మాణం సాగుతూంది.

గత ఐదేళ్ళలోనూ సోవియట్ యూనియన్ విజ్ఞాన శాస్త్రాల అకాడమీ విస్తృతమైన, ఫలప్రదమైన కృషి సాగించింది. ఈ అకాడమీ శాస్త్ర పరిశోధనల వ్యూహాన్ని నిర్ణయిస్తుంది; సమాజానికి అవసరమైన పరిశోధనల విషయంలో అతి ఫలదాయకమైన ధోరణులనూ, పద్ధతులనూ కనిపెడుతుంది; మన శాస్త్రవేత్తలకృషి నంతటినీ జోడిస్తుంది.

అతి ముఖ్యమైన శాఖల్లో మన శాస్త్రవేత్తలు ప్రపంచంలో అగ్రస్థానాలను అలంకరిస్తున్నారు. ఈ విషయం మనకు సంతృప్తి నిస్తూంది. మన దేశంలో విజ్ఞానశాస్త్రం లక్ష్యాలుగా పెట్టుకొని అభివృద్ధి చెందుతూన్న వాటి జాబితా నంతటినీ గాని, లేదా, మౌలిక, అనువర్తిత శాస్త్రాల రంగంలో సాధించిన ముఖ్య విజయాల జాబితాను గాని యివ్వడం కష్టం, అసాధ్యం కూడా.

ఇటీవలి సంవత్సరాల్లో సోవియట్ శాస్త్రవేత్తలు మాతృదేశానికి అత్యుత్తమమైన స్వయంచాలన ట్రాన్స్‌ఫర్ లైన్లనూ, లాసర్ కిరణం పరికరాలనూ, కొత్త రకాల ఎలక్ట్రానిక్ కంప్యూటర్లనూ ప్రసాదించారు, అవసరమైన ఖనిజ నిక్షేపాలను కనిపెట్టారు, ఇంకా ఎంతెంతో చేశారు. రోదసీ పరిశోధనలో యింకా ఎక్కువ విజయాలు లభించాయి. గత ఐదేళ్ళలోనూ ఈ రంగంలో ఎంతో ముందుకు పోయాము. మానవ చోదిత సోయుజ్ రోదసీ నౌకల బృందయానాలు నిలకడగా, జయప్రదంగా సాగుతున్నాయి. స్వయంచోదిత రోదసీ నౌకతో అద్భుతమైన విజయాలను సాధించాము. చంద్రునిపై మొట్టమొదటి సారిగా రోదసీ నౌకను మెల్లగా దింపడం మొదలుకొని, చంద్ర శిలలను

భూమికి తెచ్చిన సున్నితమైన లూనా-16, నిర్విరామంగా పని చేస్తూన్న లూనాఖోద్‌ని చంద్రునిపై దింపిన లూనా-17 వరకు, శుక్ర గ్రహానికి మొట్టమొదటి యాత్ర మొదలుకొని, ఆ గ్రహం ఉపరితలం నుండి శాస్త్ర సమాచారాన్ని అందజేసే దశ వరకు ఈ విజయ యాత్ర సాగింది.

విజ్ఞానశాస్త్ర, సాంకేతిక రంగాల్లో ప్రగతి విషయంలోనూ, శాస్త్ర విజయాలను ఉత్పత్తి రంగంలో ప్రవేశపెట్టడం విషయంలోనూ, మన శాస్త్రవేత్తల ముందున్న కర్తవ్యాలను గురించి నేను యిదివరకే ప్రస్తావించాను. సామాజిక శాస్త్రాల ముందు కూడా ముఖ్యమైన కర్తవ్యా లున్నాయి. మనం సమీక్షిస్తూన్న కాలంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ ఈ విషయమై ఒక ప్రత్యేక తీర్మానాన్ని ఆమోదించింది. మార్క్సిజం-లెనినిజం పరిశోధనా సంస్థా, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ కింద వున్న సామాజిక శాస్త్రాల అకాడమీ, నిర్వర్తించవలసిన కర్తవ్యాలను పెంచడమూ, వాటిని నిర్దిష్టం చేయడమూ జరిగింది. ఇటీవలి కాలంలో విజ్ఞాన శాస్త్రాల అకాడమీ వ్యవస్థలో కొత్త మానవీయ శాస్త్రాల ఇన్‌స్టిట్యూట్‌లను నెలకొల్పారు. సోవియట్ దేశం యొక్క, విదేశాల యొక్క సామాజిక - ఆర్థిక పరిణామాలకూ, ప్రపంచ విప్లవక్రమానికీ సంబంధించిన సమస్యలను గురించి గట్టిగా పరిశోధనలు సాగించడమూ, శాస్త్రీయ సమాచారాన్ని మరింత మెరుగు పరచడమూ దీని వల్ల సాధ్యమయింది. ఇప్పుడు అత్యవసరమైనవిగా వున్న, ఇకముందు ఉండగల సమస్యల విపులీకరణ దిశగా సామాజిక శాస్త్రాలు మరింత మౌలికమైన మలుపు తిరగడం మన కిప్పుడు అవసరం.

సోవియట్ విజ్ఞాన శాస్త్ర రంగం ఘన విజయాలను సాధించింది. అయితే, మన విజ్ఞాన శాస్త్ర సంస్థల కృషిలో పెద్ద లోపాలు నేటికీ వున్నాయి. దేశానికి ప్రత్యక్షంగా, ఆచరణ పూర్వకంగా అవసరమైన వాటితోనూ, మౌలిక శాస్త్ర శాఖల నిజమైన అభివృద్ధి తోనూ సంబంధంలేని విషయాలను గురించే నేటికీ చాలవరకు కృషి సాగిస్తూన్న శాస్త్రవేత్తలు కొంద రున్నారన్న విషయం రహస్య మేమీ కాదు. నిజానికిది వ్యర్థమైన కృషి. దీనిని మనం సహించలేమన్న మాట నిస్సందేహం.

విజ్ఞానశాస్త్ర కృషికి కావలసిన కార్యకర్తల ఎంపికలో మనం మరింత నిష్కర్షగా ఉండడం అవసరం. నిజంగా సృజనాత్మకమైన పరిస్థితీ, సాహసంతో అన్వేషణలు సాగించే వాతావరణమూ, ఫలవంతమైన చర్చలూ, సోదర భావంతో కూడిన నిష్కర్షతా శాస్త్రవేత్తల సమిష్టి సంస్థ ప్రతి ఒక్క దానిలోనూ ఉండడం ముఖ్యం. తమ శాస్త్రవేత్తలు సాధించిన విజయాలకు సోవియట్ ప్రజలు ఎంతో విలువ యిస్తున్నారు; కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన అత్యవసర సమస్యలను పరిష్కరించేందుకు వారు తమ కృషిని ద్విగుణీకృతం చేస్తారని ఆశిస్తున్నారు.

కామ్రేడ్స్, కమ్యూనిస్టు నిర్మాణం మార్గాన మన సమాజం పురోగమిస్తూ ఉండ

డంతో, సోవియట్ ప్రజల దృక్పథాన్నీ, నైతిక విశ్వాసాలనూ, ఆత్మిక సంస్కారాన్నీ తీర్చిదిద్దడంలో సాహిత్యమూ, కళలూ అధికాధిక పాత్రను నిర్వహిస్తున్నాయి. అందు చేత, మన సాహిత్యంలోని, కళల్లోని సైద్ధాంతిక వస్తువు పట్ల, సమాజంలో యివి నిర్వహిస్తూన్న పాత్ర పట్ల పార్టీ ఎంతో శ్రద్ధ వహిస్తూనే వుంది. ఇది సహజమే. లెనినిస్టు-స్వపక్షాభిమాన సూత్రానికి అనుగుణంగా, అన్ని రూపాల సృజనశీల కళల అభివృద్ధినీ, కమ్యూనిస్టు నిర్మాణమనే ప్రజల మహదాశయ సాధనలో పాల్గొనే లక్ష్యంతో సాగించడమే మన కర్తవ్యమని భావిస్తున్నాము.

గత ఐదేళ్ళల్లోనూ మన సాహిత్యమూ, నాటకరంగమూ, సినిమా, టెలివిజన్, లలితకళలు, సంగీతం సోవియట్ ప్రజలకు అనేక కొత్త, ఆసక్తిదాయకమైన, ప్రతిభావంతమైన కళా ఖండాలను సమర్పించాయి. వాస్తవిక దృష్టితో, పార్టీ దృష్టితో, నగిషీలు దిద్దకుండా, లోపాలను గోరంతలు కొండంతలు చేసి చూపకుండా, మన ప్రజల గత చరిత్రనూ, ప్రస్తుత పరిస్థితులనూ చిత్రిస్తూ, కమ్యూనిస్టు విద్యాబోధకూ, కమ్యూనిస్టు నిర్మాణానికీ సంబంధించిన ముఖ్య సమస్యలపై దృష్టిని కేంద్రీకరించే కొత్త రచనలూ, నాటకాలూ, సినిమాలూ మొదలైనవి అనేకం వచ్చాయి. సోవియట్ ప్రజల బహుముఖ జీవితానికి కళాకారుడు ఎంత సన్నిహితంగా వుంటే, సృజనాత్మక ఘనకార్యాలనూ, విజయాలనూ సాధించేందుకు మార్గం అంత తిరుగులేనిదిగా ఉంటుందనేందుకు ఈ కళాసృష్టి మరొక ధ్రువీకరణ.

ఇక్కడ సింహావలోకనం చేస్తూన్న కాలంలోని సాహిత్య, కళా సృష్టిలో లెనిన్‌కు సంబంధించిన యితివృత్తం ప్రధాన స్థాన మలంకరించింది. లెనిన్‌ను గురించి ఆసక్తిదాయకమైన నవలలు, నాటకాలు, చలనచిత్రాలు అనేకం వెలువడ్డాయి. విప్లవాత్మకమైన ఉద్వేగమూ, లెనినిజం పట్ల ఉజ్వలమైన భక్తి ప్రపత్తులూ వీటిలో తొణికిస లాడుతున్నాయి.

మన రిపబ్లిక్కు లన్నిటిలోనూ, డజన్లకొలది సోవియట్ జాతుల భాషల్లోనూ, స్పష్టమైన జాతీయ రూపాల వైవిధ్యంతో సాహిత్యమూ, కళలూ ఫలప్రదంగా అభివృద్ధి అవుతూ ఉండడం ఎంతో సంతృప్తికరమైన విషయం.

మనదేశ రచయితల, కళాకారుల, వాగ్గేయకారుల, చలనచిత్ర నిర్మాతల మహాసభలు సోవియట్ కళారంగ వికాసంలో గణనీయమైన ఘట్టాలుగా పరిణమించాయి. కళాస్రష్టలైన మన మేధావుల సైద్ధాంతిక, రాజకీయ పరిణతలోని తిరుగులేని అభివృద్ధిని, తాము సృష్టించే కళాఖండాల్లోని వస్తువు పట్ల వారికి గల బాధ్యత నిస్సందేహంగా పెరిగిందన్న విషయాన్ని, యివి ప్రతిబింబిస్తున్నాయి.

సోవియట్ కళా రంగంలో పని చేస్తూన్నవారు యిటీవలి సంవత్సరాల్లో ఈ విధంగా, ఎంతో కృషి చేశారు. వారు సాధించిన ఘన కార్యాలకు మన ప్రజలు ఎంతో

విలువ యిస్తున్నారు. సోవియట్ ప్రజల్లో కమ్యూనిస్టు చైతన్యాన్ని పెంచేందుకు యివి గణనీయమైన దోహదాలు.

అయితే, కళా సృష్టి రంగంలో, ముఖ్యంగా నాణ్యత విషయంలో అంతా సవ్యం గానే ఉందని అనడానికి వీల్లేదు. వస్తువులో నిస్సారంగానూ, రూపంలో అవ్యక్తంగానూ వున్న రచనలూ మొదలైనవి నేటికీ మనకు అందుతూనే ఉన్నాయని చెప్పడం అప్రస్తుతం ఏమీ కాదు. ప్రస్తుతానికి సంబంధించిన మంచి విషయాన్నే తీసుకున్నప్పటికీ, ఆ కళా కారుడు తన సర్వశక్తులనూ, యావత్తు ప్రతిభనూ వినియోగించకుండా, అసమగ్ర వైఖ రిని అవలంబించారనే అభిప్రాయాన్ని కలిగించేవి కూడా మనకు అప్పుడప్పుడు అందు తున్నాయి. కళారంగంలో పని చేస్తూన్న వారు తమ పట్లా, తమ సహచరుల పట్లా మరింత నిష్కర్షగా వుంటారని ఆశించేందుకు మన కందరకూ హక్కు ఉన్నదని నేను అనుకుంటున్నాను.

మన సాహిత్య - కళా విమర్శ పార్టీ పంథాను మరింత దీక్షతో అనుసరించి, మరింత సూత్రబద్ధమైన వైఖరిని అవలంబించి, నిష్కర్షతను, చాకచక్యంతోనూ, కళా త్మక విలువల సృష్టికర్తల పట్ల శ్రద్ధాపూర్వకమైన వైఖరితోనూ జోడించి వున్నట్లయితే, సోవియట్ సాహిత్య, కళారంగాలు సాధించిన విజయాలు నిస్సందేహంగా మరింత ఘన మైనవిగా వుండేవి, లోపాలు మరింత శీఘ్రంగా తొలగిపోయి వుండేవి.

అంతే కాదు. మన కళా రంగ పరిణామక్రమంలో చిక్కులు తెచ్చిపెట్టిన యితర విషయాలు కూడా ఉన్నాయన్న సంగతి విస్మరించకూడదు. నేటి సోవియట్ వాస్తవికత లోని వైవిధ్యాన్ని, వ్యక్తి పూజ దుష్ఫలితాల నిర్మూలనకై పార్టీ సాగించిన కృషి ఫలి తంగా, తిరుగులేని విధంగా కాలగర్భంలో కలిసిపోయిన సమస్యల కిందికి దిగ జార్చి వేయ జూచినవారు కొందరు వుండేవారు. పార్టీ ఖండితంగానూ, సూత్రబద్ధంగానూ విమ ర్శించిన గత కాలపు పరిణామాలను మసిపూసి మారేడుకాయగా చిత్రించేందుకూ, ఇటీవలి సంవత్సరాల్లో తన ఆచరణపూర్వక, సైద్ధాంతిక కృషిలో పార్టీ ప్రవేశపెట్టిన కొత్త సృజనశీల అంశాలకు భిన్నమైన భావాలనూ, దృక్పథాలనూ అట్టే పెట్టేందుకూ, జరిగిన ప్రయత్నం కొంతమంది రచయితల్లో కనుపించిన మరొక తీవ్ర ధోరణి.

నిజానికి ఈ రెండూ కూడా, పార్టీ, ప్రజలూ యిదివరకే సాధించిన వాటి ప్రాధా న్యాన్ని తక్కువ చేసి చూపేందుకూ, ప్రస్తుత సమస్యల నుండీ, పార్టీ యొక్క నిర్మా ణాత్మకు సారథ్య సూత్రం నుండీ, సోవియట్ ప్రజల సృజనశీల కృషి నుండీ దృష్టిని మళ్ళించేందుకూ జరిగిన ప్రయత్నాలే.

సాహిత్య, కళారంగాల్లోని వారు పని చేస్తున్నది, సైద్ధాంతిక పోరాటంలోని కీలక రంగాల్లో ఒకటి. మన సైద్ధాంతిక ఆయుధాన్ని మొద్దుబార జేసేందుకూ, మన పతా

కానికి మచ్చ తెచ్చేందుకూ జరిగే ప్రయత్నాలను, ఆ ప్రయత్నాలను ఎవరు చేసినప్పటికీ, మన పార్టీ ఏనాడూ సహించలేదు, ఎన్నటికీ సహించదు కూడా. ఏ రచయిత అయినా సోవియట్ వాస్తవికతపై అభాండాలు మోపి, సోషలిజానికి వ్యతిరేకంగా పోరాడే మన సైద్ధాంతిక శత్రువులకు తోడ్పడినట్లయితే, అతడు ప్రజల ఏహ్యాభావానికి మాత్రమే పాత్రుడు.

ఈ చెడు పోకడలను ప్రస్తావిస్తున్నామంటే, అవి చెప్పుకో తగినంతగా అలముకు పోయాయని అర్థం కాదు. వీటిపట్ల పార్టీ అవలంబించిన నిర్మొహమాటమైన, సూత్రబద్ధమైన వైఖరి, సాధారణంగా సోవియట్ సాహిత్య, కళా రంగాలు అభివృద్ధి చెందుతూన్న దిశగా మరింత ఆత్మ విశ్వాసంతోనూ, మరింత గట్టి నమ్మకంతోనూ కృషి చేసేందుకు రచయితలకూ, కళాకారులకూ తోడ్పడుతుందని కేంద్రకమిటీ భావిస్తూంది. గత ఐదేళ్లుగా వారు, ఈ దిశగానే ఫలప్రదమైన కృషిని సాగిస్తున్నారు.

సోవియట్ రచయితలూ, కళాకారులూ కమ్యూనిస్టుపార్టీ నుండి చైతన్య ప్రబోధం పొందారు. ప్రజలు సాధించిన ఘన కార్యాల నుండీ, ప్రజల భావాల నుండీ వీరు ఉత్తేజం పొందారు. సృజనాత్మక కృషిలో వీరి భవిష్యత్తు, సోషలిస్టు మాతృదేశ ప్రయోజనాలతో విడదీయరాని విధంగా ముడిపడి వుంది.

సృజనశీలమైన అన్వేషణ పట్ల శ్రద్ధా పూర్వక వైఖరి, వైయక్తిక శక్తి సామర్థ్యాలూ, ప్రతిభా పూర్తిగా వికసించడం, సోషలిస్టు వాస్తవికతా వాద పద్ధతి ప్రాతిపదికపై రూపొందించిన విభిన్న రూపాల, రీతుల సంపద—మనం కోరుతున్నవి యివే. ఉదాత్తమైన ప్రజాసేవా కర్తవ్యం పట్ల ఉత్సాహాన్ని కళాకారుల్లో ప్రజ్వలింప జేయడం, కమ్యూనిస్టు పంథాల ననుసరించి సమాజాన్ని పునర్నిర్మించడంలో దృఢ విశ్వాసంతో, దీక్షతో పాల్గొనే భాగస్వాములుగా వారిని మార్చడం—పార్టీ నాయకత్వం యొక్క బలం యిందులోనే వుంది.

కామ్రేడ్స్, సాంస్కృతిక విలువలను విస్తృతంగా శ్రామిక ప్రజా బాహుళ్యం అందుబాటులోకి తేవడంతో పాటు, సోషలిజం, వారిని సంస్కృతీ స్రష్టలుగా కూడా మార్చింది. సాటిలేని జానపద కళల స్థాయి యిందుకు ప్రబల నిదర్శనం. ఈనాడు 13 మిలియన్ల మంది వయోజనులూ, 10 మిలియన్ల మంది బడిపిల్లలూ ఔత్సాహిక కళాకారుల బృందాల్లో సభ్యులుగా వున్నారు. ప్రజల సృజనాత్మక కళ, సోవియట్ వాస్తవికతలోని, మన జీవితం లోని ఒక ప్రత్యేక లక్షణం.

భారీ ప్రచార సాధనాలు—వార్తా పత్రికలు, ఇతర పత్రికలు, టెలివిజన్, రేడియో, వార్తా సంస్థలు—నవమానవుణ్ణి తీర్చిదిద్దే ముఖ్యమైన, జటిలమైన కృషిలోనూ,

పెట్టుబడిదారీ ప్రపంచానికి వ్యతిరేకంగా సాగించే సైద్ధాంతిక పోరాటంలోనూ మహా శక్తి వంతమైన సాధనాలు.

భారీ ప్రచార సాధనాల పనిని మరింత మెరుగు పరచడం, పాఠకులు, శ్రోతలు మొదలైనవారి సంఖ్యను మరింత విస్తృతం చేయడం లక్ష్యంగా పెట్టుకొని, వీటికి సంబంధించిన సమస్యలను పార్టీ కేంద్రకమిటీ, ఇక్కడ సమీక్షిస్తూన్న కాలంలో పదే పదే పరిశీలించింది.

దేశ జీవితానికి సంబంధించిన అత్యవసర సమస్యలనూ, సోవియట్ ప్రజలకు నిజంగా ఆసక్తి గల అంతర్జాతీయ వ్యవహారాలనూ మన పత్రికలూ, రేడియో, టెలి విజన్లు త్వరత్వరగా ప్రజలకు తెలియపరుస్తున్నాయి. కమ్యూనిస్టు నిర్మాణంలోని పురోగామి అనుభవాన్ని బాగా ప్రచారం చేయడంలోనూ, వర్గ శత్రువులు సాగించే సైద్ధాంతిక దాడులను తిప్పి కొట్టడంలోనూ యివి తోడ్పడు తున్నాయి.

భారీ ప్రచార సాధనాలకు మరింత ఎక్కువగా సాంకేతిక సౌకర్యాలనూ, యింకా ఎక్కువ పాదార్థిక వనరులనూ సమకూర్చడం జరిగింది; మన దేశంలోని వార్తా పత్రికల దినసరి అమ్మకం దాదాపు 140 మిల్లియన్ల వరకు వుంది, ఇతర పత్రికల అమ్మకం 150 మిల్లియన్లను మించిపోయింది. పల్లెసీమలో దిన పత్రికలకు, ఇతర పత్రికలకు చందాలు ప్రత్యేకించి పెరిగాయి. అక్కడ పత్రికల అమ్మకం ఐదేళ్ళ క్రితం 65 మిల్లియన్లు కాగా, ఇప్పుడు 107 మిల్లియన్లకు పైబడింది.

మన దేశంలో పుస్తకాలకు గిరాకీ అపారంగా వుంది. సోవియట్ ప్రజలు, ప్రపంచంలో మరే యితర జాతికన్నా ఎక్కువగా పుస్తకాలు చదువుతారని అంటారు. అది నిజమే. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ 23 వ మహాసభ తరువాత యింతవరకు గడచిన కాలంలోనే, మొత్తం 6.5 వేల మిలియన్లకు పైగా ప్రతుల్లో పుస్తకాల ముద్రణ జరిగిన విషయమూ, అందులో ఒక వేయి మిల్లియన్లకు పైగా ప్రతులు సామాజిక - రాజకీయ గ్రంథాలన్న విషయమూ ఉదహరిస్తే చాలు. ఒక్క 1969, 1970 సంవత్సరాల్లోనే లెనిన్ రచనలూ, లెనిన్ గురించిన, లెనినిజం గురించిన రచనలూ మొత్తం 76 మిల్లియన్ ప్రతులకు పైగా అచ్చయాయి. సోదర సోషలిస్టు దేశాల పుస్తకాలకు గిరాకీ ఈ సంవత్సరాల్లో పెరిగింది. 1966 మొదలుకొని 1970 వరకు సోవియట్ యూనియన్‌లో ఆ పుస్తకాల అనువాదాలు, 72 మిల్లియన్ ప్రతులుగా వెలువడ్డాయి.

మన టెలివిజన్ వ్యవస్థ కిప్పుడు చాల పెద్ద ప్రేక్షకలోకం—దేశ జనాభాలో 70 శాతం వుంది. ఉత్తర కొస ప్రాంతాలకూ, సోవియట్ దూరప్రాచ్యానికీ, సైబీరియా, మధ్యాసియాలకూ ప్రసారంచేసే ఆర్బిటా టెలివిజన్ వ్యవస్థ యిప్పుడు పనిచేయ నారంభించింది.

కామ్రేడ్స్, సైద్ధాంతిక కృషి, ప్రచారం, ప్రజాందోళనా కార్యక్రమం, పార్టీ కార్యకలాపాల్లో ఒక ముఖ్యమైన, బాధ్యతాయుతమైన రంగం. ఇందులో ఎంతో కృషి జరిగింది. అయితే, ఈ రంగంలోని పరిస్థితులు మనకు యింకా పూర్తి సంతృప్తికరంగా లేవన్న విషయాన్ని గమనించాలి. మన సైద్ధాంతిక కృషి నంతటినీ మరింత ముమ్మరం చేయడం, అందునా ముఖ్యంగా కమ్యూనిస్టు ఆదర్శాల, మన నిర్మాణ రంగంలోని నిర్దిష్ట కర్తవ్యాల ప్రచారాన్ని మరింత చురుకుగానూ, లక్ష్యశుద్ధితోనూ సాగించడం అవసరమని కేంద్రకమిటీ భావిస్తుంది. మన మహాసభ నిర్ణయాల అర్థాన్నీ, ప్రాధాన్యాన్నీ శ్రామిక ప్రజలకు పూర్తిగా అవగతం చేయడం లక్ష్యంగా పెట్టుకొని సాగించే కృషి, తక్షణ భవిష్యత్తులో పార్టీ ప్రచార, ప్రజాందోళనా కార్యక్రమాల్లో కేంద్ర స్థానం అలంకరించాలి. మన సైద్ధాంతిక దృఢ విశ్వాసాన్ని ప్రజా బాహుళ్యానికి నిజంగా తెలియజేయ గలిగి ఉండడం, సోవియట్ మానవునికి కమ్యూనిస్టు విద్యా బుద్ధులను బోధించే కార్యక్రమం పట్ల నిజంగా సృజనశీలమైన వైఖరి నవలంబించడం, ఈ రంగంలో మన కీలక కర్తవ్యం.

అతి జిత్తులమారి పద్ధతులనూ, మహా శక్తివంతమైన సాంకేతిక సాధనాలనూ ప్రయోగించి సామ్రాజ్యవాద ప్రచారక యంత్రాంగం, మన దేశానికీ, సోషలిస్టు ప్రపంచానికీ వ్యతిరేకంగా పట్టు విడువని సైద్ధాంతిక పోరాటం సాగిస్తూన్న పరిస్థితుల్లో మనం జీవిస్తున్నాము. ప్రజల మనసులను ప్రాభావితం చేసేందుకు తమవద్ద గల సాధనాలు——పత్రికలూ, సినిమా, రేడియో——అన్నిటినీ ప్రజలను మోసగించడం కోసం, పెట్టుబడిదారీ వ్యవస్థలో తాము దాదాపు స్వర్గ సుఖాలను అనుభవిస్తున్నామని ప్రజలు నమ్మే లాగా చేయడం కోసం, సోషలిజంపై అభాండాలు వేయడం కోసం, బూర్జువా వర్గం సమీకరించింది. మన దేశంలోని, సోదర సోషలిస్టు దేశాల్లోని జీవితం గురించిన కట్టు కథలతో వాతావరణాన్ని అక్షరాలా నింపివేసింది.

ఈ సైద్ధాంతిక దాడులకు సకాలంలో సమర్థవంతమైన గట్టి ఎదురుదెబ్బ తీయడం, సోషలిస్టు సమాజాన్ని గురించి, సోవియట్ జీవన విధానం గురించి, మన దేశంలో కమ్యూనిజం నిర్మాణం గురించి కోట్లాది ప్రజలకు సత్యాన్ని తెలియజేయడం, మన ప్రచారకుల, ప్రజాందోళన కారుల విధ్యుక్త ధర్మం. లక్ష్యశుద్ధితో, నమ్మకం కలిగే లాగా, అర్థమయేలాగా, సుస్పష్టంగా ఉండే లాగా ఈ పని చేయాలి. సోవియట్ యూనియన్ గురించి సత్యాన్ని తెలియజేసే గొంతు, అన్ని ఖండాల్లోనూ వినబడాలి.

కామ్రేడ్స్, సోవియట్ సమాజంలోని సాంఘిక - రాజకీయ పరిణామాలకు, ప్రజల సైద్ధాంతిక, రాజకీయ విద్యాబోధనకు, విజ్ఞానశాస్త్ర, సాంస్కృతిక రంగాల అభివృద్ధికి సంబంధించిన సమస్యలు, మనం సమీక్షిస్తూన్న కాలంలోని పార్టీ కార్యకలాపాల్లో ఈ

విధంగా పెద్ద స్థానం అలంకరించాయి. కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన ఈ రంగాల్లో గణనీయమైన పురోగమనం వుంది. అయితే, గురుతరమైన, కష్ట సాధ్యమైన కర్తవ్యాలు మనముందు యింకా వున్నాయి. పార్టీ వీటిని జయప్రదంగా నిర్వర్తిస్తుం దనేందుకూ, యావన్మంది సోవియట్ ప్రజలూ దానిని ఏకగ్రీవంగా, శక్తివంతంగా బల పరుస్తా రనేందుకూ మనకు సందేహం లేదు.

ప్రజల ఏకతా, రాజకీయ చైతన్యాలే మన పార్టీ కున్న బలం. మన శక్తికి గల ఈ మూలాధారానికి—సోవియట్ ప్రజల దుర్భేద్యమైన సైద్ధాంతిక, రాజకీయ ఏకతకు పార్టీ నిర్విరామంగా అదనపు బలాన్ని సమకూర్చుతూనే వుంటుంది.

# IV

# పార్టీ అభివృద్ధి, కొన్ని పార్టీ ఆంతరంగిక జీవిత సమస్యలు

కామ్రేడ్స్, సామాజికాభివృద్ధికి గల సాధారణ అవకాశాలను నిర్దేశించడం, సరియయిన రాజకీయ పంథాను రూపొందించడం, దానిని అమలు జరిపేందుకై శ్రామిక ప్రజలను సంఘటిత పరచడం—కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమంలో ప్రధానాంశం ఇదే. కార్మికవర్గం యొక్క యావన్మంది శ్రామిక ప్రజలయొక్క రాజకీయ నాయకశక్తిగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీ తన పాత్రను గౌరవప్రదంగా నిర్వహిస్తున్నదని, లెనిన్ నిర్దేశించిన సరియైన మార్గాన సోవియట్ ప్రజలను నడుపుతున్నదని మన యావత్తు వాస్తవిక జీవితం స్పష్టం చేస్తుంది. మన సృజనాత్మక కార్యక్రమ స్థాయి పెరిగే కొద్దీ, మనం ఎదుర్కొంటున్న సమస్యలు మరింత కష్టమయ్యే కొద్దీ, ప్రజాబాహుళ్యానికి నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టు పార్టీ పాత్రా, బాధ్యతా మరింత పెరుగుతున్నాయి.

రాబోయే ఐదేళ్ళ కాలానికి రాజకీయ పంథానూ, నిర్దిష్ట కార్యక్రమాన్నీ మన మహాసభ నిర్ణయిస్తుంది. ఈ కార్యక్రమాన్ని జయప్రదంగా పూర్తి చేయాలంటే పార్టీయొక్క, యావన్మంది ప్రజల యొక్క, సర్వశక్తులనూ సమీకరించడం అవసరం అవుతుంది. పార్టీ సంస్థల నిర్మాణ, రాజకీయ కార్యకలాపాల రూపాలు, పద్ధతులూ, ఆర్థిక, సాంస్కృతిక అభివృద్ధి రంగాలకు వాటి నాయకత్వం రూపాలూ పద్ధతులూ మన కాలం యొక్క తత్వానికి, పార్టీ ముందు, దేశం ముందు సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఇరవై నాలుగవ మహాసభ వుంచబోయే బృహత్ కర్తవ్యాలకు సాధ్యమైనంతవరకు అనుగుణమైనవిగా వుండాలి.

## 1. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం పెరుగుదల, పార్టీ ఆంతరంగిక ప్రజాస్వామ్యం అభివృద్ధి

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ 23 వ మహాసభ లెనినిస్టు నిర్మాణ సూత్రాలను ఉపయోగించుకొని, నూతన పరిస్థితులకు అనుగుణంగా వాటిని మరింత ముందుకు తీసుకొనిపోయి, పార్టీ అభివృద్ధికి సంబంధించిన మౌలిక సమస్యల విషయమై స్పష్టమైన ఆదేశాలను రూపొందించింది. ఇవి జీవశక్తిగల, సరియైన ఆదేశాలని అనుభవం నిరూపించింది.

మనం సమీక్షిస్తున్న కాలంలో పార్టీ సభ్యత్వం మరింత పెరిగింది, ఈ సభ్యత్వం స్వరూపంలో గుణాత్మకమైన అభివృద్ధి జరిగింది. నేడు సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో 14,455,321 మంది వున్నారు. వీరిలో 13,810,089 మంది సభ్యులు,

645,232 మంది ప్రొబేషన్ సభ్యులు. దేశంలోని మొత్తం వయోజనుల్లో తొమ్మిది శాతం మంది కమ్యూనిస్టులు. పార్టీ సభ్యత్వ స్వరూపం ఇలా వుంది: 40.1 శాతం కార్మికులు, 15.1 శాతం సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులు, 44.8 శాతం ఆఫీసు పనివారు. ఇక్కడ ఒక విషయం మనసులో వుంచుకోవాలి. ఈ ఆఫీసు పనివారిలో మూడింట రెండు వంతులకు పైగా ఇంజినియర్లు, వ్యవసాయ శాస్త్ర ప్రవీణులు, ఉపాధ్యాయులు, వైద్యులు, విజ్ఞానశాస్త్ర రంగలోను, సాహిత్య కళా రంగాల్లోను పనిచేస్తున్న వారు.

ఇరవై మూడవ మహాసభ తరువాత మూడు మిలియన్ల మంది సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో సభ్యులుగా చేరారు. వీరిలో దాదాపు 1,600,000 మంది, అంటే సగం మందికి పైగా కార్మికులు. మాస్కో, లెనిన్‌గ్రాడ్, స్వెర్డ్‌లోవ్‌స్క్, గోర్కీ, దోనెత్‌స్క్, కారగంద మొదలైన పెద్ద పెద్ద పారిశ్రామిక ప్రాంతాల్లోను, మరికొన్ని మండలాల్లోను ప్రొబేషను సభ్యుల్లో 60-70 శాతం మంది కార్మికులు. పార్టీ యొక్క సామాజిక స్వరూపంలో నాయక స్థానం కార్మిక వర్గానికే వుండాలన్న పార్టీ మహాసభ ఆదేశాలు, ఈ విధంగా నికరంగా అమలు జరుగుతున్నాయి. మనం యికముందు కూడా యీ పంథానే అనుసరిస్తాము. ఎందువల్లనంటే మన పార్టీ స్వభావానికి, సోవియట్ సమాజంలో కార్మిక వర్గానికి గల స్థానానికి, అది నిర్వహిస్తున్న పాత్రకు ఇది పూర్తిగా అనుగుణమైనది.

సభ్యత్వాన్ని చేర్చుకొనే సమస్య పట్ల పార్టీ సంస్థలు మరింత ఎక్కువ శ్రద్ధ చూపుతున్నాయన్న విషయాన్నీ, పార్టీలో చేరగోరే వారిపై మరింత ఎక్కువ బాధ్యతలు విధిస్తున్నాయన్న విషయాన్ని గమనించాలి. దీని ఫలితంగా సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో చేరుతున్న వారిసంఖ్య కొంత తగ్గింది. ఇరవై రెండో మహాసభకు, ఇరవై మూడో మహాసభకు మధ్య కాలంలో సంవత్సరానికి సగటున 760,000 మందిని ప్రొబేషన్ సభ్యులుగా చేర్చుకొనగా, ఇరవై మూడవ మహాసభకూ, ఇరవై నాలుగవ మహాసభకూ మధ్యకాలంలో సగటున సంవత్సరానికి 600,000 మంది ప్రొబేషన్ సభ్యులను చేర్చుకున్నారు.

పార్టీ సభత్వంయొక్క గుణాత్మక స్వరూపాన్ని మరింత మెరుగు పరచడం, పార్టీ ముఖ్యంగా శ్రద్ధ వహించ వలసిన విషయాల్లో ఒకటిగానే ఉండాలన్న అంశాన్ని, ఈ సందర్భంలో మరొకసారి నొక్కి చెప్పాలి. కొత్త సభ్యులను చేర్చుకోవడం పట్ల అధిక ఉబలాటం, విచక్షణా రాహిత్యం, పార్టీ అభివృద్ధిని గురించిన లెనినిస్టు సూత్రాలకు విరుద్ధం. దురదృష్టవశాత్తు ఈ లక్షణాలు నేటికీ కొన్ని సంస్థల్లో ప్రదర్శిత మవుతున్నాయి. పార్టీ సభ్యత్వం పెరుగుదలను క్రమబద్ధం చేసే ప్రభావాన్ని ప్రసరింపచేయడం, ఆ సభ్యత్వంలో వచ్చే తరుగుదలను కార్మిక వర్గానికీ, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతాంగానికీ, మేధావులకూ, ఉత్తమ ప్రతినిధులైన వారిని వ్యక్తిగతంగా ఎన్నిక చేయడం ప్రాతిపదికపై పూడ్చడం, పార్టీ సభ్యత్వ స్వరూపం, సోవియట్ కమ్యూ

నిస్టు పార్టీ తన కర్తవ్యాలను సాధ్యమైనంత ఉత్తమంగా నిర్వర్తించేందుకు అవకాశం కలిగించేలా చూడడం మన కర్తవ్యం.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కార్యక్రమాన్నీ, నిబంధనావళినీ అతిక్రమించే వారిని పార్టీ తన సభ్యత్వం నుండి తొలగిస్తుంది. 23 వ మహాసభ ఆదేశాల నుండి పార్టీ సంస్థలు సరియయిన నిర్ధారణలు చేసుకున్నాయన్న విషయాన్ని, పార్టీ క్రమశిక్షణను, లేదా ప్రభుత్వ క్రమశిక్షణను అతిక్రమించే వారిని, లేదా తమ పదవులను దుర్వినియోగం చేసే వారిని, కమ్యూనిస్టు అనే పేరుకి కళంకం తెచ్చే ప్రవర్తన కలవారిని మరింత దీక్షతో సభ్యత్వం నుండి తొలగించ నారంభించాయన్న విషయాన్ని గమనించాలి. దుష్ప్రవర్తనకు పాల్పడే వారిపట్ల భవిష్యత్తులో కూడా రాజీ వైఖరిని మనం అనుమతించరాదు. పార్టీ సభ్యత్వం స్వచ్ఛత పట్ల శ్రద్ధ వహించడం అన్ని పార్టీ సంస్థల యొక్క, ప్రతి ఒక్క కమ్యూనిస్టు యొక్క విధ్యుక్తధర్మం.

*కామ్రేడ్స్, పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యాన్ని మరింత అభివృద్ధి పరచడం, పార్టీ జీవితాన్ని గురించిన లెనినిస్టు ప్రమాణాలను పాటించడం, కమ్యూనిస్టుల కార్యకలాపాలను పెంచడం* అనే పంథాను, మన పార్టీ, దాని కేంద్రకమిటీ ఈ అన్ని సంవత్సరాలూ అచంచలంగా అనుసరిస్తూ వున్నాయి. ముఖ్య సంస్థలను ఎన్నికల ద్వారా ఏర్పాటు చేయాలి, అవి తమ కార్యకలాపాలకు జవాబుదారీగా వుండాలి అన్న సూత్రం పార్టీలో నికరంగా అమలు జరుగుతూంది. సమిష్టి నాయకత్వం సరళి, సమిష్టి కృషి తత్వమూ పటిష్టమయ్యాయి. పార్టీ కృషికి సంబంధించిన సమస్యలను విస్తృత ప్రజాతంత్ర ప్రాతిపదికపై చర్చించడమూ, పరిష్కరించడమూ జరుగుతూంది.

మనం ఇక్కడ సమీక్షిస్తున్న కాలంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీ విస్తృత సమావేశాలు 16 జరిగాయి. ఈ విస్తృత సమావేశాల్లో చర్చించిన మౌలిక సమస్యలను గురించి, వాటి నిర్ణయాల ప్రాముఖ్యాన్ని గురించి నేను, పార్టీ కార్యకలాపాల్లోని వివిధ అంశాలను గురించి ప్రసంగించినపుడు ప్రస్తావించాను. పార్టీ యొక్క దేశీయ, విదేశాంగ విధానాలకు సంబంధించిన అతి ముఖ్యమూ, అత్యవసరమూ అయిన సమస్యలను చర్చించేందుకు కేంద్రకమిటీ పొలిట్ బ్యూరో సమావేశాలు క్రమబద్ధంగా, వారానికి ఒక సారి జరుగుతున్నాయి. కేంద్రకమిటీ కార్యదర్శి వర్గ సమావేశాలు కూడా ప్రతివారం జరుగుతున్నాయి. ఆయా పనులకు కార్యకర్తలను ఎంపిక చేయడం పైని, అప్పగించిన పనులు ఎంతవరకు పూర్తి అయాయో తనిఖీ చేయడం పైనీ కార్యదర్శి వర్గ సమావేశాలు తమ దృష్టిని కేంద్రీకరిస్తున్నాయి. స్థానిక పార్టీ కమిటీలు కూడా ఇదే విధంగా క్రమబద్ధంగా విస్తృత సమావేశాలూ, బ్యూరో సమావేశాలూ జరుపుతున్నాయి; సమిష్టి నాయకత్వ సంస్థలుగా వ్యవహరిస్తున్నాయి.

ఇటీవల జరిగిన ఎన్నికల సందర్భంలో కూడా పార్టీ జీవితంలోని, కార్యకలాపాల్లోని ప్రజాతంత్ర సూత్రాలు కొట్టవచ్చినట్లు ప్రదర్శితమయాయి. కమ్యూనిస్టుల్లో 90 శాతం పార్టీ సభల్లో పాల్గొన్నారు; ఈ సభల్లో 3 మిలియన్ల మందికి పైగా ప్రసంగించారు. ఈ సభలూ, పార్టీ సమావేశాలూ, యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టు పార్టీ మహాసభలూ అన్నిటిలోనూ ఎంతో ఎక్కువ కృషీ, సమస్యలపై సూత్రబద్ధమైన చర్చలూ జరిగాయి. పార్టీ విధానం, పార్టీ వ్యవహారాలు, తమ తమ స్వంత సంస్థల కార్యకలాపాలూ, విజయాలూ, లోపాలూ, అపరిష్కృత సమస్యలూ, భవిష్యత్తును గురించిన నిర్ధారణలూ— వీటన్నిటిని గురించీ ఈ సభలూ, సమావేశాలూ, మహాసభల్లో కమ్యూనిస్టులు, లక్ష్యశుద్ధితో ఒకరి అభిప్రాయాలను ఒకరు తెలుసుకున్నారు. కేంద్రకమిటీ యొక్క ఆంతరంగిక, విదేశాంగ విధానాన్ని పార్టీ సంస్థలన్నీ హృదయపూర్వకంగా బలపరుస్తున్నాయని ఇవి స్పష్టం చేశాయి. మన మహత్తర లెనినిస్టు పార్టీ సభ్యుల ఏకశిలా సదృశ ఐక్యతా, సంఘీభావమూ మరొకసారి ప్రదర్శిత మయాయి.

ఇటీవలి సంవత్సరాల్లో ఆచరణ పూర్వక కార్యకలాపాల్లో చక్కగా పని చేసిన చాలా మంది కొత్త వారు పార్టీ సంస్థల్లోని నాయకత్వ కమిటీలకు ఎన్నికయారు. కార్మికులు, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులు, అన్ని సామాజిక తరగతులకు, సముదాయాలకు చెందినవారు, దేశంలోని అన్ని జాతులవారు వీరిలో ఉన్నారు. వివిధ ప్రభుత్వ, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక రంగాల వారు వీరిలో ఉన్నారు. పార్టీ సంస్థల బ్యూరోలకూ, పార్టీ కమిటీలకూ మొత్తం 423,000 మంది కార్మికులూ, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులూ ఎన్నికయారు. రెండేళ్ళ క్రితం కన్నా ఇది చాల పెద్ద సంఖ్య. జిల్లా, పట్టణ పార్టీ కమిటీ సభ్యుల్లోనూ, ప్రత్యామ్నాయ సభ్యుల్లోనూ దాదాపు 40 శాతం కార్మికులు, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతులు, మండలాల, ప్రాంతాల పార్టీ కమిటీల్లోనూ, యూనియన్ రిపబ్లిక్కుల్లోని కమ్యూనిస్టు పార్టీల కేంద్రకమిటీల్లోనూ కూడా మునుపటికన్నా ఎక్కువ మంది కార్మికులూ, సమిష్టి వ్యవసాయ క్షేత్ర రైతులూ నేడున్నారు.

మనం సమీక్షిస్తున్న కాలంలో పార్టీ ఆంతరంగిక సమాచారం విషయంలో మెరుగుదల వుంది. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ స్థానిక పార్టీ సంస్థలకూ, ఆక్టివ్‌లకూ, యావన్మంది కమ్యూనిస్టులకూ, పార్టీ కార్యకలాపాలకు సంబంధించిన కీలక సమస్యలను గురించీ, దేశం లోనూ, వెలుపలా వున్న పరిస్థితిని గురించీ సమాచారాన్ని క్రమబద్ధంగా అందజేస్తూ వుంది.

కింది నుంది పైకి, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ వరకూ అందే సమాచారం మరింత ఆచరణ సంబంధమైనదిగానూ, లక్ష్యశుద్ధితో కూడినదిగానూ వుంది. ఇటువంటి సమాచారం, పరిస్థితిని మరింత చక్కగా తెలుసుకోడానికీ, సమస్యలను పరిష్కరించేటప్పుడు, పార్టీ సంస్థల, శ్రామిక ప్రజల అనుభవాన్నీ, అభిప్రాయాలనూ మరింత

పూర్తిగా పరిగణనలోకి తీసుకోడానికీ తోడ్పడుతుంది. పార్టీ అంతరంగిక సమాచారాన్ని అందజేసు కోవడాన్ని మనం ఇకముందు కూడా మరింత మెరుగుపరుస్తూ వుండాలి; అది మరింత సమర్థవంత మైనదిగా ఉండేలా చూడాలి; నాయకత్వ నిర్వహణకూ, బోధనకూ, నియంత్రణకూ ఒక సాధనంగా దానిని మరింతగా విస్తృతంగా వుపయోగించాలి.

లోపాలను తొలగించుకొనేందుకూ, పనిని మరింత మెరుగు పరచు కొనేందుకూ ఒక పద్ధతిగా అనేక పరీక్షల్లో నెగ్గిన విమర్శ, ఆత్మ విమర్శనను, పార్టీ సంస్థల ఆచరణలో మరింత అభివృద్ధి పరచడం జరిగింది. కమ్యూనిస్టులు చేసే విమర్శలపట్లా, సూచనలపట్లా పార్టీ కమిటీల్లో ఎక్కువభాగం మరింత శ్రద్ధ వహిస్తున్నాయి; వాటిని అమలు జరపడంపై అజమాయిషీని తీవ్రం చేశాయి. కాని, ఈ విషయానికి సంబంధించిన 23 వ మహాసభ ఆదేశాల నుండి అన్ని పార్టీ సంస్థలూ, వాటిలోని నాయకత్వ శాఖలూ సరియయిన నిర్ధారణలు చేసుకోలేదని నొక్కి చెప్పవలసి వుంది. సహనమూ, చాకచక్యమూ, విమర్శలను పూర్తిగా, శ్రద్ధగా విని, వాటికి సరిగా ప్రతిస్పందించగల శక్తి కొంతమంది నాయకుల్లో కొరవడుతూంది. అయితే, విమర్శను తక్కువ అంచనా వేసి, దానిని నిర్లక్ష్యం చేసేవారు, బుద్ధిపూర్వకంగానే వైఫల్యాన్ని తెచ్చిపెట్టు కుంటున్నా రన్న మాట. సూత్ర బద్ధమైన విమర్శా, ఆత్మ విమర్శలను విస్తృతంగా అభివృద్ధి పరచడం, పార్టీ సంస్థల రాజకీయ ఆరోగ్యానికీ, పార్టీ పట్ల, ప్రజల పట్ల తమ విధ్యుక్త ధర్మాన్ని అవి సరిగానే అర్థం చేసుకున్నా యనేందుకూ సూచిక.

పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యాన్ని అభివృద్ధి పరచడం, పార్టీ క్రమశిక్షణను పటిష్ఠం చేయడంతో విడదీయరాని విధంగా పెనవేసుకొని ఉన్న విషయం. పార్టీ బలమూ, పని చేయగల శక్తి, కేంద్రీకృత ప్రజాస్వామ్య సూత్రం ఎంత నికరంగా, ఎంత సరిగా అమలు జరుగుతూంది అనే విషయంపై, అనేక విధాల ఆధారపడి వున్నాయి. ప్రజాస్వామ్యం అని చిత్రించే అరాచక, క్రమశిక్షణా రాహిత్యమూ, కమ్యూనిస్టుల చొరవకూ, కార్యకలాపాలకూ ప్రతిబంధకంగా వుండే నిరంకుశ కేంద్రీకరణా, రెండూ కూడా మార్క్సిస్టు - లెనినిస్టు పార్టీకి ఒకే విధంగా హానికరం.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ కింద వుండే పార్టీ కంట్రోల్ కమిషన్ పని, మరింత వైవిధ్యాన్ని సంతరించుకుంది. పార్టీ క్రమశిక్షణను బలపరచడానికి సంబంధించిన సమస్యను మరింత లోతుగా వివేచన చేయడమూ, కమ్యూనిస్టులు దుష్ప్రవర్తనకు పాల్పడిన సందర్భాల్లో వెంట వెంటనే ప్రతిస్పందించడమూ, యిది ప్రారంభించింది. యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టు పార్టీల కేంద్ర కమిటీలకూ, ప్రాంతీయ, మండల, పట్టణ, జిల్లా కమిటీలకూ చెందిన పార్టీ కమిషన్లు కూడా మరింత చురుకుగా పని చేస్తున్నాయి. పార్టీలో క్రమ శిక్షణను బలపరుస్తూనే ఉండడమూ, సోవియట్ కమ్యూనిస్టు

పార్టీ కార్యక్రమాన్ని బట్టీ, నిబంధనావళిని బట్టీ అవసరమైన వాటిని ప్రతి ఒక్క కమ్యూనిస్టూ బేషరతుగా నెరవేర్చేలా చూడటమూ ముఖ్యం.

పార్టీ సభ్యత్వం కార్డులను మార్చే సమస్య యిప్పుడు పార్టీ ముందుకు వచ్చింది. ఈ విషయమై కొన్ని అభిప్రాయాలను మీకు తెలుప గోరుతున్నాను. ఈ కార్డులను క్రితం సారి మార్చి పదిహేడు సంవత్సరా లయింది. పార్టీ కార్డులు చెల్లే గడువు దాటిపోయింది. పార్టీ కార్డుల మార్పు విషయాన్ని ఏదో లాంఛనంగా కాకుండా, ఒక ముఖ్యమైన నిర్మాణ, రాజకీయ చర్యగా తీసుకోవడం సరియయినదిగా వుంటుంది. పార్టీని మరింత బలపరిచే విధంగానూ, కమ్యూనిస్టుల కార్యకలాపాలనూ, క్రమశిక్షణనూ పెంచే విధంగానూ ఈ మార్పును నిర్వహించాలి. సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సంస్థాపకుడూ, నాయకుడూ అయిన వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ చిత్రపటం పార్టీ కార్డులపై ఉండాలని చాలమంది కమ్యూనిస్టులు కోరుతూన్న కోర్కెను తీర్చడం కూడా సాధ్యమవుతుంది.

కామ్రేడ్స్, కమ్యూనిస్టుల ఉన్నతమైన సైద్ధాంతిక స్థాయి, కార్యకలాపాలు, దీక్ష—ఇవే పార్టీకి గల బలం. గొప్ప సృజనాత్మక కర్తవ్యాలను పూర్తి చేయడంలో నేడు మన పార్టీ ప్రజలకు నాయకత్వం వహిస్తూంది. ప్రతి ఒక్క కమ్యూనిస్టు యొక్క, సైద్ధాంతిక, నైతిక గుణాలు ఎంత ఉదాత్తమైనవిగా వుంటే, పార్టీ యొక్క నైతిక ప్రతిష్ఠ అంత ఉన్నతమైనదిగా వుంటుంది.

దురదృష్టవశాత్తు, నిజమైన రాజకీయ యోధులుగా వ్యవహరించకుండా వుండే పార్టీ సభ్యులు యింకా వున్నారు. ఏవైనా లోపాలూ, ఇతర చెడు విషయాలూ కనిపించేటప్పుడు వీరు, చూడనట్లు నటిస్తున్నారు, "ఇది నాకు సంబంధించిన విషయం కాదు, ఇతరులు చూచుకుంటా ర"ని చెప్పే మూర్ఖుల్లాగా వ్యవహరిస్తారు. మరి కొంద రున్నారు. వారి, కార్యకలాపాలన్నీ కేవలం ప్రదర్శన కోసమే, బయటికి ఒక అభిప్రాయం కలిగించడం కోసం మాత్రమే. ఏదో ఒకటి చేయవలసిన అవసరం గురించి వీరు, తక్కిన వారికన్నా ఎక్కువగా మాట్లాడతారు, ఎప్పుడూ ఉపన్యాసాలు యిచ్చేస్తుంటారు, ప్రతి ఒక్కరినీ కార్యరంగానికి పురిగొల్పుతూనే వుంటారు. కాని, అసలు పని చేయవలసిన సమయం వచ్చేసరికి, గట్టుమీదికి పోయి కూర్చుంటారు.

ఇటువంటి ప్రవర్తనను, కమ్యూనిస్టులు నానాటికి మరింత తీవ్రంగా ఖండిస్తున్నారు. కార్య శూన్యతనూ, ఉపేక్షా భావాన్నీ పార్టీ సహించజాలదు. నువ్వు కమ్యూనిస్టు వయితే, నీ విధ్యుక్త ధర్మం చిక్కుల నుండి తప్పించుకోవడం కాదు, వెనుకబడిన వైఖరులను ప్రోత్సహించడం కాదు; రాజకీయ చైతన్యం గల, క్రియాశీలి అయిన పార్టీ యోధుడుగా ఉండడమే నీ ధర్మం, సర్వదా, సర్వత్రా—పనిలోనూ, సామాజిక కార్యకలాపాల్లోనూ, అధ్యయనంలోనూ, దైనందిన జీవితంలోనూ—కమ్యూనిస్టు, కమ్యూనిస్టుగానే వుండి తీరాలి; లెనినిస్టు పార్టీ సభ్యుడు అనే ఉన్నతమైన బిరుదుకు అర్హుడుగా వుండాలి.

## 2. పార్టీ సంస్థలను బలపరచడం. కార్యకర్తల ఎంపిక, తరిఫీదు

కామ్రేడ్స్, పార్టీ విధానాన్ని అమలు జరపడంలో, పార్టీ ప్రాథమిక సంస్థలకు చాల ముఖ్యమైన స్థానం వుంది. మన పార్టీలో నేడు 370,000 లకు పైగా ప్రాథమిక సంస్థ లున్నాయి. 23 వ మహాసభ జరుగబోయే నాటికి ఉన్నవాటికన్నా యివి, 45,000 ఎక్కువ. ఇప్పుడు సమీక్షిస్తున్న కాలంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీ, యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టుపార్టీల కేంద్ర కమిటీలు, ప్రాంతాల, మండల పార్టీ కమిటీలు, ఈ ప్రాథమిక పార్టీ శాఖల పట్ల నిరంతరం శ్రద్ధ వహించాయి. ఫ్యాక్టరీల్లోని, జాతీయ ఆర్థిక రంగంలోని, దేశ పరిపాలనా రంగంలోని వివిధ శాఖల సంస్థల్లోనూ పని చేస్తూన్న ఈ సంస్థలు చాలా వాటి కృషిని గురించి సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కమిటీలో చర్చ జరిగింది. ఈ సమస్యలను గురించి చేసిన నిర్ణయాలు, స్థానిక అనుభవాన్ని, వాస్తవ కార్యాచరణను అధ్యయనం చేసిన ఫలితంగా రూపొందినవే. నేటి అవసరాలను మరింత పూర్తిగా దృష్టిలోకి తీసుకొనేందుకూ, ప్రధాన కర్తవ్యాలను నెరవేర్చడంపై కేంద్రీకరించేందుకూ యివి పార్టీ సంస్థలకూ, ప్రాథమిక సంస్థలకూ తోడ్పడ్డాయి. ఇది మరీ ముఖ్యమైన విషయం. ఎందువల్ల నంటే, బాగా పని చేయకుండా, అవసరమైన చొరవ చూపకుండా, లోపాలతో సరిపెట్టుకొనే సంస్థలు యింకా వున్నాయి.

ప్రాథమిక సంస్థల నిర్మాణాన్ని మెరుగు పరచేందుకు చర్యలను తీసుకోవడం జరిగింది. ఉదాహరణకు, రైల్వే కూడలులలో పార్టీ కమిటీలను ఏర్పాటు చేశారు; ఉత్పత్తికి సంబంధించిన సంయుక్త సంస్థల్లోనూ, ట్రస్టుల్లోనూ సంఘటిత పార్టీ సంస్థలను రూపొందించారు. వేయి మందికి పైగా కమ్యూనిస్టు లున్న కొన్ని ప్రాథమిక సంస్థల్లో, ప్రయోగాత్మకంగా విస్తృత పార్టీ కమిటీలను ఎన్నుకోవడం జరిగింది.

ఫ్యాక్టరీల, ఆఫీసుల పనులపై పార్టీ ప్రాథమిక సంస్థల ప్రభావాన్ని యినుమడింపజేయడాన్ని కొనసాగించడం అవసరం. మేనేజిమెంటు కార్యకలాపాలను నియంత్రించే అధికారం విషయమై సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిలో వున్న అంశాన్ని నిర్దిష్టం చేయడం గురించి కమ్యూనిస్టులూ, పార్టీ కమిటీలూ చేసిన అసంఖ్యాకమైన ప్రతిపాదనలు, ఈ సందర్భంలో శ్రద్ధగా పరిశీలించ దగినవి. ఉత్పత్తి రంగంలోని పార్టీ సంస్థలతో పాటు, పరిశోధనా సంస్థల్లోనూ, విద్యా సంస్థల్లోను, సాంస్కృతిక, వైద్య సంస్థల్లోనూ వున్న పార్టీ ప్రాథమిక సంస్థలకు కూడా అధికారం ఉండాలన్నది సమస్య. కేంద్ర, స్థానిక ప్రభుత్వ, ఆర్థిక సంస్థల్లోనూ, డిపార్టుమెంటుల్లోనూ వున్న పార్టీ సంస్థలు, పార్టీ యొక్క, ప్రభుత్వం యొక్క ఆదేశాలను అమలు జరిపే యంత్రాంగం కార్యకలాపాలను నియంత్రించాలి.

ఈ నియంత్రణను అమలు జరపడంలో, ఆయా ఫ్యాక్టరీల, లేదా సంస్థల ప్రత్యే

కతలను దృష్టిలోకి తీసుకోవాలని వేరే చెప్పనక్కర లేదు. ఉదాహరణకు, మంత్రిత్వ శాఖల్లోని పార్టీ సంస్థలు, ఆ మంత్రిత్వ శాఖ కింద వున్న ఫ్యాక్టరీల, సంస్థల కార్య కలాపాలను నేరుగా ప్రాభావితం చేయజాలవు. కాని, అసలు ఆయా మంత్రిత్వ శాఖల పని వ్యవస్థీకరణను, ఆ శాఖల సిబ్బంది పార్టీ, ప్రభుత్వ శ్రమ శిక్షణను పాటించడాన్ని అజమాయిషీ చేయడం పార్టీ సంస్థ యొక్క ప్రత్యక్ష కర్తవ్యం.

స్థానిక పార్టీ సంస్థల నిర్మాణాన్ని, కార్యకలాపాలనూ మరింత మెరుగు పరచే కృషి, ఇక్కడ సమీక్షిస్తూన్న కాలంలో కూడా కొనసాగింది. తొమ్మిది మండల పార్టీ కమిటీలను—ప్రధానంగా మధ్యాసియా రిపబ్లిక్కుల్లో—ఏర్పాటు చేయడం జరిగింది: 21 పట్టణ, 38 నగర జిల్లా, 291 గ్రామీణ జిల్లా కమిటీలను నెలకొల్పడం జరిగింది. కొత్త పార్టీ సంస్థలూ, వాటిలోని నాయకత్వ సంస్థలూ ఏర్పడడంతో, అనేక ముఖ్య రంగాల్లో పార్టీ పలుకుబడిని పెంచడం సాధ్యమయింది. వాటి యంత్రాంగాన్ని, ముఖ్యంగా అప్పటి కున్న సిబ్బందితోనే ఏర్పాటు చేశారు. ఈ సందర్భంలో ఒక విషయం తెలుప గోరుతున్నాను. గత 14 ఏళ్ళల్లో సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం ఏడు మిల్లియన్ల నుండి 14 మిల్లియన్లకు, అంటే రెట్టింపు పెరిగింది; కాని, పార్టీ యంత్రాంగం సిబ్బంది మాత్రం 20 శాతానికి పైగా తగ్గిపోయింది.

ఈనాడు సోవియట్ కమ్యూనిస్టు పార్టీలో యూనియన్ రిపబ్లిక్కు కమ్యూనిస్టు పార్టీల కేంద్రకమిటీలు 14, ప్రాంతీయ కమిటీలు 6, మండల కమిటీలు 142, ప్రదేశ కమిటీలు 10, పట్టణ కమిటీలు 760, నగర జిల్లా కమిటీలు 448, గ్రామీణ జిల్లా కమిటీలు 2810 వున్నాయి.

మన పార్టీ ఎల్లప్పుడూ, అన్ని విషయాల్లోనూ సుసంఘటిత, ఏకశిలా సదృశ శక్తిగా ముందుకు రావడానికీ, దేశంలోనూ, అంతర్జాతీయ రంగంలోనూ ఆత్మవిశ్వాసంతో వ్యవహరించడానికీ, తన నెదుర్కొంటూన్న కర్తవ్యాలను జయప్రదంగా నిర్వర్తించ డానికీ చాలవరకు కారణం, రిపబ్లిక్కు, ప్రాంతీయ, మండల, ప్రాదేశిక, పట్టణ, జిల్లా పార్టీ సంస్థలు పార్టీ విధానాన్ని స్థిరంగా అమలు జరపడమూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ కేంద్రకమిటీకి నమ్మకమైన ఆధారంగా వుండడమూ అని చెప్పడానికి సకల ఆధారాలూ ఉన్నాయి.

కామ్రేడ్స్, ఈ మహాసభకు సన్నాహాల సందర్భంలో, పార్టీ లోని అన్ని విభాగా లనూ మరింత బలపరిచేందుకూ, పార్టీ పనిలోని లోపాలను తొలగించేందుకూ, పార్టీ ఆంతరంగిక జీవితాన్ని మరింత మెరుగు పరిచేందుకూ కమ్యూనిస్టులు అనేక ప్రతిపాదనలు చేశారు. ఈ ప్రతిపాదనల్లో చాలా వాటిని ఆయా చోట్లనే వుపయోగించు కోవాలి. కొన్ని, మొత్తం పార్టీకి సంబంధించినవి వున్నాయి. వాటిని ఈ మహాసభలో పరిశీలించాలి. ప్రాథమిక పార్టీ సంస్థల పాత్రను పెంచే సమస్యను గురించి ప్రస్తావిస్తూ, వీటిలో ఒక

దానిని నేను పేర్కొన్నాను. మరొక ప్రతిపాదనను గురించి ప్రస్తావించేందుకు నన్నునుమతించండి.

సోవియట్ కమ్యూనిస్టుపార్టీ సాధారణ మహాసభలను నాలుగేళ్ళ కొకసారి కాకుండా ఐదేళ్ళ కొకసారి జరపాలని చాలమంది కామ్రేడ్స్ అభిప్రాయ పడుతున్నారు. ఈ సమస్యను తేవడానికి తగు కారణా లున్నాయని అనిపిస్తూంది. మహాసభలను ఐదేళ్ళ కొకసారి జరపడంవల్ల, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, ఆర్థికాభివృద్ధి ప్రణాళికా రచనా పద్ధతికి అనుగుణంగా, ఐదేళ్ళ కాలం ఫలితాలను బేరీజు వేయగల, కర్తవ్యాలను నిర్దేశించగల స్థితిలో వుంటుంది.

యూనియన్ రిపబ్లిక్కుల కమ్యూనిస్టుపార్టీల మహాసభలను కూడా, ఇదే విధంగా ఐదేళ్ళ కొకసారి జరపాలన్న సూచన వచ్చింది. ప్రాంతీయ, మండల, ప్రాదేశిక, పట్టణ, జిల్లా పార్టీ సమావేశాలు, మహాసభలు జరిగే ఐదేళ్ళ గడువులో రెండుసార్లు జరుగుతూ ఉండాలని, అంటే రెండేళ్ళకు, లేదా మూడేళ్ళ కొకసారి జరుగుతూ ఉండాలని కోరారు. సొంత కమిటీలు గల ప్రాథమిక పార్టీ సంస్థల ఎన్నికల సభలు, సమావేశాలకు కూడా ఇదే గడువును నిర్ణయించడం మంచిదన్నది స్పష్టం. తక్కిన ప్రాథమిక, ఫ్యాక్టరీ పార్టీ సంస్థల్లో ఎన్నికలను, మునుపటిలాగానే ఏడాది కొకసారి జరపాలి.

మహాసభ ప్రతినిధులు గనుక ఈ సూచనలను ఆమోదిస్తే, వీటిని సోవియట్ కమ్యూనిస్టుపార్టీ నిబంధనావళిలో చేర్చవచ్చు.

కామ్రేడ్స్, సామాజిక జీవిత రంగా లన్నిటికీ సంబంధించిన నాయకత్వ స్థాయినీ, ప్రజా బాహుళ్యంలో సాగించే నిర్మాణ, రాజకీయ కార్యకలాపాల స్థాయినీ పెంచడం, కార్యకర్తల ఎంపికనూ, నియామకాన్నీ, తర్ఫీదునూ మరింత మెరుగు పరచడంతో విడదీయరాని విధంగా ముడిపడి వుంది. ఈ విషయంలో మన పార్టీ కిప్పుడు అపారమైన అవకాశా లున్నాయి. కార్మికుల, సమిష్టి వ్యవసాయక్షేత్ర రైతుల, మేధావుల రాజకీయ చైతన్యమూ, విద్యా, వృత్తి శిక్షణ మరింత ఉన్నత స్థాయికి పెరిగాయి. కమ్యూనిస్టు నిర్మాణ రంగా లన్నిటికీ ప్రతిభావంతులూ, సమర్థులూ అయిన నాయకులను పార్టీ పైకి తెచ్చేది వీరిలో నుండే, ప్రజల మధ్య నుండే. యూనియన్ రిపబ్లిక్కు కమ్యూనిస్టు పార్టీల కేంద్ర కమిటీలకు, ప్రాంతీయ, మండల, కమిటీలకు యిప్పుడు కార్యదర్శులుగానూ, మంత్రి మండలుల అధ్యక్షులుగానూ, ప్రాంతీయ, మండల కార్య నిర్వాహక వర్గాల అధ్యక్షులుగానూ ఉన్నవారిలో 80 శాతమూ, సోవియట్ యూనియన్ మంత్రుల్లోనూ, ప్రభుత్వ కమిటీల అధ్యక్షుల్లోనూ దాదాపు 70 శాతమూ, కార్మికులుగానూ, రైతులుగానూ జీవితం ప్రారంభించిన వారే. దేశంలో అన్నిటికన్నా పెద్దవైన ఫ్యాక్టరీల డైరెక్టర్లలో సగానికి పైగా, ఒకనాడు కార్మికులుగా పని చేసిన వారే.

ఇక్కడ సమీక్షిస్తూన కాలంలో, చాల మంది కొత్తవారు కేంద్రం లోనూ, ఆయా

ప్రాంతాల్లోనూ, పార్టీ, ప్రభుత్వ, ఆర్థిక రంగాల్లో పనికి ప్రొమోట్ అయారు. పాత కార్యకర్తల స్థానం లోనో, లేక అదనపు కార్యకర్తలుగానో యువకులను నియమించడం జరుగుతూంది.

కొన్ని ప్రాంతీయ, మండల కమిటీల కార్యదర్శులను, కొన్ని మండల కార్య నిర్వాహక కమిటీల అధ్యక్షులను, రిపబ్లిక్కు, ప్రాంతీయ, మండల అధికార సంస్థల్లోని తదితర కార్యకర్తలను మంత్రులు, ప్రభుత్వ కమిటీల అధ్యక్షులు మొదలైన కేంద్ర ముఖ్య పదవులకు ప్రొమోట్ చేయడం జరిగింది. విదేశాల్లో పని చేస్తూన్న కార్య కర్త లకు సహాయంగా పార్టీ, ప్రభుత్వ కార్యకర్తలను పంపేందుకు కేంద్రకమిటీ, ఇటీవలి సంవత్సరాల్లో తగు చర్యలు తీసుకుంది.

అద్భుతమైన రాజకీయ శిక్షణా, ప్రవీణుల శిక్షణా పొందిన చాలమంది కొత్త కామ్రేడ్స్‌ని, ఆయా ప్రాంతాల్లో, రిపబ్లిక్కు కమ్యూనిస్టు పార్టీల కేంద్ర కమిటీల, ప్రాంతీయ, మండల కమిటీల ప్రథమ కార్యదర్శి పదవులతో సహా, పార్టీ యొక్క, ప్రభుత్వ సంస్థల యొక్క నాయకత్వ స్థానాలకు ప్రొమోట్ చేయడం జరిగింది. అంతే కాదు. స్థానిక కార్యకర్తలను ప్రొమోట్ చేసే పంథాను కేంద్ర కమిటీ ఏకరీతిగా అనుస రిస్తూంది. అసాధారణ పరిస్థితుల్లో మాత్రమే, కేంద్రం లోని వారిని ఈ స్థానాలకు నియ మించడం జరుగుతూంది. కార్యకర్తల ఎంపిక, నియామకానికి సంబంధించిన ఈ విధానం, పార్టీ సంస్థల, యావన్మంది కమ్యూనిస్టుల ఆమోదాన్ని, మద్దతును పొందింది.

అనుభవజ్ఞులైన కార్యకర్తల పట్ల గౌరవభావంతో కూడిన వైఖరిని అనుసరిస్తూ వారి అనుభవాన్ని, జ్ఞానాన్ని, గరిష్ఠ స్థాయిలో ఉపయోగించు కుంటూనే, బాగా రాణించే లక్షణాలు గల యువ కార్యకర్తలను ప్రొమోట్ చేయడం, కార్యకర్తలకు సంబంధించిన మన విధాన లక్ష్యం. పార్టీ రాజకీయ పంథా, దాని విప్లవ సంప్రదాయాలూ నికరంగా ఉండడానికి తప్పనిసరిగా అవసరమైన వాటిలో యిదొకటి. సూత్రబద్ధమైన నిష్కర్షతతో పనిచేసే వారిపట్ల విశ్వాసాన్ని, గౌరవాన్ని జోడించడం, కార్యకర్తలతో వ్యవహరించే టప్పుడు అనుసరిస్తూన్న పద్ధతి. వ్యవహార సరళితోనూ, సోదర భావంతోనూ కూడిన వాతావరణాన్ని యిది ఏర్పరుస్తుంది; కార్యకర్తలు తమ శక్తి సామర్థ్యాలను మరింత పూర్తిగా ప్రదర్శించేందుకు అవకాశం కలిగిస్తుంది.

జీవితం అధికాధిక బాధ్యతలను కార్యకర్తలపై నిరంతరంగా మోపుతూంది. ఉన్నతస్థాయి రాజకీయ చైతన్యమూ, మంచి వృత్తి శిక్షణా సమ్మిళితమై వున్నవారూ, ఆర్థిక, సాంస్కృతికాభివృద్ధి సమస్యలను వైదుష్యంతో పరిష్కరించ గలవారూ, ఆధునిక మేనేజిమెంటు పద్ధతులు బాగా తెలిసినవారూ మనకు కావాలి.

కార్యకర్తల్లో కొత్త పట్ల మమకారం వంటి గుణానికి పార్టీ ఎల్లప్పుడూ ఎంతో విలువ యిస్తుంది. ఈ మమకారం ఉండడం అంటే, అభివృద్ధికి గల అవకాశాలను

గ్రహించడమూ, భవిష్యత్తులోకి చూడడమూ, ఉత్పన్నమయే సమస్యల పరిష్కారానికి తిరుగులేని మార్గాలను కనిపెట్టడమూ అన్న మాట. సామాజిక జీవితంలోనూ, ఉత్పత్తి రంగంలోనూ అతి వేగంగా, చాలదూరం పోయే మార్పులు వస్తూన్న ఈనాడు, ఈ గుణం మరింత ముఖ్యమైనది.

ప్రజలను సంఘటిత పరచడం, వారికి విద్యాబోధను సమకూర్చడం, ముఖ్య కార్య కర్తల కార్యకలాపాల్లో ప్రముఖ స్థానం అలంకరిస్తున్నాయి. ఏకవ్యక్తి అధికారం ద్వారా సంక్రమించే అధికారాలు గల నాయకుడైనా సరే, కేవలం ఆజ్ఞలు జారీ చేయడంపైని మాత్రమే ఆధారపడలేడు. ఆర్థిక, విద్యాబోధన రంగాల్లో కృషికి అంగాంగిక సంబంధం ఉండాలని పార్టీ నిరంతరం నొక్కి చెబుతూ ఉండడం యాదృచ్ఛిక మేమీ కాదు. ఆర్థిక, పరిపాలనా నిర్వహణ రంగాలను గురించి తాము చేసే నిర్ణయాలు ప్రసరింప జేసే బోధనా ప్రభావాన్ని గురించి ముఖ్య కార్యకర్తలు ఎల్లప్పుడూ ఆలోచించాలని పార్టీ కోరుతూంది.

జీవిత రహస్యాలన్నీ తనకు కరతలామలకమనీ, సర్వం తనకు తెలుసుననీ ఒక ముఖ్య కార్యకర్త ఉన్నట్లుండి అనుకోడం తరచు జరుగుతూంది. ఇతరుల అనుభవాన్నీ, జ్ఞానాన్నీ, నైపుణ్యంతో ఉపయోగించడానికి మారుగా, అన్ని సమస్యలను గురించీ అతడు ఆదేశాలు జారీ చేయడమూ, అందరినీ ఆజ్ఞాపించడమూ ప్రారంభించేది అలాంటప్పుడే. తమ పరిధిలోకి వచ్చే సమస్యలను సరిగా పరిష్కరించగల నిపుణులైన కార్యకర్తలు మనకు చాలాకాలంగా వున్నారు. వీరిపై మరింత ఎక్కువ నమ్మకం వుంచాలి; అందుకు తగినట్లుగా, మనం వారి నుండి ఎక్కువ కోరాలి కూడా.

సమిష్టి నాయకత్వాన్నీ, అప్పగించిన పనికి వ్యక్తిగత బాధ్యతనూ జోడించడం, కార్యకర్తల పెరుగుదలకూ, వారికి విద్యా బోధను సమకూర్చేందుకూ, మన యావత్తు కృషినీ సరిగా వ్యవస్థీకృతం చేసేందుకూ తప్పనిసరిగా అవసరం. సమిష్టి నాయకత్వ సూత్రాన్ని అభివృద్ధి పరుస్తూనే, లెనిన్ నిర్వచించిన రూపంలోనూ, మన పార్టీ అర్థం చేసుకొన్న రూపంలోనూ, "ఒక నిర్దిష్టమైన పనికి ఒక నిర్దిష్టమైన వ్యక్తి పూర్తిగా బాధ్యుడు" (కలెక్టెడ్ వర్క్స్, సం. 36, పుట 529) అన్నది మేనేజిమెంటు మౌలిక సూత్రాల్లో ఒకటన్న విషయాన్ని మనం జ్ఞాపకం ఉంచుకోవాలి. పార్టీ యొక్క, ప్రభుత్వం యొక్క ఆదేశాలను పూర్తి చేయడంపై సువ్యవస్థీకృతమైన నియంత్రణ, కార్యకర్తల వ్యక్తిగత బాధ్యతను యినుమడింప జేయడంలో ముఖ్యమైన పాత్రను నిర్వహిస్తుంది.

కార్యకర్తల క్రమశిక్షణనూ, బాధ్యతనూ పెంచడం మన కీలక కర్తవ్యాల్లో ఒకటి. మన దృష్టిలో ఉన్నది, భయం మీద ఆధారపడిన క్రమశిక్షణ కాదు; వ్యక్తుల ఆత్మ విశ్వాసాన్నీ, చొరవనూ హరించి వేసి, తమ మట్టుకు తమకు ప్రమాదం రాకుండా చూచుకొనే ధోరణినీ, నిజాయితీ రాహిత్యాన్నీ పెంచే క్రూరమైన నిర్వహణా పద్ధతులపై ఆధారపడే క్రమశిక్షణ కాదు. మన దృష్టిలో వున్నది, ఉన్నత స్థాయి చైతన్యమూ, బాధ్యతా

భావాలపై ఆధారపడిన క్రమశిక్షణ మాత్రమే. క్రమశిక్షణను భంగపరచే, విమర్శల నుండి తగు నిర్ధారణలను చేసుకోలేకుండా, సరిగా ప్రవర్తించ లేకుండా వుండే కార్యకర్తలపై అవసరమైన చర్యలు తీసుకోవాలి. మన దేశంలో ముఖ్య స్థానాలు ఎవరికీ, శాశ్వతమైన గుత్త సొమ్ము కావు. సోషలిస్టు క్రమశిక్షణ, సమాజంలోని వారి కందరికీ ఒక్కటే; అది ప్రతి ఒక్కరికీ శిరోధార్యం.

పార్టీ కార్యకర్తల, ప్రభుత్వ కార్యకర్తల శిక్షణ కొరకూ, పునఃశిక్షణ కొరకూ, శాశ్వతంగా పనిచేసే బోధనా తరగతుల పెద్ద వ్యవస్థ నొకదానిని ఏర్పాటు చేయడం, కార్యకర్తలతో పనిని మెరుగు పరచడంలో ఒక పెద్ద ముందంజ. ఇక్కడ సమీక్షిస్తున్న కాలంలో దాదాపు 200,000 మంది ఈ తరగతులను పూర్తి చేశారు. ఆర్థిక రంగంలోని అధికారుల, ప్రవీణుల కొరకు పునశ్చరణ సంస్థలనూ, డిపార్టు మెంటులనూ, తరగతులనూ ఏర్పాటు చేయడం జరిగింది. జాతీయ ఆర్థిక మేనేజిమెంటు ఇంస్టిట్యూట్‌ని యిటీవలనే ఏర్పరిచారు. మంత్రులతో సహా, మన పారిశ్రామిక రంగంలోని ముఖ్య కార్యకర్తలు, ఇందులో తమ తమ విషయ పరిజ్ఞానాన్ని పెంచుకుంటారు. మన దేశంలో కార్యకర్తల పునఃశిక్షణ యిప్పుడు జరుగుతున్నంత స్థాయిలో యిదివర కేనాడూ జరగలేదు; అందులో యింత ఎక్కువమంది యిదివర కేనాడూ పాల్గొనలేదు.

అయితే, గతంలోనూ, ఇప్పుడూ కూడా స్వతంత్రంగా అధ్యయనం సాగించడమే, ప్రధానమైన పద్ధతిగా ఉంది. జీవితంతో అడుగు కలిపి ముందుకు సాగాలంటే, మన కార్యకర్త లందరూ కూడా నిరంతరం అధ్యయనం చేస్తూ ఉండాలి, తమ తాత్విక, సైద్ధాంతిక స్థాయిని పెంచుకుంటూ ఉండాలి, విజ్ఞాన శాస్త్ర రంగంలోనూ, పురోగామి ఆచరణ రంగంలోనూ సాధించిన ఫలితాలను ఆకళించుకుంటూ ఉండాలి.

నవసమాజ నిర్మాణంలోని అన్ని దశల్లోనూ కూడా మన కార్యకర్తలు, తమ నెదుర్కొన్న కర్తవ్యాలను నిర్వర్తించగల సమర్థులుగా ఎల్లప్పుడూ నిరూపించుకున్నారు; తమపై ఉంచిన విశ్వాసాన్ని సార్థకం చేసుకున్నారు. పార్టీ విధానాన్ని వారు చాకచక్యంతోనూ, పట్టుదలతోనూ అమలు జరుపుతారనీ, ప్రజలకు దీక్షతో సేవ చేస్తారనీ దృఢంగా విశ్వసిస్తున్నాము.

## 3. తాత్విక, సైద్ధాంతిక రంగాల్లో పార్టీ కృషి. కమ్యూనిస్టులకు మార్క్సిస్టు-లెనినిస్టు బోధన

కామ్రేడ్స్, మన పార్టీ శాస్త్రీయ కమ్యూనిస్టుల పార్టీ. ఆధునిక కాలంలోని అత్యంత పురోగామి విప్లవ శాస్త్రమైన మార్క్సిస్టు-లెనినిస్టు శాస్త్రాన్ని అది, అచంచలంగా అనుసరిస్తూంది. ఆ శాస్త్రాన్ని మరింత అభివృద్ధి చేసేందుకు సర్వశక్తులా కృషి చేస్తూంది. సామాజిక జీవిత పరిణామం గురించీ, దాని ప్రధాన ధోరణులను గురించీ

సైద్ధాంతిక అవగాహన ఉండడంవల్ల, సామాజిక పరిణామ క్రమాలను ముందుగానే ఊహించడమూ, సరియయిన రాజకీయ పంథాను రూపొందించుకోవడమూ, పొరపాట్లూ, ఆత్మాశ్రయ నిర్ణయాలూ జరగకుండా చూచుకోవడమూ మన పార్టీకి సాధ్యమవు తూంది.

విప్లవ పోరాటంలోనూ, సోషలిజాన్నీ, కమ్యూనిజాన్నీ నిర్మించడంలోనూ మన పార్టీ, ప్రజలూ సంపాదించిన బహురూప అనుభవం, ప్రపంచ విప్లవ క్రమానికి సంబంధించిన సమస్యలు, అంతర్జాతీయ సంబంధాల్లోని ప్రస్తుత దశ ప్రత్యేకతలు—ఇవన్నీ కూడా, కేంద్రకమిటీ విస్తృత సమావేశాల నిర్ణయాల్లోనూ, అక్టోబరు విప్లవం 50 వ వార్షికోత్సవానికీ, వి. ఐ. లెనిన్ శతజయంతి ఉత్సవాలకూ సంబంధించిన పార్టీ పత్రాల్లోనూ వ్యక్తమయాయి. ఈ పత్రాలు పార్టీ సైద్ధాంతిక చింతన అభివృద్ధి ఫలితం, మన పార్టీ కేంద్రకమిటీ, శాస్త్రరంగ కార్యకర్తల, సమిష్టి కృషి ఫలితం. 1969 నాటి కమ్యూనిస్టు, వర్కర్స్ పార్టీల అంతర్జాతీయ సమావేశం సందర్భంలోనూ, అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలోని ముఖ్య ఘటనలైన కార్ల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగెల్సుల 150 వ జయంతి ఉత్సవాలు, పారిస్ కమ్యూన్ శతవార్షికోత్సవాల్లాంటి వాటి సందర్భంలోనూ ఎంతో సైద్ధాంతిక కృషి జరిగింది.

అన్నిటికన్నా గొప్ప విప్లవానికి నాయకుడుగానూ, సిద్ధాంతకారుడుగానూ, కార్మిక వర్గ పార్టీ నిర్మాతగానూ, ప్రపంచంలో ప్రప్రథమ సోషలిస్టు రాజ్య సంస్థాపకుడుగానూ లెనిన్ పాత్రను మరింత సమగ్రంగా చిత్రించే మౌలిక రచనలు, ఇప్పుడు సమీక్షిస్తూన్న కాలంలో వెలువడ్డాయి.

ఎల్లకాలం జీవద్వంతంగానూ, అభివృద్ధి పొందుతూనూ ఉండే బోధ అయిన లెనినిజం, గతంలోనూ, ఇప్పుడూ కూడా పార్టీ సైద్ధాంతిక జీవితంలో కేంద్ర స్థానం అలంకరిస్తూనే ఉంది, ఇకముందూ అలంకరిస్తుంది; పార్టీయొక్క విప్లవకర, పరివర్తనాత్మక కార్యకలాపాలకు పునాదిగానూ ఉంది, ఇకముందూ ఉంటుంది. లెనిన్ యొక్క సైద్ధాంతిక వారసత్వాన్ని ఉపయోగించుకుంటూ, కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన అత్యవసర సమస్యలకు, లెనిన్ భావాలనూ, లెనిన్ పరిశీలనా పద్ధతినీ ప్రాతిపదిక చేసుకొని పరిష్కారాలను కనిపెట్టడం తన ప్రప్రధాన కర్తవ్యమని పార్టీ భావిస్తూంది.

కమ్యూనిజానికి పాదార్థిక, సాంకేతిక పునాదులను నిర్మించే మార్గాలను చాలవరకు ఇటీవలి సంవత్సరాల్లో నిర్దిష్టంగా తెలియజేయడం జరిగింది. ఆధునిక ప్రణాళికా రచనా, మేనేజిమెంటు పద్ధతులనూ, ఆర్థికరంగ సామర్థ్యాన్ని పెంచే మార్గాలనూ విపులీకరించడం, పాదార్థిక, నైతిక ప్రోత్సాహకాలను మరింత మెరుగుపరచడం—పార్టీ చింతన లక్ష్యాలు ఇవే. ప్రస్తుత దశలో పార్టీ వ్యావసాయిక విధానానికి సంబంధించిన మౌలిక సమస్యల విపులీకరణకు సైద్ధాంతిక ప్రాధాన్యం ఎంతగానో ఉంది.

కమ్యూనిస్టు పార్టీ యొక్క నాయకత్వ పాత్రను గురించిన బోధనను అభివృద్ధి

పరచడం పట్ల ఎంతో శ్రద్ధ వహించడం జరిగింది. విప్లవోద్యమానికీ, నవ సమాజ నిర్మాణానికీ సంబంధించిన మౌలిక సమస్యల్లో ఇదొకటని ప్రతి ఒక్కరికీ తెలుసు. ప్రధానంగా ఈ సమస్యపై నే నేడు, మార్క్సిస్టు-లెనినిస్టులకూ, రకరకాల రివిజనిస్టులకూ మధ్య పోరాటం సాగుతూంది. సోవియట్ కమ్యూనిస్టు పార్టీ యొక్క సూత్రబద్ధమైన వైఖరికీ, పార్టీని గురించిన మార్క్సిస్టు-లెనినిస్టు బోధ స్వచ్ఛతను కాపాడేందుకు అది అచంచల దీక్షతో సాగిస్తూన్న పోరాటానికీ అంతర్జాతీయ ప్రాధాన్యం ఉంది. సోదర పార్టీలు నొక్కి చెప్పినట్లు, సరియయిన పంథా ననుసరించేందుకు ఇవి, కోట్లాది కమ్యూనిస్టులకూ, శ్రామిక ప్రజలకూ తోడ్పడుతున్నాయి.

మన దేశ చరిత్రను సరిగానూ, పక్షపాత దృష్టి లేకుండానూ చిత్రించడానికి పార్టీ ఎంతో ప్రాధాన్యాన్నిచ్చింది. పార్టీతోనూ, వర్గంతోనూ నిమిత్తంలేని దృక్పథాలతో సోవియట్ ప్రజల చరిత్రను బేరీజు వేసేందుకూ, వారు సాధించిన సోషలిస్టు విజయాల ప్రాధాన్యాన్ని తగ్గించి చూపేందుకూ జరిగిన ప్రయత్నాలను నిశితంగా, న్యాయంగా విమర్శించడం జరిగింది. అదే సమయంలో, ఇటీవలి సంవత్సరాల్లో మన సామాజిక జీవితంలో వచ్చిన గొప్ప మార్పులను నిర్లక్ష్యం చేసిన పిడివాద భావాల నిస్సారతను పార్టీ బయట పెట్టింది.

వ్యక్తి పూజయొక్క, ఆత్మాశ్రయవాద పొరపాట్ల యొక్క దుష్ఫలితాలను తొలగించడం, దేశంలోని సాధారణ రాజకీయ పరిస్థితిపైనీ, అన్నిటికన్నా ముఖ్యంగా సైద్ధాంతిక పరిస్థితిపైనీ సత్ప్రభావాన్ని ప్రసరింప జేసిందని, గత సంవత్సరాల అనుభవం తిరుగులేని విధంగా నిరూపించింది. మనం, ఇంతవరకు మార్క్సిజం-లెనినిజం మౌలిక సూత్రాలకు బద్ధులమయే ఉన్నాము, ఇకముందూ ఉంటాము; సిద్ధాంత సమస్యల విషయంలో ఎన్నటికీ రాజీపడము.

పాలక పార్టీలుగా ఉన్న ఇతర కమ్యూనిస్టు పార్టీలతో కలిసి, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ, ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ అభివృద్ధికి సంబంధించిన మౌలిక సమస్యల స్పష్టీకరణను కొనసాగిస్తూనే వచ్చింది. సోషలిస్టు నిర్మాణానికి సంబంధించిన సార్వత్రిక నియమాల ప్రత్యేక లక్షణాలను నిర్దిష్టం చేయడమూ, ఇప్పటికే నిర్మించిన సోషలిజం యొక్క ప్రధాన లక్షణాలను మరింత పూర్తిగా వెల్లడి చేయడమూ, ఒకరి అనుభవాన్ని ఒకరు అధ్యయనం చేయడంవల్లా సామాన్యీకరించడం వల్లా సాధ్యమయింది. సోదర దేశాల మధ్య, పార్టీల మధ్య సహకార క్రమంలో ఉత్పన్నమైన ఆర్థిక విలీనీకరణ మొదలైన సమస్యలకు సంబంధించిన సూత్రాలను రూపొందించడం పట్ల ప్రత్యేక శ్రద్ధ వహించడం జరిగింది.

ఆధునిక పెట్టుబడిదారీ విధానం అభివృద్ధిలోని కొత్త పరిణామాన్నీ, ప్రపంచంలోని సోషలిస్టేతర భాగం పరిణామాన్ని ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ ప్రాభావితం చేసే మార్గా

లనూ, సాధనాలనూ వివేచన చేయడానికీ, పెట్టుబడిదారీ ఆర్థిక వ్యవస్థలోని కొత్త పరిణామ క్రమాలను, ముఖ్యంగా శాస్త్ర, సాంకేతిక రంగాల్లోని విప్లవ ప్రభావంవల్ల వచ్చిన పరిణామక్రమాలను అధ్యయనం చేయడానికి పార్టీ సైద్ధాంతిక కార్యకలాపాల్లో పెద్ద స్థానాన్ని ఇవ్వడం జరిగింది.

మన ఉమ్మడి అంతర్జాతీయతా, విప్లవ విధ్యుక్త కర్తవ్యంలో సైద్ధాంతిక కృషి ఒక ప్రధానాంశం. ప్రపంచ రంగంలో పెట్టుబడివారీ విధానానికీ, సోషలిజానికీ మధ్య సాగుతూన్న పోరాటాన్ని బట్టీ, విప్లవ బోధనను నిస్సారం చేసేందుకూ, సోషలిస్టు, కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన ఆచరణను వక్రీకరించేందుకూ నానారకాల రివిజనిస్టులు చేస్తూన్న ప్రయత్నాలను బట్టీ, సిద్ధాంతానికి సంబంధించిన సమస్యల పట్లా, దానిని సృజనాత్మకంగా అభివృద్ధి చేయడంపట్లా మనం ఇకముందు కూడా అచంచలమైన శ్రద్ధను వహిస్తూ ఉండడం అవసరమవుతూంది. కాలదోషం పట్టిపోయిన సందర్భాల్లో కూడా పాత సూత్రీకరణలనే వల్లిస్తూ ఉండడమూ, కొత్త సమస్యలపట్ల కొత్త వైఖరిని అవలంబించలేక పోవడమూ, ఆశయానికి హాని కలిగిస్తాయి; రివిజనిస్టు నకిలీ మార్క్సిజం-లెనినిజం వ్యాపించేందుకు అదనపు అవకాశాలను కలిగిస్తాయి. మన సిద్ధాంత, ఆచరణలపై సాగే బూర్జువా, రివిజనిస్టు దాడులపై మన విమర్శ, సామాజిక శాస్త్రాలను, మార్క్సిస్టు-లెనినిస్టు సిద్ధాంతాన్ని ఆచరణ పూర్వకంగానూ, సృజనాత్మకంగానూ అభివృద్ధి పరచడంపై ఆధారపడి ఉన్నప్పుడు మరింత తిరుగు లేనిదిగా ఉంటుంది.

కామ్రేడ్స్, ఈ విధంగా ఎంతో సాధించటం జరిగింది. అయినప్పటికీ, మన సైద్ధాంతిక కృషిలో అంతా సంతృప్తికరంగానే వుందని కేంద్రకమిటీ భావించటం లేదు. అనేక సమస్యలను రేఖామాత్రంగా చిత్రించడం జరిగింది; వాటిని క్షుణ్ణంగా విపులీకరించవలసి వుంది. సిద్ధాంతాన్ని అభివృద్ధిపరచేందుకు, శాస్త్ర సంస్థల కార్య కలాపాలను మెరుగు పరచేందుకు పార్టీ యింకా ఎంతగానో శ్రద్ధ వహించవలసి వుంది. పార్టీ ఆచరణ పూర్వక కృషితో, ప్రభుత్వ కార్యకలాపాలతో, కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన నిర్దిష్ట కర్తవ్యాలతో సామాజిక శాస్త్రాలకు సన్నిహిత బంధం ఏర్పరదేలా చేయవలసి వుంది.

కమ్యూనిస్టులు పూనికతో మార్క్సిస్టు-లెనిస్టు సిద్ధాంతంలో నిష్ణాతులవాలి; సామాజిక పరిణామనియమాలను తెలుసుకోవాలి; జీవితానికి సంబంధించిన నూతన పరిణామాల్లో ఆత్మవిశ్వాసంతో తమ స్థానాన్ని అలంకరించగల శక్తిని సంపాదించు కోవాలి; ఈ నూతన పరిణామాలను సరిగా అంచనా వేసి, సరయిన ఆచరణ పూర్వక నిర్ధారణలకు రావాలి. ఇది చాలా ముఖ్యమని పార్టీ భావిస్తూ వుంది. పార్టీ శ్రేణుల సమరశీలతను యినుమడింప జేసేందుకు కమ్యూనిస్టులు సైద్ధాతికంగా ఆరితేరి వుండటం తప్పనిసరిగా అవసరం.

మార్క్సిస్టు-లెనినిస్టు విద్యా బోధనా వ్యవస్థను మెరుగుపరచే విషయంలో, 23 వ మహాసభ తదుపరి, పార్టీ సంస్థలు ఎంతో సాధించాయి. మనకు సమగ్రమైన పార్టీ విద్యా

బోధనా వ్యవస్థవుందన్న సంగతి మీ అందరకూ తెలిసినదే. ఇది మూడు అంచీలు-ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత అంచీలతో కూడిన వ్యవస్థ. పార్టీ సిద్ధాంతాన్ని, చరిత్రను, విధానాన్ని నిరంతరాయంగా అధ్యయనం చేసేందుకు యిది వీలు కలిగిస్తుంది; పార్టీ కమిటీలు కమ్యూనిస్టులకు అధ్యయన తరగతులను ఏర్పాటుచేయ తలపెట్టినప్పుడు. వారి శిక్షణా స్థాయిని, ఆసక్తినీ దృష్టిలో వుంచుకొనేందుకు యిందువల్ల వీలు కలుగుతుంది. ఆర్థిక విషయాల బోధన స్థాయిని పెంచేందుకు చర్యలు తీసుకోవటం జరిగింది. నేటి పరిస్థితుల్లో వీటి బోధనకు గణనీయమైన ప్రాముఖ్యం వుంది. మొట్ట మొదటి సారిగా, అన్ని స్థాయిల్లోనూ పార్టీ విద్యా బోధనకు అవసరమైన పాఠ్య గ్రంథాలను, సంగ్రహ గ్రంథాలనూ సిద్ధంచేసి భారీ సంఖ్యలో ప్రతులను ముద్రించారు. పార్టీ విద్యా వ్యవస్థక్రింద ఈనాడు 16 మిలియన్ల మందికి పైగా అధ్యయనం చేస్తున్నారు. పదిలక్షల సంఖ్యా బలంగల గొప్ప ప్రచారక దళం మనకు వుంది.

అదే సమయంలో కొన్ని పార్టీ కమిటీలు, ఈ పనిపై తగినంత శ్రద్ధ వహించటం లేదని చెప్పాల్సి వుంది. మార్క్సిస్టు- లెనినిస్టు సిద్ధాంత అధ్యయనం ప్రాముఖ్యాన్ని తక్కువ అంచనా వేసే టటువంటి, తమ తాత్విక, సైద్ధాంతిక స్థాయిని మెరుగు పరచుకోనటువంటి కమ్యూనిస్టులు కొందరు నేటికీ వున్నారు; వారికి సంబంధించిన పార్టీ కమిటీ లేమో, వారికి అవసరమైన బాధ్యతల నప్పగించటంలో విఫలమవుతున్నవి.

కమ్యూనిస్టుల, మార్క్సిస్టు-లెనినిస్టు విద్యాధ్యయనం, దాని స్థాయినిబట్టి మాత్రమే గాక ప్రధానంగా దాని సైద్ధాంతిక, రాజకీయ ప్రాధాన్యాన్నిబట్టి ఎంతో ముఖ్యమైంది. ఈ రంగంలో కృషిని మరింత మెరుగుపరచటం, రాజకీయ అధ్యయనాన్ని కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన నిర్దిష్ట కర్తవ్యాలతో మరింత సన్నిహితంగా ముడి పెట్టటం, యావన్మంది పార్టీ సభ్యుల చైతన్యాభి వృద్ధిపైనా, వారి కార్యకలాపాలపైనా దానికి మరింత గట్టి ప్రభావం వుండేలా చూడటం మన కర్తవ్యం. పార్టీ ప్రచారకులపై సరికొత్త బాధ్యతలు పడుతున్నవి. వీరి ఎంపిక గురించీ, శిక్షణ గురించీ ప్రత్యేక శ్రద్ధ వహించటం అవసరం.

కామ్రేడ్స్, ఈ విధంగా 23 వ మహాసభ అనంతర కాలంలో సోవియట్ కమ్యూనిస్టు పార్టీ శ్రేణుల సిద్ధాంత, రాజకీయ, నిర్మాణ ఐక్యతా, కమ్యూనిస్టుల కార్యకలాపాలూ మరింతగా పెరిగాయి; ప్రజా బాహుళ్యంతో పార్టీ బంధాలు పటిష్టమయాయి.

పార్టీ యొక్క, యావన్మంది సోవియట్ ప్రజలయొక్క ప్రయోజనాల ఏకత మన సమాజాన్ని అజేయమైనదిగా చేస్తూవుంది; ఎలాంటి గడ్డుపరీక్షలకైనా తట్టుకొని నిలువగల శక్తిని దానికి ప్రసాదిస్తూవుంది. పార్టీ యొక్క, సమస్త శ్రామిక ప్రజలయొక్క అభేద్యమైన ఐక్యతవల్లనే మనం ఆత్మవిశ్వాసంతో ముందుకు సాగి పోగలుగుతున్నాం, అతిజటిల సమస్యలను పరిష్కరించ గలుగుతున్నాం, శ్రామిక ప్రజల విశ్వాసానికి పార్టీ అన్నిటి

కన్నా ఎక్కువ విలువనిస్తూవుంది; ప్రాణప్రదంగా ఎంచుకుంటూ వుంది. మన మహత్తర పార్టీని సర్వ విధాలా పటిష్టం చేసుకోవాలి; ప్రజాబాహుళ్యంతో మన సంబంధాలను ప్రగాఢం గావించుకోవాలి—ఇదే లెనిన్ మహాశయుడు మనకు యిచ్చిన ఆదేశం—లెనిన్ ఆదేశాలకు మనం కట్టుబడి వుంటాం!

* * *

కామ్రేడ్ ప్రతినిధులారా, గడచిన ఐదేళ్ళలో తన కృషి ఫలితాలను గురించీ, భవిష్యత్తులో పార్టీ ప్రధాన కర్తవ్యాల గురించీ, మన దేశ అభివృద్ధి అవకాశాల గురించీ, కేంద్ర కమిటీ మీకు నివేదించింది.

ఆచరణ పూర్వక అనుభవం ద్వారా వచ్చిన ఫలితాలను, విలువైనవిగా, బోధనాత్మకమైనవిగా తేలిన దాన్నంతటినీ బేరీజు వేయటమూ, లోపాలను విమర్శించటమూ, వాటిని సరిచేసే మార్గాలను కనిపెట్టటమూ, పార్టీ మహాసభల ముఖ్య కర్తవ్యాలలో ఒకటని లెనిన్ తమ కాలంలో పదే పదే నొక్కి చెప్పారు. ఈ మహాసభ ప్రతినిధులంతా పార్టీ ఎడా, ప్రజలఎడా గొప్ప బాధ్యతా భావంతో, మన పార్టీలో ఆచారంగా వున్న పద్ధతి ననుసరించి, కేంద్రకమిటీ నివేదిక గురించిన చర్చల పట్ల సూత్రబద్ధమైన, వ్యవహార సరళి వైఖరిని ప్రదర్శించగలరనటంలో ఎలాంటి సందేహం లేదు.

మన ప్రణాళికలు వాస్తవికమైన అంచనాలపై ఆధారపడినవి; అవి దేశ అవసరాలను, వనరులను, అవకాశాలను లెక్కలోకి తీసుకుంటున్నవి. కొత్త పంచవర్ష ప్రణాళిక ముసాయిదా ఆదేశాలపై జరిగిన చర్చలనుబట్టి, పార్టీ, యావన్మంది ప్రజలూ ఈ ప్రణాళికలను మనఃపూర్వకంగా ఆమోదిస్తున్నారనీ, బలపరుస్తున్నారనీ నిరూపితమైంది. ఈ ప్రణాళికలు పూర్తి కావటమన్నది మనలో ప్రతి ఒక్కరి కృషిపైనా, మన నిర్మాణంపైనా, క్రమశిక్షణ పైనా, మన సామర్థ్యం పైనా, పట్టుదలపైనా ఆధారపడి వుంటుంది. నిర్ణయించుకున్న ఈ కర్తవ్యాల సాధన కోసం ఉద్యమించేందుకై ప్రజా బాహుళ్యాన్ని సమీకరించటం, కమ్యూనిస్టు నిర్మాణానికి సంబంధించిన లెనినిస్టు కార్యక్రమానికి అండగా యావత్తు ప్రజానీకాన్నీ మరింత సన్నిహితంగా ఐక్యపరచటం పార్టీ యొక్క, సమస్త పార్టీ సంస్థల యొక్క ప్రధాన కర్తవ్యం.

కామ్రేడ్స్, మనకు అనంతమైన అవకాశాలున్నవి. మన దేశ ఆర్థికశక్తి మును పెన్నడూ లేనంత అధికంగా వుంది. సోవియట్ విజ్ఞానశాస్త్ర, సాంస్కృతిక రంగాలు నూతన శిఖరాల నందుకున్నవి. మన ప్రజల నైతిక, రాజకీయ ఐక్యత అభేద్యమైనది. సోషలిస్టు మిత్రులతోనూ, బంధువులతోనూ భుజం భుజం కలిపి ముందుకు సాగుతున్నాం. యావత్ ప్రపంచంలోని విప్లవ శక్తులతో మన సమరశీల బాంధవ్యం నానాటికీ మరింత పటిష్ట మవుతున్నది.

దేనికోసమైతే మనం కృషి చేస్తున్నామో, దానంతటినీ సాధించ గలమనీ, నిర్ణ

యించుకున్న కర్తవ్యాలను జయప్రదంగా నిర్వహించగలమనీ మనకు తెలుసు. సోవియట్ ప్రజల సృజనాత్మకమైన ప్రతిభ, వారి నిస్వార్థకృషి, లెనిన్ నిర్దేశించిన మార్గంలో పట్టుదలతో పురోగమిస్తున్న కమ్యూనిస్టుపార్టీ వెనుక వారి ఐక్యత—ఇవే అందుకు గతంలోనూ, ఈనాడూ, భవిష్యత్తులోనూ కూడా హామీ.

సోవియట్ కమ్యూనిస్టు పార్టీ—యావన్మంది ప్రజల సమరశీల అగ్రదళమైన లెనిన్ పార్టీ వర్ధిల్లు గాక!

శాంతికీ, జాతులమధ్య స్నేహానికీ మూలస్తంభమైన సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్కుల సమాఖ్య వర్ధిల్లుగాక, మరింత పటిష్ఠ మగు గాక!

ప్రపంచ సోషలిస్టు వ్యవస్థ, అంతర్జాతీయ కార్మికోద్యమం, జాతీయ, సామాజిక విముక్తులకోసం పోరాడుతున్న యోధులు—ఈ విప్లవశక్తుల శక్తివంతమైన బాంధవ్యం మరింత బలం చేకూర్చుకొను గాక, విజయ పరంపర సాధించు గాక!

చిరస్థాయి అయిన, అజేయమైన మార్క్స్-ఎంగెల్స్-లెనిన్ బోధల పతాకాన్ని సమున్నతంగా ఎత్తి పట్టండి! కమూనిజ్యం వర్ధిల్లుగాక!

కమ్యూనిజం నిర్మాతలైన సోవియట్ మహా ప్రజలకు జేజేలు!

# సోవియట్ సమీక్ష

సంవత్సర చందా

రూ. 4-00

సోవియట్ భూమి కార్యాలయం,

టి. నగర్, మద్రాసు-17.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA134M152 |
| పుస్తకం పేరు | శైవవాణి |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 141 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | (i),136, BC, |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Ruksana |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | S. Lakshmi |
| పరీక్ష చేసినది | RUKSANA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |